# హేతువాద ప్రశ్నలు







# సత్యవాద జవాబులు


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





# హేతువాద ప్రశ్నలు సత్యవాద జవాబులు


రచయిత

త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (79) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38   ప్రథమ ముద్రణ : సెప్టెంబరు–2016

ప్రతులు : 1000   వెల :**115/-**

02 యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
81) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
82) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
83) దైవగ్రంథములలో సత్యాసత్య విచక్షణ
**84) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**85) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**86) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**87) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

**భాషలో పాండిత్యమును వదలి భావములో**
**పాండిత్యమును చూచువాడు నిజమైన జ్ఞాని**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-
లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-
మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.

DVD'S

60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు
చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
ప్రథమ వాక్యములు
117. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# హేతువాద ప్రశ్నలు - సత్యవాద జవాబులు

ముందు ప్రశ్న వుంటే తర్వాత జవాబు ఉంటుంది. ముందు ప్రశ్న తర్వాత జవాబు ఉండడము న్యాయము అంటాము. ముందు జవాబు తర్వాత ప్రశ్న ఉండకూడదు. అలా ఉండడము అన్యాయము అనీ, సరైన పద్ధతి కాదనీ చెప్పవచ్చును. రామాయణము అంతా విన్న తర్వాత రామునికి సీత ఏమవుతుంది? అని అడిగితే ముందు జవాబు వెనుక ప్రశ్న అన్నట్లగును. అది అన్యాయమైన ప్రశ్న అని చెప్పవచ్చును. అట్లని రామాయణము చెప్పకముందే రామునికి సీత ఏమవుతుందని అడగడము కూడా న్యాయబద్ధమైన ప్రశ్న కాదు. రామాయణమును చెప్పిన తర్వాత అందులో రాముని విషయముగానీ, సీత విషయముగానీ లేకపోతే అప్పుడు సీతకు సంబంధించిగానీ, లేక రామునికి సంబంధించిగానీ ప్రశ్నను అడుగవచ్చును. అప్పుడు అది న్యాయబద్ధమగును. అట్లే రామాయణము నంతటినీ చెప్పిన తర్వాత రామున్ని గురించిగానీ, లేక సీతను గురించిగానీ అడిగితే అంతవరకు వినినది వానికి ఏమాత్రము అర్థము కాలేదని చెప్పవచ్చును. అప్పుడు వానికి గ్రహించుకొను శక్తి లేదని కూడా చెప్ప వచ్చును. అటువంటి వానికి ఒకమారు చెప్పినా, రెండుమార్లు చెప్పినా లేక మూడుమార్లు చెప్పినా వాడు గ్రహించుకోలేడు. అందువలన వృథా ప్రయాసేయగును. గ్రహించుకోలేని దానికి సరైన కారణమున్నప్పుడు, చెప్పబడిన విషయము ద్వంద్వార్థములతో కూడుకొని యున్నప్పుడు, వేరు విధముగా గ్రహించుకొను అవకాశము గలదు. అప్పుడు వినేవానిదే పూర్తి తప్పు కాదు. కొంత భాషది, కొంత చెప్పేవానిది లోపముండవచ్చును. అటువంటప్పుడు ఎదుటివాడు అడిగిన ప్రశ్నకు జవాబు ఇవ్వవచ్చును.

వ్రాయబడే వ్రాతలలో కల్పిత పురాణములు గలవు, జరిగిన చరిత్రలు గలవు, ఆధ్యాత్మిక రహస్యములు, సబద్ధతతో కూడుకొన్న

శాస్త్రములు మొదలగునవి గలవు. మేము వ్రాయు ఆధ్యాత్మిక రహస్యములకు సబద్ధతతోకూడిన శాస్త్రమును ప్రమాణముగా చూపుచూ వ్రాయుచున్నాము. కొన్నిచోట్ల అదేపనిగా మొదట తప్పు చెప్పి, తర్వాత నిజము చెప్పుట సక్రమమైన పద్ధతిగా యుండును. అలాంటి సమయ సందర్భములలో అలాగే చెప్పవలసియుంటుంది. అయితే అది కొందరికి తప్పుగా కనిపించును. అప్పుడు ఆ తప్పును గురించి కొందరు అడుగ వచ్చును. కొందరు చూచే వారికి, చెప్పిన వానికి సరిగా తెలియదను నట్లు తెలిసియుందురు. **"ముందు అసత్యము తర్వాత సత్యము"** అను వరుస క్రమము వారికి తెలియదు కనుక కొందరు ప్రశ్నించుట సహజమే. చెప్పిన వానిదీ సక్రమమే, ప్రశ్న అడిగిన వానిదీ సక్రమమే. అయితే ప్రశ్నించిన వాని ప్రశ్నకు రెండవ మారు జవాబు చెప్పవలసియుండడమే కాక, ముందు అసత్యమును చెప్పవలసిన అవసరమును కూడా వివరించి చెప్పవలసి యుంటుంది.

చిన్న పిల్లలకు కొన్ని విషయములలో అసత్యమే చెప్పాలి. తర్వాత కొంత కాలమునకు వారు వయస్సులో పెద్దవారయినప్పుడు సత్యమును చెప్పవచ్చును. మొదట అసత్యమును ఎందుకు చెప్పాలి? అంటే వాని మెదడు అసత్యమును మాత్రము గ్రహించుకొనునదై యుండును. అప్పుడు సత్యమును గ్రహించుకొనునదై యుండదు. చిన్న పిల్లవాడు ఇల్లు వదలి బయటికి పోతే బజారులోని రద్దీకి అతను ప్రమాదములో పడును. బయటికి పోవద్దు ప్రమాదములు జరుగవచ్చునని చెప్పితే, ప్రమాదమంటే ఏమిటో తెలియని పిల్లవాడు చెప్పిన మాటను అర్థము చేసుకోలేడు. అందువలన ఆ వయస్సులోని పిల్లలకు "ఇంటి బయట బస్సుల ప్రమాదములు జరుగవచ్చును బయటికి పోవద్దు" అని చెప్పుటకంటే,

"బయట బూచోడు యున్నాడు. వాడు ఇంటి బయటే పిల్లల కొరకు కాచుకొని ఉంటాడు. ఎవరయినా పిల్లలు బయటికిపోతే వారిని ఎత్తుకొని పోతాడు" అని అసత్యమును కథలాగ చెప్పితే పిల్లవాడు అసత్య సమాచారమును బాగా అర్థము చేసుకొని బయటికి పోవాలని అనుకోడు. ఈ విధముగా కొన్ని సందర్భములలో ముందు అసత్యమును చెప్పి తర్వాత సత్యమును చెప్పవలసి వస్తుంది.

బాల్యములో ప్రాథమిక పాఠశాలకు పోయినప్పుడు అక్కడ అక్షరాభ్యాసము చేయుదురు. మొదట నేర్వవలసిన చదువు యొక్క అక్షరములను నేర్పింతురు. ఇంగ్లీషు మీడియం స్కూలుకు పోయారనుకోండి, అక్కడ అక్షరాభ్యాసము ఇంగ్లీషు అక్షరములతో మొదలు పెట్టుదురు. మొదట ఎ,బి,సి,డి అను అక్షరములను నేర్పింతురు. అక్కడ అక్షరములను నేర్వగలిగి, తిరిగి వ్రాయగలిగితే నేర్పించిన విధానము ప్రకారము ఎ,బి, సి,డిలను వ్రాయుదురు. వ్రాసినప్పుడు ఎ ప్రక్కన బి, బి ప్రక్న సి, సి ప్రక్కన డి అని వ్రాయవలెను. అట్లు నేర్పించినట్లు వ్రాయకుండా ఎ ప్రక్కన సి వ్రాసి, సి ప్రక్కన బి వ్రాసి, బి ప్రక్కన డి వ్రాస్తే పూర్తి తప్పగును. నేర్పించినట్లు వరుస క్రమముగా ఎ ప్రక్కన బి వ్రాయవలసియుండును. అట్లు వ్రాయనందుకు తప్పు చేసినట్లు లెక్కించబడును. తప్పు వ్రాయకుండా సక్రమముగా వ్రాయాలంటే ఎ, బి, సి, డి అను వరుస వ్రాయడము సరియైన పద్ధతి.

అప్పటికి అది సరియైన పద్ధతే. నాలుగు సంవత్సరములు గడచిన తర్వాత అదే ప్రాథమిక పాఠశాలలోనే ఐదవ తరగతిలో ఎ ప్రక్కన బి వ్రాస్తే తప్పగును. అక్కడ వ్రాయవలసిన పదములో ఎ ప్రక్కన బి కాకుండా ఏదయినా వ్రాయవచ్చును. అప్పుడు అలా వ్రాయడమే సరియైన

పద్ధతియగును. ఇంగ్లీషులో చీమను గురించి వ్రాయవలసి వస్తే ఎ ప్రక్కన ఎన్, ఎన్ ప్రక్కన టి వ్రాయవలసి వచ్చును. నాలుగేళ్ళ తర్వాత ఐదవ తరగతిలో తప్పుకానిది ఒకటో తరగతిలో తప్పయినది. అదే ఇప్పుడు ఎ ప్రక్కన బి వ్రాస్తే తప్పగును. ఒకటో తరగతిలో నిజమైనది ఐదవ తరగతిలో తప్పయినది. అప్పుడు చెప్పినది తప్పయితే ఇప్పుడు నిజమైనది. పూర్తి బాల్యములో సత్యమయినది తర్వాత యవ్వనములో అసత్యమగుచున్నది. వాస్తవమేదియని చూస్తే యవ్వనములో విన్నదే సత్యము, బాల్యములో విన్న బూచోడు అసత్యము. ఇది బాల్యమునకు యవ్వనమునకు మధ్యలో బుద్ధి గ్రహించలేని స్థితిలో సత్యము అసత్యముగా, అసత్యము సత్యముగా యుండ వచ్చును. అయితే మిగతా కొన్ని విషయములలో బాల్యములోనూ, యవ్వనములోనూ అసత్యమునే చెప్పితే గ్రహించుకొనువాడు సత్యమును గ్రహించుకొనును. అప్పుడు సత్యము కొరకు అసత్యమును చెప్పవలసి వస్తున్నది. మనిషి జీవితములో ఎప్పుడయినా కొన్ని విషయములలో ఉన్న సత్యమును గ్రహించుకొనుటకు అసత్యమును చెప్పుచున్నారు.

'ఒక మనిషి చాలా గర్వముగాయుండును' అను సత్యమును చెప్పుటకు 'అతనికి తలబిరుసుగా యుంది' అని చెప్పుచుందురు. వాని తల అందరి తలవలె యుండినా 'అతనికి తలబిరుసుతనముంది' అని చెప్పడము వలన వానికి గర్వము ఉందని అర్థమగుచున్నది. ఉన్న సత్యము గర్వము. లేని అసత్యము తలబిరుసుతనము. అక్కడ చెప్పేవాడు తప్పు చెప్పాడని అనుటకు వీలులేదు. అలా అసత్యమైన తలబిరుసుతనమును చెప్పితే సత్యమైన గర్వమున్నట్లు తెలియును. అలాగే సక్రమముగా మాట్లాడకుండా హెచ్చుతగ్గులుగా మాట్లాడువానిని 'వీని తల తిరుగుతా యుంది' అని అంటూవుంటారు. వాని తల తిరగడము అసత్యము. వాడు

సక్రమముగా మాట్లాడలేదు అనేది సత్యము. అయితే సత్యమును చెప్పక అసత్యమును చెప్పితే సత్యమును గ్రహించుకుంటారు. ఇక్కడ అసత్యమును వాడితేనే ఎదుటి మనిషి త్వరగా గ్రహించుకోగలడు. అట్లుకాకుండా సత్యమును చెప్పాలంటే చాలా సమయము పట్టును. ఈ విధముగా చాలా విషయములలో సత్యము తొందరగా అర్థమగుట కొరకు అసత్యమును వాడుచుందురు. వేగముగా పనులను చేయువానిని 'మిద్దెల మీద పరుగెత్తే వాడని' అనుచుందురు. అట్లే ఎక్కువ నష్టపోయేవాడిని 'పడే గోడక్రింద కూర్చుంటాడు' అనుచుందురు. ఈ విధముగా చెప్పుచున్నా నీవు అసత్యమును చెప్పుచున్నావని చెప్పేవాడిని అనడము తెలివి తక్కువయగును. కొన్నిటిని ఎదుటివాడు అర్థము చేసుకోవలసియుండును గానీ, అనేవాడిని తప్పుపట్టే దానికి కాదు. ఇట్లు సత్యమును ఇతరులు తెలియుటకు అసత్యమును వాడు సందర్భములు అనేకము గలవు. వాటిని ప్రస్తుతము క్రొత్తవారు అర్థము చేసుకోవాలిగానీ తప్పుపట్టకూడదు. చెప్పుటకు (చూపుటకు) అది తప్పే అయినా, చెప్పే విధానము అట్లేయుండును.

మేము ప్రపంచ విషయములను చెప్పకుండా ఆధ్యాత్మిక జ్ఞాన విషయములను చెప్పుచున్నాము. ఆధ్యాత్మిక విషయములు ఎక్కువగా అగోచర విషయములు ఉండును. ప్రపంచములో కనిపించే విషయముల వద్దనే సత్యమును చెప్పక అసత్యమును చెప్పి సత్యమును అర్థమగునట్లు చేయుచున్నారు. అగోచర ఆధ్యాత్మిక విషయములలో కూడా కొన్నిచోట్ల ముందు సత్యము చెప్పకూడదు. కృష్ణుడు భగవద్గీతను చెప్పినప్పుడుగానీ, సూర్యుడు (జిబ్రయేల్) ముహమ్మద్ ప్రవక్తకు జ్ఞానము చెప్పినప్పుడుగానీ మొదట చెప్పవలసిన అసలయిన జ్ఞానమును చెప్పలేదు. భగవద్గీతలోనూ, బైబిలులోనూ, ఖురాన్ గ్రంథములోనూ **ముఖ్యమైన సారాంశము మూడు**

**ఆత్మలను గురించి చెప్పడమే.** మూడు ఆత్మల విషయము మొదట భగవద్గీతను చెప్పినప్పుడు మొదటి అధ్యాయములోనే చెప్పక భగవద్గీత మూడు భాగముల తర్వాత చెప్పడమైనది. భగవద్గీత మొత్తము 18 అధ్యాయములు గలదు. భగవంతుడు చెప్పిన బోధ మొత్తము 17 అధ్యాయములే కలదు. మూడు ఆత్మల విభజన చెప్పినది 15వ అధ్యాయములో గలదు. మూడు వంతులు భగవద్గీత అయిన తర్వాత నాల్గవ భాగములో మూడు ఆత్మల విషయము చెప్పడమైనది. అంతవరకు ఏ ఆత్మకు ఏ జ్ఞానమును వర్తింపజేసుకోవాలో ఎవరికీ తెలియకుండా పోయినది. భగవద్గీతలో అదేపనిగా భగవంతుడు మూడు ఆత్మల జ్ఞానమును మొదట చెప్పలేదు. అట్లే బైబిలు గ్రంథములో 66 పాఠములలో 40వ పాఠములో మత్తయి సువార్తలో చివరిలో మూడు ఆత్మల గురించి చెప్పడమైనది. అదే విధముగా మూడవ గ్రంథమయిన ఖురాన్ గ్రంథములో 6236 ఆయత్‌లలో 4491వ ఆయత్‌లో మూడు ఆత్మల వివరమును చెప్పాడు. మూడు గ్రంథములలో ముఖ్యమైన సారాంశము మూడు ఆత్మల విషయమే అయినా దాదాపు సగము గ్రంథము దాటిన తర్వాత గ్రంథ మూడవ భాగములో ముఖ్యమైన ఆత్మల విషయమును చెప్పారు. అంతవరకు చెప్పలేదు అంటే ఎప్పుడు చెప్పితే గ్రహించుకోగలమో అప్పుడు చెప్పినట్లు, అంతవరకు చెప్పనట్లు అర్థమగుచున్నది. ఈ విధముగా దైవ గ్రంథములలోనే ముందు వెనుక యోచించి జ్ఞానమును చెప్పియున్నారు. అందువలన మేము కూడా ముందు వెనుక యోచించి ఎప్పుడు ఏమి చెప్పితే బాగుండునో, ఎప్పుడు చెప్పితే ప్రజలు అర్థము చేసుకోగలరో అప్పుడే ఒక రహస్యమును బయటికి చెప్పుచున్నాము.

భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగము వరకు తాను ఎవరయినది కృష్ణుడు అర్జునునికి చెప్పలేదు. అవసరము వచ్చినప్పుడు

విశ్వరూప సందర్శన యోగములో **"నేను దేవున్ని"** అని అర్జునునికి తెలియ జేశాడు. అంతవరకు ముందు చెప్పితే అర్జునుడు అర్థము చేసుకోలేక పోవడమేకాక, అపార్థము చేసుకొను అవకాశము గలదు. అందువలన తాను ఎవరయినది సమయమొచ్చువరకు కృష్ణుడు అర్జునునకు చెప్పలేదు. ఈ విధముగా ఉన్న కారణములను ఎదుటివారు అర్థము చేసుకోలేక వారి బుద్ధికి తోచినది వారు మాట్లాడుచుందురు. వారు అలా మాట్లాడారని తమ మార్గమును ఎవరూ మార్చుకోరు. కృష్ణున్ని కొందరు నిందించడము కూడా జరిగినది. జారుడు, చోరుడు అని మాట్లాడిన సందర్భములు కూడా గలవు. అప్పుడు కృష్ణుడు తొందరపడి తాను దేవుడనని, భగవంతుడనని చెప్పలేదు కదా!

ఒక మనిషి ఒక ధ్యేయము కల్గియుండవలెను. బయటి సమాజ వాతావరణమునుబట్టిగానీ, బయటి సమాజ అభిరుచులనుబట్టిగానీ మనిషి ధ్యేయము మారకూడదు. మేము ఒక ధ్యేయముతో గ్రంథమును వ్రాయు చుందుము. అప్పుడు దానిని కొందరు మెచ్చుకొందురు. కొందరు అసహ్యించుకొందురు. కొందరు గొప్పగా చెప్పుకోగా, కొందరు తక్కువగా చెప్పుకోవడము జరుగుచుండును. ప్రపంచములో ఎవడూ అందరినీ మెప్పించలేడు. మనుషుల అభిరుచులనుబట్టి మేము వ్రాయు గ్రంథములు అనేక రకములుగా కనిపించి యుండవచ్చును. ఒక ఆహార పదార్థమును పది మందికి ఇచ్చి దానిని ఎట్లున్నదని వారిని విడివిడిగా అడిగి చూస్తే ఒకే ఆహారమును అందరూ అన్ని రకముల చెప్పుదురు. ఒకే పదార్థము ఒకే రుచి ఉంటుంది. అయితే తినిన పదిమంది పది రకముల చెప్పుటకు కారణము వారి నాలుకలలో, రుచి గ్రాహిత కణముల తేడా తప్ప ఆహార పదార్థములో తేడా లేదని తెలియుచున్నది. అలాగే మేము వ్రాసిన ఒక

గ్రంథము సమాజములోని మనుషుల గ్రాహితశక్తిని బట్టి వారికి అర్థమయి వుండును. హేతువాదులు వారి దృష్టితో చూచుచుందురు. మితవాదులు వారి ఉద్దేశ్యము ప్రకారము చూచుచుందురు. అతివాదులు వారి భావమునకు తగినట్లు చూచుచుందురు. అందరినీ మెప్పించాలంటే ఎవరికీ చేతగాని పనియగును. మేము ఒక సమాచారమును బయటికి వ్రాత రూపముగా పంపితే, సాధ్యమున్నంత వరకు తక్కువమందికి అర్థము కాకపోయినా ఫరవాలేదని, ఎక్కువమందికి అర్థమగులాగున ఉండునట్లు వ్రాసియుందుము. మేము అలా వ్రాసినా ఒక్కొక్కప్పుడు అది ఎక్కువ మందికి అర్థము కాకుండా పోయి తక్కువ మందికి మాత్రమే అర్థమయి వుండును. అప్పుడు దానికి నేను ఏమీ చేయలేదు. ఇతరులను చూచి నేను మారాలనుకోను. ఎందుకనగా! మనకుయున్న ధ్యేయము ప్రకారమే నడువడము మంచిది. అయినా ఎవని స్వభావము వానికుండును. వాని స్వభావమును వదలి ఇతరుల స్వభావములోనికి ఎవడూ పోడు.

ప్రతి మనిషికి ఒక స్వభావముండును. ఒకే స్వభావములో కొందరు మనుషులుగానీ, ఇద్దరు మనుషులుగానీ ఉండడము జరుగదు. మనిషి మనిషికి స్వభావము వేరువేరుగా యుండును. ప్రతి మనిషికి వేలిముద్రలు ఎలా వేరుగా యుండునో, ప్రతి మనిషికి వాసన ఎట్లు వేరుగా యుండునో, ప్రతి మనిషికి రూపురేఖలు ఎలా వేరుగా యుండునో, అలాగే ప్రతి మనిషి స్వభావము వేరుగాయుండును. ఒకే ఇంటిలో ఒకేతల్లి బిడ్డలకయినా ఒకరికున్న స్వభావము మరొకరికి ఉండదు. **'స్వభావము'** అనగా **'స్వంత భావము'** అని అర్థము. ఇక్కడ కొంత లోతుగా ఆలోచించి తెలుసుకోవలసిన అవసరమున్నది. ఎందుకనగా! శరీరములో నివసించు జీవునికి ఒక్క దేవుని విషయములో తప్ప మిగతా విషయములలో ఎక్కడా ఏమీ లేవు.

దేవుని విషయములో మాత్రము **'ఇష్టము'** అనునది జీవునికి ఉండును. అయితే జీవుడు దానిని ఉపయోగించుకోవచ్చును, లేక ఉపయోగించుకోక పోవచ్చును. దేవుని విషయములో ఇచ్ఛ తప్ప, ఏ విషయములో ఇష్టా యిష్టముగానీ, స్వభావముగానీ ఏదీయుండదు. జీవుడు అనగా ఏదీ లేనివాడు, ఏ స్వతంత్రత లేనివాడని అర్థము. శరీరమునకు అంటుకొన్న దుమ్ములాగ జీవునికి అంటుకొన్న కర్మలుండును. జీవునికి బయట అంటుకొన్న కర్మలు, లోపల దేవుని మీద ఇచ్ఛ రెండు మాత్రముండును. లోపల గల ఇష్టము మాత్రము జన్మహక్కుగా జన్మజన్మకు యుండును. బయట అంటుకొన్న కర్మలు ఒక జన్మలో ఎక్కువ యుండవచ్చును. మరొక జన్మలో తక్కువ యుండవచ్చును. ఎప్పుడయినా లేకుండా కూడా పోవచ్చును. అందువలన జీవునికి ఎప్పటికీ ఒకే విధముగా ఉండునది ఇష్టము ఒక్కటేయని చెప్పవచ్చును.

**1) ప్రశ్న :- ఇష్టము తప్ప కర్మలు కూడా తాత్కాలికముగా హెచ్చు తగ్గులుండునని చెప్పుచున్నారు. అయితే 'స్వంత భావము' అనునది జీవునిది కాదా! జీవునికి స్వంత భావము లేనప్పుడు స్వభావము అని ఎందుకు అన్నాము?**

**జవాబు :-** మనిషికి వేలిముద్ర ప్రపంచములో ఇంకొకనిది ఉన్నట్లు యుండక వేరుగాయుండును. అయితే అది వానికి ఒక్కనికే యున్న వేలిముద్ర అయినా అది ఆ జీవునిది కాదు. అది ఆ జీవుని శరీరముది. అలాగే వాసనగానీ, రూపు రేఖలుగానీ జీవునివి కాకుండా జీవుని శరీరమువై యున్నవి. జీవుని శరీరము కూడా స్వంత శరీరమే అయినా, అది ఆ జన్మకు మాత్రమే. అందువలన జీవునికి ఒక్క ఇష్టము తప్ప ఏదీ హక్కుగా లేదు. మనిషికిగల రూపము, వాసన, వేలిముద్ర మూడు జీవునివి కాకుండా జీవునికి యున్న

శరీరమునకు కలవని చెప్పవచ్చును. అట్లే మనిషికి యున్న స్వభావము జీవునికి లేదనీ, జీవుని వెంటయున్న బుద్ధికి గలదని చెప్పవచ్చును. మనిషికిగల **రూపము, వాసన, ముద్ర, స్వభావము** జీవునివి ఏమాత్రము కావని తెలియుచున్నది. ఈ నాలుగు ప్రతి మనిషికి వేరుగా యుండునట్లే **కర్మ** కూడా ఒకటియున్నది. ఒకరికియున్న కర్మ మరొకరికి ఉండక కొద్దిగయినా తేడాతో యుండును. ఈ విధముగా ప్రతి మనిషికి **కర్మ, రూప, ముద్ర, వాసన, స్వభావములు** ఐదు వేరువేరుగా యుండునని తెలిసిపోయినది. మనిషి పుట్టుకలోనే ఈ ఐదు నిర్ణయించబడును. ఈ ఐదు పుట్టుకతో వచ్చినవి, జీవితాంతము ఉండునవి. వాటిని ఎవరూ మార్చలేరు. అయితే స్థూలముగా యున్న ముద్ర, రూపము, వాసనను వదలి సూక్ష్మముగాయున్న కర్మను, స్వభావమును రెండిటిని గురువు మార్చగలడు. దేవుడు మనిషిగా అనగా భగవంతుడుగా భూమిమీదికి వచ్చినప్పుడు ఆయన ఒక్కడు గురువుగా యుండును. అప్పుడు ఎవరికీ గుర్తింపబడనివాడుగా యున్న గురువు తాను అనుకొంటే ఏ మనిషి కర్మనయినా మార్చగలడు. అట్లే స్వభావమును మార్చగలడు.

వేలిముద్ర, శరీర వాసన, రూపమును పైనగల మనుషులు మార్చవచ్చును. కనిపించేవి కావున కనిపించే మనుషులు మార్చవచ్చు. కనిపించని కర్మను, బుద్ధి స్వభావమును మనుషులు మార్చలేరు. ఆ రెండింటిని మనిషికాని గురువు మార్చగలడు. గురువు అనగా భగవంతుడు. కనిపించే ముద్ర, వాసన, రూపును కనిపించే మనిషి సులభముగా మార్చగలడు. నేడు గల వైద్య విధానముల వలన ఆ పనిని చేయగలుగు చున్నారు. బయట మూడు గుర్తులు మారినా మారకున్నా జీవునికి **ఆధ్యాత్మిక** ప్రయోజనము ఏమీ లేదు. అదే లోపలగల కర్మ, స్వభావము మారితే

జీవునకు ఆధ్యాత్మికముగా ఎంతో మంచి జరుగును. ఆధ్యాత్మిక లాభము కొరకు బయట గురువును "కర్మను, బుద్ధి స్వభావమును మార్చమని" ప్రార్థించవలసియుండును. అయితే గురువు కనిపించడు (గుర్తింపబడడు). అందువలన బాహ్య గురువును కోరుటకు అవకాశము లేదు. అటువంటప్పుడు శరీరము లోపల యున్న ఆత్మను వేడుకోవలసియుండును. ఆత్మను వేడుకోవడము వలన ఆత్మ కర్మలను లేకుండా చేయగలదు, అట్లే బుద్ధి స్వభావమును కూడా మార్చగలదు. ఆత్మను వేడుకొంటే ఆత్మ ఏమయినా చేయగలదు. అయితే ఆత్మను వేడుకొనేదానికి ముందు ఆత్మజ్ఞానము (ఆధ్యాత్మిక జ్ఞానము) అవసరము. ఆధ్యాత్మిక జ్ఞానమున్నప్పుడు జీవుడు వేడుకొన్నా, వేడుకోకపోయినా కర్మ, బుద్ధి స్వభావమును మార్చి వేయగలదు. జీవుడు అడుగకున్నా ఆత్మ తానే స్వయముగా మార్చి వేయగలదు.

ముఖ్యముగా బుద్ధి స్వభావము మారుకొలది మనిషి మాట్లాడు విధానము కూడా మారిపోవును. ఒక ప్రశ్నను స్వభావము మారకముందు అడిగేదానికి, మారిన తర్వాత అడిగేదానికి ఎంతో తేడాయుండును. మొదట గర్వముతో కూడుకొన్న ప్రశ్న, బుద్ధి స్వభావము మారిన తర్వాత వినయముతో కూడుకొన్న ప్రశ్నగాయుండును. **వినయము** కల్గి వినెడి జవాబు మనిషికి బాగా అర్థము కాగలదు. వినయము లేనప్పుడు అర్థమయ్యేదానికి, వినయమున్నప్పుడు అర్థమయ్యేదానికి ఎంతో తేడాయుండును. మేము ఎన్నో విషయములను బయటికి చెప్పాము. వాటిలో చాలామందికి బాగా అర్థమయినవి. కొందరికి అర్థముతో పాటు సంతోషము కూడా కల్గినది. కొందరికి విషయములు తెలిసేకొద్దీ కళ్ళకు ఆనంద భాష్పములు వచ్చాయి. మరికొందరికి మేము చెప్పినది కొంత అర్థమయినా కొంత సంశయముగా

మిగిలిపోయినది. కొందరికి పూర్తి అర్థము కాలేదు. కొందరికి అర్థము కాకపోవడమే కాక మా మీద అసూయ లోపల పొడ చూపినది. మరికొందరికి అసూయ వచ్చిన తర్వాత వారి సంశయము ప్రశ్నగా మారి అడగాలనిపించును. కొందరికి అడగాలని కూడా అనిపించదు. అందులో ఏమీ లేనప్పుడు అడగడమే వృథా అని అనుకొందురు. వారివారి బుద్ధిగ్రాహిత శక్తినిబట్టి, బుద్ధి స్వభావమును బట్టి మేము చెప్పిన దానిని చూచి సంతోషపడువారు కొందరుయుండగా, కొందరు అసూయ పడువారు కూడా యుండడము సహజమే. ప్రకృతిలో యున్న పరిస్థితియంతయూ అట్లే యుండును.

భూమిమీద మనుషులందరికీ ఒకే స్వభావముండదని తెలిసిన మేము దేనినీ గొప్పగా లెక్కించుకోము. ఎదుటి వ్యక్తి నన్ను పొగిడినప్పుడు కొంత సంతోషము, ఉత్సాహము కల్గినా, ఇతరులు తక్కువగా మాట్లాడినప్పుడు కొంత నిరుత్సాహము కల్గినా దానిని మేము లెక్కించము. వారి బుద్ధి స్వభావము అటువంటిదనుకొందుము. వారు ఇంకా బాగా తెలియు నిమిత్తము వారికి అర్థమగునట్లు చెప్పవలెనని నేను అనుకొంటాను. చాలామంది హేతువాదులు అడిగిన ప్రశ్నలకు మా గ్రంథములలో జవాబులున్నా వారి ప్రశ్నలకు రెండవమారు జవాబులు చెప్పదలచాము. ఇంతకుముందు చెప్పిన విషయమునే ఇప్పుడు ఇంకా బాగా అర్థమగులాగున చెప్పదలచాము. అందువలన ప్రశ్నలు అడిగినవారు, అడగని వారు జాగ్రత్తగా చదువవలెనని కోరుచున్నాము.

**2) ప్రశ్న :- ఇప్పుడున్న ఆధ్యాత్మిక సిద్ధాంతములు దేవున్ని తెలియజేయలేవనా మీరు ఒక క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదించారు?**

**జవాబు :-** ఇప్పుడున్న సిద్ధాంతములు దైవత్వమును కొంతవరకు తెలియజేశాయి. అయితే సంపూర్ణమైన దేవున్ని తెలియజేయలేకపోయాయి. ఉదాహరణకు చెప్పితే ఖగోళ పరిశోధకులు ఎన్నో పరిశోధనలు చేసి ఒక్కొక్కరు ఒక్కొక్క సిద్ధాంతమును చెప్పి చంద్రున్ని ఉన్నాడని చెప్పారు. వారి సిద్ధాంతముల ఫలితము వలన చంద్రుడు గ్రహమని, స్వయం ప్రకాశము లేదనీ, సూర్యరశ్మి వలన చంద్రుడు ప్రకాశిస్తున్నాడని చెప్పారు. అంతేకాక భూమి నీడ చంద్రుని మీద పడుట వలన శుక్లపక్షమి, కృష్ణపక్షమి, పౌర్ణమి, అమావాస్య జరుగుచున్నవి. ఇవన్నియూ శాస్త్ర పరిశోధన ఫలితములే. అయితే చంద్రునిలో నీరు ఉన్నట్లు గత పరిశోధనలు నిరూపించ లేకపోయాయి. 'చంద్రునిలో నీళ్ళున్నాయి' అని చెప్పుటకు మరికొంత పరిశోధన అవసరమయినది. చివరికి గతములోకంటే క్రొత్తగా చేసిన పరిశోధనల వలన ఈ మధ్య కాలములో పది సంవత్సరముల క్రితము 'చంద్రునిలో నీళ్ళున్నాయి' అని తెలిసినది. మొదటి పరిశోధనల వలన, మొదటి సిద్ధాంతముల వలన తెలియని సత్యము తర్వాత పరిశోధనల వలన తెలిసినట్లు, అట్లే గతములో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతముల వలన దేవుడు ఒక్కడేయని ఒకరు, కాదు ప్రకృతిలో దేవుడు గొప్పవాడని మరొకరు. ప్రకృతి దేవుడు కాకుండా జీవుడు కూడా యున్నాడని దేవుడు, జీవుడున్నాడని చివరికి ద్వైత సిద్ధాంతము ద్వారా మధ్వాచార్యులవారు చెప్పారు. మాకు తెలిసిన ఆధ్యాత్మిక భావములను అనుసరించి భగవద్గీతలో యున్న ఆధారమును చూపుచూ దానికి త్రైత సిద్ధాంతమను పేరుతో 38 సంవత్సరములుగా ప్రచారము చేయుచున్నాము. ఇది ప్రత్యేక శకముగా **త్రైత సిద్ధాంతము** మొదలయినదని ఈ కాలమునకు **"త్రైత శకము"** అని పేరు పెట్టాము. త్రైత సిద్ధాంతము ద్వారా ప్రత్యేకముగా జీవునికి, దేవునికి మధ్యలో ఆత్మయుందని తెలియజెప్పాము. ఎన్నో నిరూపణల ద్వారా

ఆత్మయున్నదని ఆత్మకు ఉనికి, ఆత్మకు పని ఎట్లున్నది త్రైత సిద్ధాంతము ద్వారా తెలుపబడినది. ఈ సిద్ధాంతమును అనుసరించే వారికి ఆత్మ ఎట్లున్నది తెలియడమేకాక, ఆత్మ మూడు ఆత్మలలో ముఖ్యమైనదై, దేవునితో సమానమైనదని తెలియగలదు.

**3) ప్రశ్న :- మీరు ప్రతిపాదించిన సిద్ధాంతము కొరకు ప్రజలా? ప్రజల కొరకు సిద్ధాంతమా?**

**జవాబు :-** ప్రజల కొరకు సిద్ధాంతముండవలెను గానీ, సిద్ధాంతము కొరకు ప్రజలు ఉండకూడదు. ప్రజలకు ఉపయోగపడునది సిద్ధాంతము. సిద్ధాంతము అనగా చివరికి తెలియునది, చివరికి పొందునది అని అర్థము. దేనిని పొందవలెను? దేనిని తెలియవలెను? అను దానికి నీవు ఏమి తెలియాలని ప్రయత్నిస్తున్నావో, లేక ఏమి పొందాలని ప్రయత్నిస్తున్నావో దానిని పొందడము లేక దానిని తెలియడము అని అర్థము. సిద్ధి+అంతము= సిద్ధాంతము. సిద్ధి అనగా పొందడము లేక తెలియడము. అంతము అనగా చివరిలో యని అర్థము. ఒక విషయమును తెలియాలని ఒక పరిశోధకుడు పరిశోధన చేయుచుండగా చివరికది తెలియు పద్ధతిని సిద్ధాంతము అని అనవచ్చును. చివరికి తెలిసినది సత్యమైయుండుట వలన, సత్యముగా తెలియు వరకు పరిశోధన చేయుట వలన దీనికి శాస్త్ర పద్ధతి ప్రకారము తెలిసినదని చెప్పవచ్చును. సత్యము తెలియుట వలన ప్రతి సిద్ధాంతము శాస్త్రబద్ధమై యుండును. శాస్త్రములో సిద్ధాంతము అంతర్భాగమై యుండును. ప్రపంచ విషయములకు సిద్ధాంతములున్నవి. అట్లే దైవ విషయములకు సిద్ధాంతములున్నవి. తెలియబడు విషయములను బట్టి అవి ప్రపంచ సంబంధ ఐదు శాస్త్రములకు సంబంధించిన సిద్ధాంతములు కావచ్చును, లేక తెలియబడు విషయము దైవికమైనదైతే

అది దైవ సంబంధశాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్ర సంబంధ సిద్ధాంతము కావచ్చును. న్యూటన్ సిద్ధాంతము, డార్విన్ సిద్ధాంతము ప్రపంచ సంబంధ మైనవని చెప్పవచ్చును. ఇంకా విడదీసి చూస్తే న్యూటన్ సిద్ధాంతము ఖగోళ శాస్త్ర సంబంధమైనది. త్రైత సిద్ధాంతము బ్రహ్మవిద్యా శాస్త్ర సంబంధమైనది. ప్రపంచ సంబంధ ఐదు శాస్త్రములు, దైవ సంబంధ ఒక్క శాస్త్రము మొత్తము షట్ శాస్త్రములు ప్రజల కొరకు వచ్చినవే. ప్రజలను విజ్ఞానవంతులుగా, జ్ఞానవంతులుగా చేయుటకు వచ్చినవే. అందువలన 'సిద్ధాంతములు ప్రజల కొరకే'యని చెప్పవచ్చును.

**4) ప్రశ్న :- దేవుడు అనేది ఒక అభూత కల్పన, లేనిదానిని ఉన్నదని భావింప చేసే సమ్మోహన క్రీడ. దీనికి మీరేమంటారు? దేవుడున్నాడని తెలిపేందుకు మీ వద్ద గీటురాయిలాంటి ఆధారమేమయినా ఉందా?**

**జవాబు :-** దేవుని జ్ఞానము అర్థము కాని వారందరూ, దేవుని విషయమును ఏమాత్రము గ్రహించుకోలేని వారందరూ, తమ బలహీనతను కప్పిపుచ్చు కునే దానికి వాడే పదములు, చెప్పేమాటలు ఇవే. దేవుడు సత్యబద్ధుడు, శాస్త్రబద్ధుడు అని చెప్పుచున్నా అభూత కల్పన అనడము చూస్తే "తాను ఆడలేక మద్దెల కొట్టు వానిమీద కోపగించుకోవడము" అనునది ఇట్లే యుంటుంది. దేవుని విషయములు ఏవి సత్యమైనవో, ఏవి సత్యముకానివో తేల్చి చెప్పుటకు దైవగ్రంథములను దేవుడే గీటురాయిగా పంపడమైనది. దేవుడు పంపిన **ప్రథమ దైవగ్రంథము (భగవద్గీత), ద్వితీయ దైవగ్రంథము (బైబిలు), అంతిమ దైవగ్రంథము (ఖురాన్)** ఈ మూడు గ్రంథములు సత్యాసత్యములను తేల్చి చెప్పు శాస్త్రబద్ధమైన గీటురాళ్ళుగా యున్నాయి యని అంతిమ దైవగ్రంథములో సూరా 2, ఆయత్ 53లో ఈ విధముగా చెప్పబడినది చూడండి. **(2-53) "జ్ఞాపకము చేసుకోండి! మీరు**

**సన్మార్గలవృతారిమెయినని మేము మూసాకు గ్రంథాన్ని మరియు సత్యాసత్యములను వేరుచేసి చూపే గీటురాయిని ప్రసాదించాము."**

శాస్త్రము అనగా సత్యము అని అర్థము. ఏది సత్యమో అది శాస్త్రమగును. ఒక సత్యమైన విషయము ఆరు శాస్త్రములలో ఏదో ఒక శాస్త్రమునకు సంబంధించియుండును. దేవునికి సంబంధించిన శాస్త్రము ఉంది అంటే అందులో సత్యమున్నదనేగా అర్థము. షట్ శాస్త్రములలో ఐదు ప్రపంచ సంబంధ శాస్త్రములుకాగా, ఒకటి దేవుని సంబంధమైన బ్రహ్మ విద్యా శాస్త్రము గలదు. బ్రహ్మవిద్యా శాస్త్రములో చెప్పిన విషయములు శాస్త్రమైయుండుట వలన అవి సత్యమైనవిగా యుండునుగానీ అభూత కల్పనగా ఉండవని తెలియవలెను. దేవుడు కలడుగానీ తెలియడు. దేవుడు వెతకబడేవాడేగానీ తెలియబడేవాడు కాడు. **"దేవులాడబడేవాడు దేవుడు"** అని పెద్దలు చెప్పారు. తెలియని దేవున్ని, కనిపించని దేవున్ని చూచాము అనేవారు చెప్పేది అభూతకల్పనై యుండవచ్చునుగానీ దేవుని విధానము గానీ, దేవుని జ్ఞానముగానీ అభూత కల్పన కాదు, సత్యము అని చెప్పవచ్చును. దేవుడు నామ, రూప, క్రియలు లేనివాడని శాస్త్రము చెప్పుచున్నది. దేవునికి పేరుగానీ, రూపముగానీ, పనిగానీ లేదని చెప్పుచుండగా దానిని దేవుని జ్ఞానము అంటున్నాము. దేవుని జ్ఞానమును తెలియకనే కొందరు అనవసరముగా దేవున్ని గురించి అభూత కల్పనయని అనడము పూర్తి తప్పగును. దేవుడున్నాడని చెప్పుటకు మా దగ్గర పూర్తి సమాచారమున్నా ఆయన ఎవరికీ తెలియకుండా స్థబ్దునిగా యున్నాడు అని చెప్పుచున్నాము. అటువంటప్పుడు దేవుడు తెలియబడడు, ఎవరూ ఆయనను చూడలేదు అని చెప్పుచున్నాము. దేవుడు తెలియబడును అని చెప్పియున్నా, దేవుడు

కనిపిస్తాడు అని చెప్పియున్నా ఆ మాటలు అభూతకల్పనే యగును. బ్రహ్మ విద్యా శాస్త్రము ప్రకారము మూడు దైవగ్రంథములు దేవుని విషయములో దేవుని మీద నెలకొన్న అపోహలను తీసివేయుటకు గలవు. సృష్టి తయారయిన తర్వాత దేవుడు ఏమీ చేయనివాడుగా, ఎవరికీ తెలియని వాడుగా ఉండిపోయాడు. ఆయన (దేవుని) పేరు ఎవరికీ తెలియదు. ఆయన రూపు ఎవరికీ తెలియదు. అట్లే ఆయన ఏ పనినీ చేయడు. కనుక ఆయన ఎప్పటికీ అభూతుడే అట్టి వానిని తిరిగి కల్పన చేయనవసరము లేదు. అభూతుడనగా జీవము లేనివాడు. జీవము కర్మయున్న జీవునికి యుండును. ఆయన దేవుడు కావున ఆయన ఎప్పటికీ అభూతుడే. దైవ జ్ఞానము తెలియనివాడే ఆయనను అభూతుడని కల్పన చేసి చెప్పును. తెలిసినవాడు కల్పన చేయవలసిన అవసరము లేదు. దేవుడు నిత్యుడు, సత్యుడు భూతముకాని అభూతుడు.

దేవుడనేది లేనిదానిని ఉన్నదని భావింపజేయు సమ్మోహన క్రీడ అని దీనికి మీరేమంటారు? అని ప్రశ్నించారు. ఇవన్నీ తెలియకుండానే మాట్లాడిన మాటలు తప్ప, తెలిసి మాట్లాడిన మాటలు కావని మాకు అర్థమగుచున్నది. దేవుడు లేనివానిగానే యున్నాడని ఏ విషయములో గానీ దేవున్ని బాధ్యున్ని చేసి చెప్పకూడదనీ, విశ్వములో ఆయన పాత్రే లేదనీ, దేవుడు స్థబ్దునిగా నిలిచిపోయినవాడనీ, కేవలము అక్షిగా యున్నాడు తప్ప ఆయన లేనివాడే యనీ, లేనివానిని ఉన్నాడని చెప్పడము, ఉన్నాడని అనుకోవడము అజ్ఞానమనీ, అంతటా ఉండువాడు, అన్నీ చేయువాడు, నిజముగా నీకు నాకు దేవుడై, అధిపతియై యున్నవాడు ఆత్మేయనీ, దేవుడు కాదనీ మేము చాలామార్లు చెప్పాము. దేవున్ని గౌరవార్థము కొన్నిచోట్ల చెప్పుచున్నాము తప్ప, ఏ విషయము దేవునికి సంబంధము లేదనీ, దేవుడు

ఎక్కడా జోక్యము చేసుకోలేదనీ, దేవుని స్థానములో ఆత్మే అన్నీ చేయు చున్నాడని **"విశ్వ విద్యాలయము"** అను గ్రంథములో వ్రాశాము. లేనివానిని ఉన్నాడని అనుకోవడమే అజ్ఞానమనీ, ఉన్నది ఏదో, లేనిది ఏదో తెలుసుకుని చెప్పితే బాగుంటుంది గానీ, ఏదో మాట్లాడవలెనని అనుకోవడము హేతువాదము కాదుగానీ అజ్ఞానవాదము అని అనవచ్చును. మేము చెప్పునది సత్యము అనుటకు గీటురాయిగా **భగవద్గీత, బైబిలు, ఖురాన్** అను మూడు గ్రంథములు గలవని చెప్పుచున్నాము.

**5)** ప్రశ్న **:- దేవుడున్నాడని మేము నమ్మము. అయినా మాకు ఏ కష్టాలు లేవు, దేవుడున్నాడు అనే వారికంటే మేమే బాగున్నాము. దేవుడున్నాడు అని నిత్య పూజలు చేయువారే అన్ని విధముల కష్టపడుచున్నారు. మేము దేవుడంటే భయము లేనివారమై మ్రొక్కను కూడా మ్రొక్కము. మరి దేవుడు మమ్మల్ని ఎందుకు శిక్షించలేదు, ఎందుకు కష్టపెట్టలేదు?**

**జవాబు :-** దేవునికి, ప్రపంచ కష్టాలకు సంబంధము లేదు. ప్రపంచ కష్టాలు కర్మనుబట్టి వచ్చునుగానీ, భక్తినిబట్టి వచ్చునవీగావు, పోవునవీ కావు. దేవుని మీద భక్తి లేనివానికి కష్టాలు వచ్చుననీ, భక్తియున్న వానికి కష్టాలు రావనీ ఏ గ్రంథములోనూ వ్రాయలేదు. దేవుడు, దేవుని జ్ఞానము మనిషి జన్మలు లేకుండా చేయుటకేగానీ, కష్టాల సుఖాల నిమిత్తము కాదు. కష్ట సుఖములు పాపపుణ్య కర్మలనుబట్టి యుండును తప్ప వేరు విధానము వలన రావు, పోవు. గతజన్మలో పుణ్యము చేసుకొన్నవారు ఈ జన్మలో సుఖములు అనుభవించవలెనని తీర్పు తీర్చబడియుండును. గతజన్మలో పుణ్యము చేసుకొన్నవారు ఈ జన్మలో ఎంత అజ్ఞాని అయినాగానీ, దేవున్ని నమ్మకపోయినా గానీ, వాడు గత పుణ్యఫలితము వలన సుఖములనే అనుభవించుచుండును. గత జన్మలో పాపము చేసుకొన్నవాడు ఈ జన్మలో

దేవున్ని నమ్మినా, దేవున్ని ఆరాధించినా గత జన్మ పాపము వలన కష్టములనే అనుభవించుచుండును. ఇదంతయూ ప్రపంచములో జరుగు సత్యము. అంతేగానీ దేవుని విశ్వసించని వానికి, దేవుని శిక్షకు సంబంధము లేదు. విశ్వాసము దైవజ్ఞానమునుబట్టి వచ్చును. పుట్టిన ప్రతి మనిషికి దేవుని పై విశ్వాసముండవలెనని దేవుడు కూడా ఎక్కడా చెప్పలేదు. దేవుని మీద విశ్వాసము మనకుగల శ్రద్ధనుబట్టి వచ్చును. శ్రద్ధనుబట్టి భక్తి విశ్వాసములు ఉండును. కర్మనుబట్టి కష్టసుఖములుండును. భక్తి విశ్వాసములకు కష్ట సుఖములకు ఏమాత్రము సంబంధము లేదు. అందువలన "భక్తి విశ్వాసము లేని వారిని దేవుడు శిక్షించును" అని అనుకోవడము పూర్తి పొరపాటు.

**6) ప్రశ్న :- మనిషి సంపాదించుకొన్న కర్మ ప్రకారమే ఈ జన్మలో అన్నీ అవే జరుగును అని చెప్పే కర్మసిద్ధాంతము జనులను సోమరిపోతుల్ని చేస్తున్నదని మేమంటాము. దీనికి ముక్కసూటిగా జవాబు చెప్పండి?**

**జవాబు :-** ముక్కుసూటిగా చెప్పినా, గోడసూటిగా చెప్పినా సోమరిపోతులగుటకుగానీ, చురుకుతనము కలవారగుటకు గానీ కర్మే కారణము. కర్మను అడ్డము పెట్టుకొని ఎవరూ పనులు మానుకొనుటకు వీలులేదు. ఒక్క క్షణము కూడా ఊరకయుండక కర్మవలననే కదలుచూ, పని చేయుచుండునని కర్మచట్టములో యున్నప్పుడు మనిషి ధనికుడుగా మారవలెనన్నా, పేదవానిగా మారవలెనన్నా, సోమరిపోతుగా మారవలెనన్నా అన్నిటికీ కర్మే కారణమైనప్పుడు స్వతహాగా ఎవడూ సోమరిగా మారడు. కర్మవలన సుఖదుఃఖములు అవే వస్తాయిలేయని పనులు మానుకొనుటకు ఏ జీవునికి స్వతంత్రము లేదు. ఎవరూ స్వతంత్రముగా మారుటకు వీలులేదు. ప్రతి క్షణము కర్మనుబట్టి వాడు నడుచుచుండునని భగవద్గీత కర్మయోగములో ఐదవ శ్లోకములో ఈ విధముగా చెప్పారు చూడండి.

(2-5) శ్లో॥ నహికశ్చిత్ క్షణ మపి జాతుతిష్ఠత్య కర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మసర్వః ప్రకృతి జైర్గుణైః ॥

**వివరము :- "ఏ కర్మ అనుభవించక ఎవ్వడు కూడా ఒక్క క్షణమైనా ఊరక యుండుటకు వీలులేదు. ప్రకృతి గుణముల వలన కర్మబద్ధులై జనులు కర్మముల వశులై కార్యములు చేయుచుందురు."**

ఈ విధముగా ప్రతి మనిషి కర్మప్రకారము కార్యములను చేయుచుండగా ప్రత్యేకించి ఎవడుగానీ తన స్వంతముగా మారిపోవుననిగానీ, పనులు చేయడనిగానీ, చేయుననిగానీ చెప్పుటకు వీలులేదు. మనిషిని కర్మ ఎంతో లెక్కాచారముగా క్షణక్షణము నడుపుచుండగా, ఒక్క క్షణము కూడా కర్మ లెక్కాచారము లేకుండా నడుచుటకు వీలు లేకుండా యుండగా, మనిషి ఏదో చూచి, ఏదో రకముగా మారునని చెప్పుటకు వీలులేదు. మనిషి తన ఇష్టమొచ్చినట్లు మారవలెనని అనుకొనినా, ఏదీ వాని ఇష్టమొచ్చినట్లు జరుగదని అందరికీ తెలుసు. ముందే నియమించబడిన కర్మప్రకారము అన్నీ జరుగుచుండగా, మనిషి స్వయముగా ఏమీ చేయలేడు. తాను అనుకొన్నదొక్కటి, కర్మప్రకారము జరుగుచున్నదొకటిగా ప్రతి మనిషి జీవితములో యుండును. మనిషి ఇష్టమువేరు, మనిషి కర్మవేరు. మనిషి ఇష్టము ప్రకారము ఏదీ జరుగదు. అన్ని కర్మలు లెక్కాచారము ప్రకారమే జరుగును. అందువలన "కార్యం కర్మాధీనమ్" అని పెద్దలన్నారు.

**7) ప్రశ్న :- మీరు ప్రతిపాదించిన సిద్ధాంతము సుమారు ఎన్ని గ్రంథములుగా వ్రాయగోరినారు? దీనివలన ఏ విధముగా మీకు లాభము చేకూరుతుంది?**

**జవాబు :-** ఇది అడుగ వలసిన ప్రశ్నే కాదు, అయినా నేను చెప్పవలసిన జవాబే! కనుక చెప్పుచున్నాను. మనిషి చేయవలసిన పనిని గురించి అంచనా

వేసుకోవడము సహజము. తాను అనుకొన్నట్లే చేయుదునను అజ్ఞానము వారిలో యుండుట వలన వారు ముందే అది చేయగలను, ఇది చేయగలను అని అనుకోవడము జరుగుచున్నది. అయితే మా విషయానికి వస్తే నేను ముందు అనుకోవడము వలన జరుగుతుందని ఏమాత్రము నమ్మకము లేదు. ఎందుకనగా! జరుగబోయే పనులన్నియూ మనిషి ఇష్టము అయిష్టము మీద ఆధారపడి లేవు. కార్యములన్నియూ మనిషి యొక్క కర్మమీద ఆధారపడి జరుగుచుండును. నా కర్మలో ఎన్ని గ్రంథములు వ్రాయాలని నిర్ణయమై యుండునో దాని ప్రకారము అన్ని గ్రంథములను వ్రాయగలను. అందువలన నా కర్మ ఎలా ఉన్నదో నాకు తెలియదు, గనుక నేను ఎన్ని గ్రంథములు వ్రాయగలనో ముందే చెప్పుటకు వీలుపడదు.

కార్యములన్నియూ కర్మనుబట్టి యుండును, కనుక కర్మను తెలియని నీవు ఫలానా పనిని ఫలానా విధముగా చేస్తానని చెప్పకు. ఒకవేళ నీవు ఫలానా పనిని చేస్తానని చెప్పినా ఆ పనిని చేయలేవు, ఆ పని జరుగదు. అందువలన ఈ విషయమై అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 18, ఆయత్ 23లో ఈ విధముగా చెప్పియున్నారు చూడండి. **(18-23) "ఏ విషయములో కూడా నేను ఈ పనిని రేపు చేస్తాను అని చెప్పకు, నీవు ఏమీ చేయలేవు."** ఇది దేవుడు చెప్పిన జ్ఞానము కనుక రేపు ఏమి జరుగునో, ఏమి చేస్తామో ఎవరికీ తెలియదు. కార్యముల విషయమే తెలియనప్పుడు కార్యముల వలన లాభము కల్గునని ఎందుకు అనుకోవాలి? ఒకవేళ కర్మప్రకారము నష్టము కూడా రావచ్చును. అందరూ లాభము రావాలని పనులు, వ్యాపారము చేయుచుందురు. అయితే వారికి నష్టము వచ్చి, ఉన్నది కూడా పోగొట్టుకున్నవారు ఎందరో గలరు. జ్ఞానము తెలిసిన ఏ మనిషి పనులను గురించిగానీ, పనుల వలన వచ్చే లాభము

గురించిగానీ ముందే మాట్లాడడు. అందువలన నాకు వచ్చే లాభమును గురించి నేను ఏమీ చెప్పలేను.

**8) ప్రశ్న :- "తేలుకుట్టిన వ్యక్తికి కాకుండా, ఆ విషయాన్ని చెప్పిన మరొక మనిషికి వైద్యము చేయుట వలన తేలుకుట్టిన వ్యక్తికి బాధ తగ్గును" అని విన్నాము. ఇది ఎట్లు సాధ్యమో వివరించగోరుచున్నాము?**

**జవాబు :-** ఈ విషయమును ఎవరూ చెప్పియుండరు. బహుశా నేనే చెప్పియుంటాను. ఎందుకనగా! ఆ వైద్యము నా అనుభవములోనిదే. అయితే ఆ విధానమును నేనే మొదట బయటపెట్టాను. అటువంటి వైద్యము నాకు ఎలా తెలిసిందో అక్కడనుండి చెప్పితేగానీ ఈ విషయము మీకు అర్థము కాదు. అందువలన మొదటినుండి చెప్పెదను వినండి. నాకు పది సంవత్సరముల వయస్సులో నేను నా మేనమామ ఇంటికి పోవడము, అక్కడే ఒక నెల వరకు ఉండడము జరిగినది. నా మేనమామ అయిన వ్యక్తికి తేలు కుట్టితే వైద్యము చేసే విధానము తెలుసు. అతను వైద్యుడు కాకున్నా అతనికి ఆ ఒక్క వైద్యము మాత్రము తెలుసు. రెండు మూడు రోజులకు ఒకరు తేలుకుట్టిన వారు వస్తే వారికి ఆకు వైద్యము చేసెడివాడు. తేలుకుట్టిన వ్యక్తి వచ్చిన వెంటనే ఇతను బయటికిపోయి, గుంపుగా చెట్లు పెరిగిన ఏదో ఆకులను తెచ్చి బాగా ఆకులను నలిపి తేలు విష బాధ ఎక్కడివరకు ఉందో అడిగి, అక్కడ నలిపిన ఆకును పెట్టి చిన్నగా ఆకును క్రిందికి జరుపుచుండగా నొప్పి కూడా ఆకువెంట దిగివస్తున్నదని తేలు కుట్టినవారు చెప్పేవారు. దానిని నేను శ్రద్ధగా చూచెడివాడిని.

చేతికి తేలు కుట్టియుంటే విషబాధ భుజము వరకు యుండును. భుజము నుండి ఆకును చర్మమునకు తగిలించి క్రిందికి తీసుకరాగా, నొప్పి

ఆకువెంట దిగిరావడము చూచి నాకు చాలా ఆశ్చర్యముగా ఉండేది. ఆ పనినే ఎంతో ధ్యాసగా చూచేవాడిని. నా శ్రద్ధ ఆ పని మీదనే ఎక్కువగా యుండుట వలన కొంతకాలానికి ఆయన ఉపయోగించే ఆకును తెలియగలిగాను. తర్వాత నా వయస్సు 23 సంవత్సరముల సమయములో నేను వైద్యుడుగా కాలము గడుపవలసి వచ్చినది. బ్రతుకు తెరువుకు అప్పుడు నేను వైద్యుడను కాలేదు, రోగములు వైద్యము వాటి వెనుకయున్న రహస్యము తెలియుటకు పరిశోధనా నిమిత్తము వైద్యము చేసెడివాడిని. అప్పుడు తేలుకుట్టిన వారికి చిన్నప్పుడు నేను చూచిన ఆకును ఉపయోగించి వైద్యము చేయగా అది బాగా పనిచేసి తేలు బాధ తొందరగా తగ్గిపోయేది. ముందే చెప్పాను కదా! నేను వైద్యము చేసినది సంపాదన కొరకు కాదు. రోగములు, వైద్యము రెండింటి మీద పరిశోధన నాకు తెలిసిన పద్ధతిలో సాగించెడివాడిని. అప్పుడే మనిషి శరీరములో సూక్ష్మ శరీరములు (దయ్యములు) ఉండుట వలన మందులకు లొంగని రోగములుండునని తెలియగలిగాను. రోగముల పరిశోధనే కాక వైద్యము మీద కూడా పరిశోధన సాగించెడి వాడిని. కనుక తేలు కుట్టినప్పుడు కలిగే బాధ చేతిలో భుజము వరకు ఉండును. తేలు విష బాధ చాలా నొప్పిగా యుండును. అంతపెద్ద నొప్పి ఇంత చిన్న ఆకుకు ఎలా పోతుంది? యను ప్రశ్నకు జవాబును వెతికేవాడిని. అనేక కోణములలో ఆకు వైద్యమును గురించి ఆలోచించాను. చేతిమీద చర్మమునకు తాకించిన ఆకు చేయి లోపలగల నొప్పిని ఎలా క్రిందికి దించగలుగుచున్నది? అని ఆలోచించాను. అప్పుడు చిన్న యోచన వచ్చినది. ఆకు కనిపించేదే అయినా ఆకు యొక్క శక్తి పరిధి కొంతదూరము వరకు ఉండునని అర్థమయినది. ఆకు శక్తి పరిధి కొంతదూరముండుట వలన చేతి లోపలి విషము క్రిందికి దిగి వస్తున్నదని అర్థమయినది. ఇదంతయూ నాకు స్వయముగా వచ్చిన యోచనలు. అదే విధానము

ప్రకారము ఆ పరిధి లోపలయున్న ఏ మనిషికి వైద్యము చేసినా, అది తేలు విషము మీద పని చేయగలదని, లోపలనుండి ఒక ఆలోచన రాగా ఆ విధముగానే మొదట ప్రయోగము చేసి చూచాము. ఒక వ్యక్తి చేతికి ఆకును ఉపయోగించగా కొంత దూరములోయున్న వ్యక్తికి తేలు విషము దిగిరావడము జరిగినది. ఒక వ్యక్తికి ఆకును శరీరము మీద ఎక్కడ ప్రయోగిస్తే కొంత పరిధి వరకు యున్న మనుషులందరి శరీరము మీద ప్రయోగించినట్లు ఆకు వైద్యము ఆకులోని శక్తి పని చేయుచున్నది. ఒక మనిషికి ముక్కులో ఆకు రసము పిండితే అక్కడ కొంత పరిధి వరకు యున్న మనుషుల అందరి ముక్కులలో ఆకు రసము పిండినట్లే ఆకుశక్తి అందరి ముక్కుల మీద పని చేయుచున్నది. అదే విధానము ప్రకారము తేలుకుట్టిన వ్యక్తికే కాకుండా వాని ప్రక్కనగల ఎవనికయినా ఆకును ప్రయోగించినప్పుడు, ఆకుశక్తి ప్రక్కనేయున్న తేలు విషబాధను అనుభవించు వ్యక్తిలోని బాధ తగ్గిపోవుచున్నది. ఇదంతా స్వయముగా అంచనా వేయగలిగి ఇప్పటికి దాదాపు 40 సంవత్సరములప్పుడే ప్రక్క మనిషికి కూడా ఈ ఆకు పని చేస్తుందని తెలిసినది. ప్రత్యేకించి ఆ ఆకులోనే అటువంటి శక్తియుందని, మిగతా చెట్ల ఆకులలో అటువంటి శక్తి లేదని తెలిసినది. ఈ ఆకు వైద్యము బయట చూచేవారికి వింతగా కనిపించినా లోపల గల విషయము, వివరము రెండు నాకు ముందే తెలుసు. కావున నాకు వింతగా ఏమీ లేదు. అశ్వర్థ వృక్షము అనబడు రావి చెట్టు కూడా ఒక మీటరు వరకు శక్తి వ్యాపించియుండును. అందువలన రావిచెట్టు మీటరు ఆవరణములోనికి పోయి ప్రతి దినము ఉండగా 40 రోజులకు కొన్ని రోగములు నయమైపోగలవు. ఆ చెట్టులోనే ఆ శక్తి కలదని తెలియుచున్నది. తేలు విషము తగ్గడము, ఇతర మనిషికి ప్రయోగించినా అది పని చేయడము

నా అంచనాతో చేసిన పని, కావున నేను అది ఎట్లు సాధ్యమో వివరించ గలిగాను.

**9) ప్రశ్న :- యజ్ఞముల వలన, సోమపానము వలన పుణ్యము వస్తుంది అంటున్నారు. పైగా అధర్మము అంటున్నారు. అధర్మముల వలన పుణ్యము వస్తే మరి అందులో జరిగిన పశుహింస వలన కూడా పుణ్యము వస్తుందా? అది కర్మ కాదా?**

**జవాబు :-** బాహ్య యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది యని అక్షర పర బ్రహ్మయోగమున చివరి శ్లోకములో చెప్పియున్నారు. యజ్ఞము అధర్మమైన దానివలన మోక్షము రాదని విశ్వరూప సందర్శన యోగములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ చెప్పడమైనది. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది అనుమాట వాస్తవమే అయినా అది కర్మకు సంబంధించి నదేగానీ, మోక్షమునకు సంబంధించినది కాదు. యజ్ఞములలో పశుహింస జరిగితే దానికి తగినంత పాపము కూడా వచ్చును. యజ్ఞము అంటే అంతా పుణ్యమేయని చెప్పుటకు వీలులేదు. యజ్ఞములలో ఎంత మంచి జరిగితే అంత పుణ్యము వస్తుంది. అట్లే చెడు జరిగితే, ప్రాణహింస జరిగితే, జంతుబలులు జరిగితే దానికి తగినంత పాపము కూడా వచ్చును. పాపపుణ్యములకు సంబంధించిన యజ్ఞములను కర్మతో కూడుకొన్నవని చెప్పవచ్చును. అందువలన బాహ్యముగా జరుగు యజ్ఞములకంటే కనిపించకుండా అంతరంగములో అనగా శరీరములో జరుగు యజ్ఞములను అనగా ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞమును చేయగల్గితే, అందులో **జ్ఞాన యజ్ఞముల** వలన కర్మ లేకుండా పోయి, మోక్షమునకు పోవుటకు దారి లభించును. అందువలన అంతరంగములో జరుగు జ్ఞానయజ్ఞమును ఆచరించమని పెద్దలు చెప్పుచుందురు.

**10) ప్రశ్న :- 'జీహాద్' అను పేరుతో ముస్లీమ్‌లు చేస్తున్న హింసాకూడా ఒక రకంగా పుణ్యమా? ఎందుకంటే వారు చేస్తున్నది స్వర్గం అనే దానిని ఆశించే కదా! స్వర్గం అనే భావముతో చేస్తున్నప్పుడు వారికి పాపము వస్తుందా? పుణ్యము వస్తుందా?**

**జవాబు :-** మనిషి తనది మంచి ఉద్దేశ్యమే అని చేసినా, వాడు అనుకొన్నది పనికి రాదు. **దేవుడు నిర్ణయించినట్లు** అది హింస అయితే పాపము వస్తుంది. స్వర్గమును ఆశించి చేసిన పని మంచిదయితే పుణ్యము వస్తుంది. చెడు పని అయితే పాపము వస్తుంది. మనిషి సుఖము కొరకు పాపమునే చేస్తున్నాడు. **జీహాద్** అనేది **పవిత్రయుద్ధము** అని చెప్పేమాట గుణములతో పోరాడుచూ దేవుని ధర్మములను ఆచరించుటనే పవిత్ర యుద్ధము అని అంటున్నారు. జీహాద్ అనేది ఇతరులను హింసించునది కాదు. దేవుని మార్గములో ప్రయాణించుటకు శరీరములోనే గుణములతో యుద్ధము చేయుటను 'పవిత్ర యుద్ధము' అనీ, జీహాద్ అనీ అంటారు. జీహాద్ పేరుతో బయట అరాచకము సృష్టించి, బయట ప్రపంచములో హింసను చేయువాడు తనకు తెలియకుండానే పాపమును సంపాదించుకొనుచున్నాడు. దానివలన వానికి స్వర్గము రాదుగానీ, నరకము మాత్రము తప్పనిసరిగా వస్తుంది. స్వర్గమును ఆశించువాడు జీహాద్ చేయడు. స్వర్గమును ఆశించి చేయుట జీహాద్ అనిపించుకోదు. స్వర్గనరకములకు అతీతమైన పరలోకము కొరకు జీహాద్ చేయడము జరుగుచుండును. పరలోకము అనగా దేవుని సన్నిధానములోనికి చేరడము. స్వర్గము అనగా సుఖములతో కూడుకొన్నది. భూమిమీదనే స్వర్గము కలదు. ఇహలోక సౌఖ్యముల కొరకు ప్రాకులాడు వాడు స్వర్గమునకు ప్రాకులాడువాడుగా యున్నాడు. జీహాద్‌లో అనగా పవిత్రయుద్ధములో జ్ఞానసంబంధ విషయములుండును. ఇది ఎవరి

హింసకు కారణము కాదు. జీహాద్ అనునది పవిత్రమైన దేవుని మార్గము లోనిది, నీచమయిన ప్రపంచ సంబంధమైనది కాదని చెప్పుచున్నాము.

**11) ప్రశ్న :- స్వప్నము అనేది నిజము కాదు కదా! మరి మీరు "కృష్ణమూస" అనే గ్రంథములో కృష్ణుడు మూసాకు కనిపించి చెప్పేది వాస్తవమే అన్నట్లు చెప్పారు. మరి స్వప్నము కూడా కొన్నిసార్లు వాస్తవముగా మారునా?**

**జవాబు :-** స్వప్నమును గురించి సంపూర్ణముగా చెప్పువారు బహుశా భూమిమీద ఎవరూ లేరనియే చెప్పవచ్చును. శరీరములోని ఆత్మను ఏ విధముగా తెలియలేమో అదే విధముగా స్వప్నమును తెలియుట దుర్లభముగా యుండును. అందువలన స్వప్న రాత్రిని ఆత్మ గుర్తుగా పోల్చి చెప్పాము. స్వప్నమును సత్యమని చెప్పుటకు ఎంత ఆధారము గలదో, అట్లే స్వప్నము అసత్యమని చెప్పుటకు అంతే ఆధారము గలదు. ఆత్మను ఎటూ తేల్చి చెప్పలేనట్లు స్వప్నమును కూడా ఎటూ తేల్చి చెప్పలేము. గత చరిత్రలో కృష్ణుడు మూసా (మోషే) అను వ్యక్తికి స్వప్నములో కనిపించి గ్రంథమును ఇచ్చి దాని పేరు **'తౌరాతు'** అని చెప్పాడు. ఇచ్చినది భగవద్గీతే అయినా చెప్పినది తౌరాత్‌యని చెప్పడము జరిగినది. అది సత్యమనుటకు ప్రతి దినము రాత్రియందు మూసాకు తౌరాతు గ్రంథము కనిపించేది, దానిలోని జ్ఞానమును మోషే తెలుసుకునెడి వాడు. ఇదంతయూ స్వప్నములోనే జరిగేది. అయితే మోషేకు మెలుకువలో యున్నట్లే యుండేది. స్వప్నములో చదివిన తౌరాతు గ్రంథ విషయములన్నియూ తెల్లవారిన తర్వాత మోషేకు బాగా జ్ఞాపకము ఉండేవి. రాత్రి చదివిన తౌరాతు గ్రంథమును మోషే (మూసా) ప్రజలకు చెప్పేవాడు. ఈ విధముగా తౌరాతు గ్రంథము మోషేకు ఒక్కనికే కనిపించేది. తౌరాతు గ్రంథమును మోషే తప్ప ఎవరూ చూడలేదు. ఎందుకనగా! బయట ఎక్కడా ప్రజలకు అది కనిపించలేదు. మోషేకు

కూడా రాత్రిపూట మాత్రమే స్వప్నములో కనిపించేది. మోషే తౌరాతు జ్ఞానమును బయటికి చెప్పగా అది మోషే ధర్మశాస్త్రముగా పేరుగాంచినది. స్వప్నము సత్యముగా మారును. అట్లే స్వప్నము అసత్యముగా కూడా ఉండును. స్వప్నమును సత్యమనే దానికి ప్రత్యక్ష ఆధారములు గలవు. కొన్నిచోట్ల కొన్ని స్వప్నములు నిజమని చెప్పుటకు పరోక్ష ఆధారము కూడా యుండదు. అందువలన స్వప్నము కొన్నిమార్లు సత్యము కావచ్చును. కొన్నిమార్లు అసత్యము కావచ్చును. స్వప్న విషయములో ఎవరూ ఎటూ తేల్చి చెప్పలేరు.

**12) ప్రశ్న :- రాగిరేకులు ధరించడము వలన శరీరములోయున్న Negative Energy (నెగిటివ్ ఎనర్జీ) బయటికి వస్తున్నట్లు తెలియుచున్నది. అలాగే కొన్ని లోహములు చేతికి ధరిస్తే పాజిటివ్ కిరణాలు లోపలికి ప్రవేశించి ఆ వ్యక్తిలో సత్వ గుణము పెరిగి కోపము తగ్గినట్లు మా పరిశోధనలలో తేలింది. అంటే కోపము అనే గుణము ద్వారా పొందే కర్మను సంపాదించకుండా మేము ఆపినట్లే కదా! మరి మీరు "కర్మ అనుభవించ కుండా పోదు" అని అంటున్నారు. మేము చేసిన పని ద్వారా కర్మను ఆపినట్లే కదా!**

**జవాబు :-** ముందే మూటకట్టుకొన్న పాతకర్మను అనుభవించకుండా ఎవరూ ఆపలేరు. అది జరిగేది జరిగి తీరవలసిందే. మీరు చెప్పునది రాబోయే క్రొత్త కర్మను నివారించారని చెప్పుచున్నారు. రాబోయే కర్మను రాకుండా చేసుకొనుటకు అనేక క్రియల వలన క్రొత్త కర్మ రాకుండా చేసుకోవచ్చును. అందులో నీవు చెప్పిన లోహముల ప్రయోగము వలన కూడా చేసుకో వచ్చును. అంతేకాదు మౌనముగా యున్నా క్రొత్త కర్మ రాదు. మంత్ర

జపము చేసినా, నిద్రలోనికి పోయినా, కాలములో మనస్సును కథయందు లగ్నము చేసి వింటూయుండునట్లు చేసినా, గుణములలో లేకుండా చేసినా క్రొత్తకర్మ రాదు. క్రొత్త కర్మ రాకుండుటకు అనేక ఉపాయములు చెప్పబడినవి. అయితే ఉన్న కర్మను అనుభవించకుండా తప్పించుకొనుటకు ఏ విధానము లేదు. రాగి రేకులుగానీ, ఇనుప చువ్వలుగానీ కర్మను అనుభవించకుండా తప్పించలేవు. జ్ఞానాగ్ని చేత దహించగలిగితే కర్మ భస్మమై కార్యము కాకుండా పోయి అనుభవమునకు రాకుండా పోవుచున్నది. అంత తప్ప వేరే ఏ ప్రక్రియ వలన మనిషిని పాత కర్మనుండి తప్పించలేము తప్పక అనుభవించి తీరవలసిందే.

**13) ప్రశ్న :- "గర్భస్థ శిశువుకు ప్రాణము లేదు" అనే వివరణ విప్లవాత్మకముగా, పరిశోధనాత్మకముగా ఉన్ననూ, ఆ సమాచారము వలన భ్రూణ హత్యలు (గర్భహత్యలు) ఇంకా ఎక్కువ జరుగునేమోయని నా అభిప్రాయము. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** జరుగునవి జరుగక మానవు. ప్రతిది కర్మనుబట్టి ముందే నిర్ణయించబడియుండును. ఈ దినము "గర్భములో శిశువుకు ప్రాణము లేదు" అన్నంతమాత్రమున దీనివలన ఏమీ జరుగవు. ఒక చిన్న కార్యము జరుగవలెనన్నా దానికి ముందే కర్మ నిర్ణయము ఉండును. కర్మ నిర్ణయము ప్రకారమే అన్నీ జరుగుచుండును తప్ప, నేడు మనము చెప్పుకోవడము వలన జరుగునని అనుకోవడము పొరపాటగును. మనుషులు చేసుకొన్న పాప, పుణ్య ఫలితముగా ప్రతి పని పుట్టకముందే నిర్ణయించబడియుండును. దీనినిబట్టి "నేడు మనము గర్భస్థ శిశువుకు ప్రాణము లేదని చెప్పుట వలన భ్రూణ హత్యలు జరుగును" అని అనుకోకూడదు. ఒకవేళ కర్మప్రకారము

గర్భములోని శిశువును పుట్టకముందే గర్భస్రావము ద్వారా తీసివేసినా దానికి ప్రాణము లేనిదానివలన అది హత్యయూ కాదు.

**14) ప్రశ్న :- అమీబాలాంటి ఏకకణ జీవులు అండజములా? పిండజములా? ఉద్భిజములా? అయితే వాటి శరీరములో పీయూశగ్రంథి లేకుండా ఆత్మస్థానము ఎక్కడ ఉండును?**

**జవాబు :-** అండజ, పిండజ, ఉద్భిజములను మూడు రకముల పుట్టుకలు గలవాటినే ఇంతవరకు చూచాము, విన్నాము. ఈ మూడు రకములు కానివి కలవు అని ఇంతకుముందు మేము చెప్పలేదు. మనిషి తల్లిగానీ తండ్రిగానీ లేకుండా మొదట పుట్టాడు. సృష్ఠి లేనప్పుడు మనుషులే లేనప్పుడు క్రొత్తగా మనిషి పుట్టాడు. ఆ మనిషికి తల్లి తండ్రి లేరు కదా! భూమిమీద ఏ విత్తనముగానీ, ఏ చెట్టుగానీ లేనప్పుడు ఎన్నో వృక్షములు పుట్టాయి. అలాగే ఏ క్రిమికీటకము, ఏ పక్షి జాతి లేని రోజు ఎన్నో పక్షులు వచ్చాయి. మొదట పుట్టిన మనుషులుగానీ, మొదట పుట్టిన పక్షులు గానీ, మొదట పుట్టిన వృక్షలతాదులుగానీ వాటికి బాల్యము లేదు. అండజ, పిండజ ఉద్భిజములుగా పుట్టలేదు. సృష్ట్యాదిలో ఉన్న మనిషికి బాల్యము లేదు. శిశువుగా తల్లితండ్రుల నుండి పుట్టలేదు. ఒక్క పిండజమేకాదు, మిగతా అండజములు అండము నుండి పుట్టలేదు. వాటికి బాల్యము లేదు. మిగతా వృక్షములు తీగలు కూడా అంతే. ఇదంతా వింటూవుంటే విడ్డూరముగా యుంది కదా! మొదట తల్లి తండ్రులు లేకుండా పుట్టిన వారు అండజములా, పిండజములా, ఉద్భిజములా? అని అమీబా ఏకకణ జీవిని గురించి అడిగినట్లే యుండును. ఆనాడు సృష్ట్యాదిలో అందరూ ఎలా పుట్టినది మరువకుండుటకు దేవుడు ఏకకణ అమీబాను గుర్తుగా యుంచాడు. ఏక కణ అమీబా అండజముగానీ, పిండజముగానీ, ఉద్భిజముగానీ కాదు.

అట్లే మొదట పుట్టిన మనిషికి తల్లితండ్రులు లేరు. వారు పిండము నుండి పుట్టలేదు. అట్లే మొదట పుట్టిన పక్షికి తల్లితండ్రి పక్షులు లేరు. అది అండము నుండి పుట్టలేదు. జీవులు సృష్ఠి తర్వాత మూడు రకములుగా ఆత్మ చేత పుట్టింపబడుచున్నవి. సృష్ఠి పూర్వము ఆత్మ కూడా లేని రోజులలో తొలి జీవరాశులన్నీ బ్రహ్మాండమునుండి వచ్చినవి. అండము, పిండము, కానివి బ్రహ్మాండము నుండి పుట్టినవని చెప్పవచ్చును. సృష్ట్యాదిలో దేవుని సృష్ఠి బ్రహ్మాండము ద్వారా జరిగినది. బ్రహ్మాండము అనగా పెద్ద గ్రుడ్డుయని అర్థము. బ్రహ్మాండము నుండి (పెద్ద గ్రుడ్డునుండి) ఒక్కమారుగా జరుగుచున్న ప్రపంచము, నిలబడిన ప్రపంచము, బాల్యము లేని ప్రపంచము పుట్టినది. మొదట ఒక్కమారు అలా జరిగిన తర్వాత మనుషులనుండి మనిషి, జంతువులనుండి జంతువు, పక్షులనుండి పక్షులు, చెట్లనుండి చెట్లు బీజము వలన తయారగుచూ (పుట్టుచూ) వచ్చినవి. తర్వాత నేడు ఎట్లున్నదో అట్లే తయారవడము మొదలయినది. ఈ విషయమును ఇంతకంటే ఎక్కువ చెప్పడము అవసరము లేదు. ఏకకణ జీవిలో ఆత్మ కణమంతా వ్యాపించి యున్నది.

**15) ప్రశ్న :- పిచ్చివానిలో ఆత్మ కూడా పిచ్చిదా? జీవుడే పిచ్చివాడా?**

**జవాబు :-** పిచ్చివానిలో ఆత్మయుండుట వాస్తవమే. అట్లే ఒక మనిషిలో యున్నట్లే మూడు ఆత్మలేకాక మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను నాలుగు లోపలి భాగములుండుట సహజమే. అయితే పిచ్చివానిలో జీవుడు పిచ్చివాడు కాదు, ఆత్మ పిచ్చిది కాదు. బుద్ధికి ఒక్కదానికే పిచ్చియుండును. మిగతా మనస్సు, చిత్తము, అహము అన్నీ సక్రమముగానే యుండును. బుద్ధి ఒక్కటి సరిగా లేకపోతే వానిని పిచ్చివాడని అంటాము. ఇప్పుడు కూడా బుద్ధి సరిగా లేనివానిని, సక్రమముగా మాట్లాడక, ముందు వెనుకా

మాట్లాడు వానిని నీకేమయినా పిచ్చిపట్టిందా? అని అంటూయుంటాము. దీనినిబట్టి పిచ్చి అనునది బుద్ధికి సంబంధించినదేయని తెలియుచున్నది.

**16) ప్రశ్న :- క్రూరమృగము గల పులిపిల్లను మనిషి సౌమ్యముగా పెంచితే దాని క్రూరత్వము నశించునా?**

**జవాబు :-** పులి క్రూరముగా యుండుట దాని స్వభావము. అయితే పెంచిన వారికి బాగా అలవాటయివుండును. పులి అయినా 'తన' 'పర'యను భేదము బాగా తెలిసియుండును. అందువలన పాలిచ్చే తల్లియొద్ద పులి పిల్లలు ఆడుకుంటాయి. ఎందుకనగా! అది తన తల్లియని వాటికి బాగా తెలుసు. అదే విధముగా పెంచిన వారిని కూడా గుర్తించి వారి ఎడల స్నేహముగా ఉండును. అయినా 'క్రూరత్వము వాటిలో లేదు' అని చెప్పుటకు వీలులేదు. కుక్కను ఇంటిలో చిన్నప్పటినుండి సాకితే సాకినవారిమీద పూర్తి ప్రేమను కనబరచును. అదే దొంగ కనిపిస్తే మొరుగును, వీలయితే కరచును. అలాగే పులి కూడా అంతే. సాకిన వారిమీద ప్రేమను కనబరచినా, మేక కనిపిస్తే దానిని ఏకముగా చంపును. సాకినవారు కూడా వాటికి అనుగుణముగా మెలగుచుండవలెను. లేకపోతే తనవారి మీదికి కూడా దాడి చేయుటకు వెనుకాడవు. వయస్సు వచ్చిన తర్వాత లైంగిక సంబంధ వాంఛలు తీరకపోతే దాని బుద్ధిలో కొంత తేడాలు రాగలవు. అప్పుడు 'తన' 'పర' అను భేదమును మరచిపోవు అవకాశము గలదు. అప్పుడు వాటిని ఏకాంతముగా యుండనివ్వడము మంచిది. ఎంతో సాధు స్వభావముగా మెలగు ఏనుగు కొన్ని సందర్భములలో అసాధారణముగా ప్రవర్తించును. అప్పుడు సాకినవారు దగ్గరకు పోయినా ఏమాత్రము లెక్కించక వారిమీద కూడా దాడి చేయును. అందువలన క్రూర జంతువులైనా సాకిన వారివద్ద సాధువుగానే ప్రవర్తించుచుండును. అయినా వాటి ఆరోగ్య

పరిస్థితులనుబట్టి ఎప్పుడయినా అవి తమ క్రూరత్వమును ప్రదర్శించవను నమ్మకము లేదు. అందువలన క్రూర జంతువులు అన్నివేళలా ఒకే విధముగా ఉంటాయను నమ్మకము లేదు. అట్లని అవి అన్ని సందర్భములలో క్రూరముగా ఉంటాయని చెప్పడము కూడా సరికాదు. క్రూర జంతువులు తమను సాకిన వారిమీద ఎక్కువ ప్రేమగానే యుండునుగానీ వాటి వయస్సునుబట్టి, ఆరోగ్యమునుబట్టి మారుటకు అవకాశముండుట వలన కొంత జాగ్రత్తగా యుండుట మంచిది.

**17) ప్రశ్న :- దేవుడు మొదట సృష్ఠించిన మానవులు ఏ వయస్సులో ఉండేవారు? అప్పుడు కర్మలేని వారికి గుణచక్రములో మాయను సృష్ఠించి వారిని మాయలో బంధించి ఆట ఆడడము దేవునికి భావ్యమా? "అడుసు త్రొక్కనేల, కాలు కడగనేల" అనే సామెతలా వుంది.**

**జవాబు :-** మొదట దేవుడు సృష్ఠించిన మానవులు ఒక బాల్య అవస్థ విడిచి పెట్టి తర్వాత గల యవ్వన, కౌమర, వృద్ధాప్య అను మూడు దశలలో సమానముగా యుండేవారు. మొదట వారికి కర్మలేనిది వాస్తవమే! దేవుడు మనిషిని తయారుచేసినప్పుడే మనుషులకు సంబంధించిన అన్ని విధానములను సృష్ఠించాడు. అప్పుడే కర్మ విధానము కూడా తయారైనది. మొదట మనకి కర్మలేకున్నా జరిగెడి పనులలో తనకు సంబంధము లేదను వారికి కర్మ అంటుకోకుండా ఉండు కర్మ సిద్ధాంతమును, అట్లే జరిగెడి పనులతో తనకు సంబంధముంది అనుకోవడము వలన కర్మ అంటుకొను నట్లు కర్మ సిద్ధాంతమును దేవుడు నిర్మించాడు. ఆ విధానము ప్రకారము సర్వసాధారణముగా జరుగు పనులను మనిషి 'తానే చేశాను' అని అనుకొనుట వలన మనిషికి కర్మ అంటుకోవడము జరుగుచున్నది. అలా మొదలయిన కర్మను మనిషే తన నెత్తిన వేసుకొంటున్నాడుగానీ, దేవుడు

ఎవరికీ ఎటువంటి కర్మను అంటగట్ట లేదు. కర్మసిద్ధాంతమును నిర్మించిన దేవుడు దానికి విరుగుడుగా జ్ఞానమును కూడా చెప్పాడు.

**18) ప్రశ్న :- దేవుడుంటే అందరికీ వినిపించేటట్లు ఆకాశవాణి ద్వారా "నేనున్నాను" అనే మాటను చెప్పవచ్చును కదా! అప్పుడు మాలాంటి వారు కూడా నమ్ముతారు కదా! సర్వశక్తివంతమైన దేవుడు ఎందుకు అలా చేయడు?**

**జవాబు :-** దేవుడుండే మాట నిజమే. అయితే ఆయనకున్న ధర్మము ప్రకారము ఆయన మనమనుకున్నట్లు తెలియబడకూడదు. దేవునికున్న ప్రాథమిక ధర్మము **రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు.** ఈ ధర్మము ప్రకారము దేవుడున్నా తెలియబడడు. దేవుడున్నాడని ఆయన తెలియకుండా పోయినా దేవుడున్నాడని అనుకోవడము, మేము చూచామని చెప్పు కోవడము, మేము దేవునితో మాట్లాడినామని చెప్పుకోవడము చూచి దేవుడే నవ్వుచున్నాడు. నాస్తికవాదులు తమకు తెలిసో తెలియకో 'దేవుడు లేడు' అని అనుచున్నారు. అయితే ఆస్తికవాదులు 'దేవుడున్నాడు' అని చెప్పుచున్నారు. దేవుడున్నమాట వాస్తవమే అయినా ఆస్తికులు చెప్పినట్లు దేవుడు లేడు. అట్లే 'దేవుడు లేడు' అని నాస్తికవాదులు చెప్పుచున్నా, వారు అనుకున్నట్లు కూడా దేవుడు లేడు. నిజము చెప్పితే నాస్తికుల ప్రక్కలో దేవుడున్నాడు. నాస్తికులలో కూడా దేవుడున్నాడు. అయినా దేవుడు లేనట్లే యున్నాడు. దేవుడు లేడు అనినా ఆ మాట సరిపోతుంది. ఒక విధముగా దేవుడు లేడు. అయితే దేవుడు లేకుండా యున్నాడు. అందువలన మేము దేవున్ని గురించి ఒక ప్రత్యేకమయిన మాట చెప్పుచూ **"దేవుడు అబద్ధముగా యున్నాడు"** అని చెప్పాము. అందువలన నాస్తికులు గ్రుడ్డిగా దేవుడు లేడు అనుటకంటే వివరము తెలిసి 'శాస్త్రబద్ధముగా లేడు' అనడము మంచిది.

అలాగే ఆస్తికులు 'దేవుడు ఉన్నాడు' అనుటకంటే దేవుని నిజస్థితి తెలిసి ఆయన ఎలా ఉన్నాడో శాస్త్రీయముగా చెప్పితే బాగుండును. శాస్త్రబద్ధము కాకుండా దేవుడున్నాడని ఆస్తికులు చెప్పకూడదు. అట్లే శాస్త్రాధారము లేకుండా దేవుడు లేడని నాస్తికులు చెప్పకూడదు.

**19) ప్రశ్న :- ఉప్పు నీటిని వేడెక్కించి దానిపైన మూత పెడితే మూత తీసివేస్తే మూతకున్న నీటి ఆవిరి నీరుగా మారితే ఆ నీరు ఉప్పగా ఉండవు. అదే విధముగా సూర్యుడు సముద్రములో యున్న ఉప్పు నీటిని తగిన ఉష్ణోగ్రతలో అలా చేయడము వలననే, ఉప్పు నీరు వర్షము పడడము లేదు అని మేమంటాము, మీరేమంటారు?**

**జవాబు :-** సముద్ర జలమంతయూ ఉప్పుగా ఉండుట నిజమే. సగము నీళ్ళు, సగము ఉప్పు ఉన్నంత సాంద్రతలో నీరు ఉప్పగాయున్నది. సముద్ర జలము ఆవిరిగా మారి మేఘములుగా తయారై వర్షించుచున్నవని శాస్త్ర పరిశోధకులు, శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. నీరు ఆవిరిగా మారి పైకి పోవుట వలన నీటిలోని ఉప్పంతయూ సముద్రములో యుండిపోయి ఆవిరి ద్వారా స్వచ్ఛమయిన నీరు పైకి మేఘములలో చేరిపోయి అవి వర్షించునప్పుడు ఉప్పులేని స్వచ్ఛమయిన మంచి నీటిని వర్షించుచున్నవని చెప్పుచుందురు. వారు చెప్పినట్లు మేఘములు మంచినీటిని వర్షించుట వాస్తవమే. అయితే వారు చెప్పిన విధానమును మేము పూర్తి వ్యతిరేఖించి నాము. నూరు సెంటిగ్రేడు డిగ్రీల వద్ద నీరు ఆవిరి కాగలదు. తక్కువ ఉష్ణోగ్రతలో నీరు ఆవిరి కాదని చెప్పాము. వాతావరణములో ఎండల కాలములో కూడా 40 నుండి 50 డిగ్రీల వరకు వేడి రావడము జరుగుచున్నదిగానీ, నూరు డిగ్రీల ఉష్ణోగ్రత ఎక్కడా రావడము లేదు. అటువంటప్పుడు సముద్రపు నీరు ఆవిరిగా మారి మేఘములగునని చెప్పడము పూర్తి వ్యతిరేఖము.

మేఘముల విషయమై ఇంతవరకు ఎవరూ లోతుగా ఆలోచించలేదని, అందువలన సముద్రము నీరు ఆవిరై మేఘములలో చేరుచున్నదని కొందరు చెప్పగా అందరూ విన్నారని, అది తప్పా ఒప్పా అని ఆలోచించకపోవడము వలన నీరు ఆవిరై పైకి చేరుచున్నదని పూర్తిగా నమ్మారు. మేము ఆ విషయమును **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అను గ్రంథములో పూర్తిగా వ్యతిరేఖించి నూరు డిగ్రీల ఉష్ణోగ్రత లేనిది నీరెట్లు ఆవిరైతున్నదని అడిగాము. అంతటితో ఆగక మేఘము సముద్ర నీటిని నేరుగా తీసుకొంటున్నదని, ఒక్కొక్కప్పుడు సముద్ర నీటిని తీసుకొనునప్పుడు నీటితోపాటు చేపలను కూడా తీసుకొంటున్నదని, మేఘము సముద్రములో నీటిని టోర్నడోల రూపములో సముద్రమునుండి నీరును గ్రహించుచున్నదని చెప్పాము. టోర్నడోలు అనగా మేఘములలో పుట్టు సుడిగాలి వలన ఏర్పడునవని చెప్పాము. అలా సుడిగాలి మేఘముల వలన సముద్రపు నీటిని గ్రహించిన మేఘములు అదే నీటినే భూమిమీద వర్షించుచున్నవని కూడా చెప్పాము. ఈ విషయము అందరికీ తెలిసినా, తెలియకపోయినా ఇప్పటికీ ఎప్పటికీ జరుగుచున్న సత్యము. ఎప్పుడయినా అరుదుగా భూమిమీద చెరువులలో నీటిని కూడా మేఘము పీల్చుకొని చెరువును ఖాళీ చేయుచున్నది. మేము చెప్పిన విధానము సముద్రము మీద జరుగుచున్నదని చెప్పినది సత్యమని అందరికీ తెలియుటకు అప్పుడప్పుడు భూమిమీద చెరువులలోని నీటిని మేఘము మనుషులు చూస్తున్నట్లే పైకి లాగుకొనడము, చెరువు ఖాళీ అయిపోవడమును ప్రత్యక్షముగా చూచిన వారు కలరు. సృష్ట్యాదినుండి ఇదే విధానము కొనసాగుతున్నా మనుషులు దానిని ఇంతవరకు తెలియక నీరు ఆవిరై మేఘములలో చేరి, తర్వాత భూమిమీద వర్షముగా పడుచున్నదని తెలియక పోయినది. ప్రస్తుతము ఆ విషయమును

మేము గ్రంథములో వివరముగా వ్రాశాము. వర్షము ఒక్కటే కాక మేఘములు చేయు కార్యములన్నిటినీ పూసగ్రుచ్చినట్లు చెప్పాము.

అయితే ఇప్పుడు వర్షపు నీటిలో ఉప్పులేదే, సముద్ర నీరును మేఘము నేరుగా తీసుకొన్నప్పుడు సముద్రపు నీటిలో ఉప్పు ఉండవలెనని, అలా లేకపోవడము వలన నీరు ఆవిరై మేఘములలో చేరునను మాట సత్యముగా కనిపించుచున్నది. మీరు చెప్పేమాట అసత్యముగా కనిపించు చున్నదని పై ప్రశ్నను అడగడము జరిగినది. మేఘములను గురించి అనేక విషయములను చెప్పిన నేను ఇప్పుడు మీరు అడిగిన ప్రశ్నకు జవాబును చెప్పవలసియున్నది. జవాబు చెప్పడము నా బాధ్యత.

మేఘము సముద్రపు నీటిని నేరుగా పైకి తీసుకొనుట వలన సముద్రములోని ఉప్పునీరు మేఘములలో చేరిపోవుచున్నది. ఎండ కాలములోనే కాకుండా ఎప్పుడు అవసరమనిపిస్తే అప్పుడు మేఘములు సముద్రపు నీటిని తీసుకొనేవి. ఉప్పు నీరును తీసుకొన్న మేఘము ఆకాశములో అదృశ్యమై పోవును. 20 ఎకరముల విస్తీర్ణము గల ఒక మేఘము సముద్రపు నీటిని నింపుకొన్న తర్వాత అదే రోజుగానీ, రెండవ రోజుగానీ దృశ్యరూపముగాయున్న మేఘము అదృశ్య రూపముగా మారిపోవుచున్నది. కరిగి కనిపించకుండా పోయిన మేఘము తర్వాత కొంత కాలమునకు ప్రపంచములో ఎక్కడో ఒకచోట కనిపించును. కొన్ని గంటలుగానీ, కొన్ని దినములుగానీ, కొన్ని నెలలుగానీ కనిపించకుండా పోయిన మేఘము తిరిగి కనిపించును. కొన్ని గంటలుగానీ, కొన్ని దినములు గానీ కనిపించకుండాయున్న మేఘము తిరిగి కనిపించే వరకు ఎక్కడున్నది? ఏమి చేయుచున్నది? అను ప్రశ్నలు రాగలవు. ఈ విషయమంతా తెలియుటకు మేఘములను గురించి ఇంకా కొంత తెలియవలసి యున్నది.

ఆకాశము ఒక భూతము (ఒక జీవుడు). ఆకాశము అదృశ్య రూపములో శూన్యముగా యుండినా తన కర్మేంద్రియములయిన చేతులను అప్పుడప్పుడు కనిపించునట్లు చేయుచుండును. ఆకాశము యొక్క చేతులే మేఘములుగా ఆకాశములో కనిపించుచుండును. ఆకాశములో మేఘములుగా కనిపించు ఆకాశ చేతులు కొంతసేపు కనిపించి తర్వాత కనిపించకుండా పోవుచుండును. ఆకాశమంతా ఒకే మేఘముగా ఎప్పుడూ కనిపించదు. ఆకాశమునకు కొన్ని కోట్ల చేతులుండును. ఆ చేతులు మాత్రమే కనిపించుట వలన కొంత ఆకాశము ఖాళీగాయుండి, కొంత ఆకాశము మేఘముగా యుండును. కొన్ని చేతులను కలిపి ఒక చోట పెట్టితే అదే పొగమేఘము (క్యములో నింబస్ మేఘము) అగును. కొన్ని చేతులు కలిపి తిప్పితే సుడిమేఘము (టోర్నడో) యగును. రెండు చేతుల ఆకారమే దాదాపు 20 ఎకరముల విస్తీర్ణము వరకు వ్యాపించుకోగలదు. ఆకాశము యొక్క చేతుల బలము ఎవరి అంచనాకు రాదు. దాని బలము ఎవరికీ తెలియదు. ఆకాశములో కల్గు వాతావరణ మార్పులను, తుఫానులు, సునామీలను మేఘములే కల్పించుచుండును. రెండు చేతుల మేఘము ఎంత ఉపద్రవమునయినా కల్గించగలదు. కొన్ని వేల చేతులు కలిస్తే ఎంతటి పనినైనా చేయగలవు. ఎంతటి వినాశనమునయినా సృష్ఠించగలవు. ఆకాశములో కొన్ని లక్షల చేపలను ఉంచుకొని కొన్నిరోజులు పోషించి తర్వాత ఒక్క చేప కూడా క్రిందపడి చనిపోకుండా బ్రతికిన చేపలను చిన్న దెబ్బ తగులకుండా తమ చేతులతో భూమిమీద విడువగలవు. చేపలు ఆకాశమునుండి వర్షములో క్రిందపడినట్లే కనిపించినా ఆకాశ చేతులు భూమికి అడుగు ఎత్తులో వదలుచున్నవి. అట్లే వడగండ్ల వాన కురిసినప్పుడు చిన్నచిన్న ఐస్ముక్కలను పైనుండి అయినా విసరగలవు. క్రిందనుండయినా విడువగలవు. కొన్నిచోట్ల పై నుండి వేగముగా విసిరిన వడగండ్ల చేత

పచ్చి అరటి కాయల గెలలకు రంధ్రాలు పడియుండడము కూడా చూచి యున్నాము. మేఘములు అనుకొంటే ఏమయినా చేయగలవు. గతములో మేఘముల గురించి కొంతవరకు వ్రాసియుంచాము.

సముద్రపు నీరును గ్రహించిన మేఘము ఒక దినమునుండి కొన్ని నెలల వరకైనా తనయందే నీరును కనిపించకుండా అదృశ్యరూపములో పెట్టుకోగలవు. ఎప్పుడు అవసరమైతే, ఎక్కడ అవసరమైతే అక్కడ తనయందు గల నీరును వర్షరూపములో వదలును. సముద్రమునుండి తీసుకొన్నప్పుడు మేఘము ఉప్పునీరును తీసుకొనియుండును. ఉప్పునీరు తీసుకొన్న మేఘము పూర్తి అదృశ్యమైపోవును. అదృశ్యరూపములోయున్న మేఘము తనయందు గల నీటిలోనున్న ఉప్పును నీటి నుండి విడదీయుచున్నది. నీటియందు గల ఉప్పును నీటినుండి విడదీసి బయటికి వచ్చిన ఉప్పును అదృశ్య రూపములోనే తిరిగి సముద్రములో వదలి వేయుచున్నది. ఈ విధముగా సముద్రముండి వచ్చిన ఉప్పు తిరిగి సముద్రములో కలిసిపోవు చున్నది. ఉప్పునుండి విడిపోయిన మంచినీరును మేఘము వర్షించుచున్నది. మొదట సముద్రమునుండి వచ్చిన ఉప్పునీరు మేఘములలో అదృశ్యముగా నీటినుండి విడదీయబడి ఉప్పు సముద్రములో విడువబడగా నీరు భూమి మీద వర్షముగా వర్షించుచున్నది. ఈ విధముగా మేఘములు పని చేయుచుండగా భూమిమీద మంచి నీరు వర్షింపబడుచున్నది.

**20) ప్రశ్న :- భూమి అనేది ఒక జీవుడు (ఒక భూతము) అని అంటున్నారు కదా! మరి మనుషుల, జంతువుల మలమూత్రములను భరించుటకు దాని కర్మయని అనుకుందామా?**

**జవాబు :-** మలమూత్రములు మనుషులకు అసహ్యముగా యుండినా

పందులకు ఆనందముగా ఉండుట తెలిసిన విషయమే. అలాగే నీకు అసహ్యముగాయున్న మలమూత్రములు భూమికి కూడా అసహ్యముగా ఉండునని ఎందుకనుకోవాలి? భూమికి మనుషుల, జంతువుల మల మూత్రములు ఎరువులుగా ఉపయోగపడుచున్నవి. ఎరువులు వేయబడిన భూమి బలమైనదని అనడము వినియేయుందుము. మలమూత్రముల ఎరువులు భూమికి మంచి బలమైన పోషక పదార్థములుగా యుండి అనగా ఆహార పదార్థములుగాయుండి, అందులోని పోషకముల వలన నేల బలమైనదని అనిపించుకొంటున్నదంటే భూమికి మలమూత్రములు సరిపోని పదార్థములుగా ఎందుకు అనుకోవాలి? భూమికి సరిపోవు మంచి ఆహారములని ఎందుకు అనుకోకూడదు? నీకు సరిపోనంతమాత్రమున భూమికి సరిపోదు అని ఎందుకు అనుకోవాలి? మనకు రోతగాయున్న పదార్థములు ఇతర జంతువులకు ఆనందముగా యున్నట్లు, మనకు అసహ్యముగా యుండునవి భూమికి బలమైన పోషక పదార్థములుగా యున్నవని తలచవలెను.

**21) ప్రశ్న :- భూమి తిరుగుటకు సెంట్రిఫ్యూగల్, సెంట్రిపెటల్ ఫోర్సు కారణమని మా సైన్సు చెప్పుతున్నది. మీరేమో భూమి ఒక భూతము అది ఆత్మ ద్వారా తిరుగుచున్నదని చెప్పుచున్నారు? దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** భూమి అను జీవుడు ఆకాశమను జీవుడులో ఒకడుగా యున్నాడు. పొట్టలో పురుగుండగా అది మనిషిలో ఉండునదే అయినా పొట్టలోని పురుగువేరు, పొట్టగల మనిషి వేరుగా యున్నారు. అట్లే ఆకాశము విశాల మైనది, ఆకాశములో భూమి తిరుగుచున్నది. ఆకాశములోని ఆత్మ బయట సైన్సుకు కనిపించునట్లు సెంట్రి ఫ్యూగల్, సెంట్రిపెటల్ ఫోర్సులను సృష్ఠించి భూమిని త్రిప్పుచున్నది. ఆకాశములోని ఆత్మచేత తయారయిన రెండు

ఫోర్సుల చేత భూమి తిరుగుచున్నది. భూమి శరీరములోని ఆత్మ త్రిప్పలేదు. ఆకాశ ఆత్మ చేత భూమి త్రిప్పబడుచున్నది. భూమిలోనూ ఆత్మయున్నది, ఆకాశములోనూ ఆత్మయున్నది. ఏ ఆత్మ చేత భూమి తిరుగుచున్నదని చాలామందికి తెలియదు. బయటి ఆత్మ ఫోర్సుచేత భూమి త్రిప్పబడు చున్నదిగానీ భూమి తనకు తానుగా తిరగలేదు.

**22) ప్రశ్న :- దేవుడు అనేవాడు అణువణువునా ఉండినట్లు, దేవుడు లేని స్థలము సూదిమొన మోపినంత కూడా ఎక్కడా లేదని మీరు చెప్పుచున్నారు. అట్లయితే మలమూత్రములలో కూడా దేవుడున్నాడా? మీ సూత్రము ప్రకారమయితే మలములో కూడా దేవుడున్నాడు అని మీరనవచ్చును. దాని ద్వారా, మీరట్లు చెప్పుట ద్వారా మీ దేవున్ని అపవిత్ర వస్తువులలో ఉన్నట్లుగా చెప్పి, మీరే మీ దేవున్ని అవమానించినట్లు కాదా!**

**జవాబు :-** మనిషికి పవిత్రత, అపవిత్రతయుండును. అట్లే శుద్దము, అశుద్దము యుండును. ఇవే వస్తువులు దేవునికి అన్నీ సమానముగానే యుండును. ఒకటి మంచిదనిగానీ, మరొకటి చెడుదనిగానీ ఏమీ యుండదు. దేవుని ఎడల అన్నీ సమానముగా యుండును. మనిషి తన పట్ల పవిత్రత అపవిత్రత అనుకొన్నట్లు దేవుని పట్ల అనుకోకూడదు. అగ్ని కణములో, బంగారు అణువులో, ధూళికణములో, మనిషి శరీర కణములో, పాలయందు, పేడయందు దేవునికి సమ భావముండును. మనిషికున్న భావము ప్రకారము దేవుని భావముండదు.

**23) ప్రశ్న :- తిన్న ఆహారము మొత్తము జీర్ణమై, పోషణ జరిగి శక్తిగా మారవచ్చును కదా! ఆత్మగా ఉన్నదేదో మానవశరీరములో అశుద్దాన్ని ఎందుకు తయారు చేయాలి? ఆ వ్యవస్థను ఆపివేయవచ్చును కదా?**

**జవాబు :-** కట్టెను కాలిస్తే అది కాలిపోయి చివరకు బొగ్గు బూడిద మిగిలి పోవును. అట్లే శరీరములో జఠరాగ్ని వలన కాలిపోవు ఆహారమునకు కూడా బొగ్గు బూడిదలాంటి కలుషితము ఏర్పడును. ఏ వస్తువైనా ఇంతకు ముందు ఇది ఉంది అనుటకు ఆనవాళ్ళుగా వాటి అవశేషము మిగులును. యజ్ఞము చేస్తే యజ్ఞ భస్మము మిగులును. శవమును కాల్చితే చితాభస్మము మిగులును. యజ్ఞ భస్మమును ల్యాబ్‌లో పరీక్షిస్తే అందులో కలిసిన కణములను బట్టి యజ్ఞ భస్మమని చెప్పవచ్చును. అలాగే చితా భస్మమును పరీక్షించి ఇది చితాభస్మమని చెప్పవచ్చును. ఆహారము జీర్ణమైన తర్వాత మలమును పరీక్షించి ఆహారములో విషము కలిసియున్నదని చెప్పవచ్చును. తినిన ఆహారము గుర్తింపునకు వాటి అవశేషములను చూచి ఇది ఫలానా ఆహారమని గుర్తించవచ్చును. అలాగే ఒక మనిషి భూమిమీద పుట్టి చనిపోయినా, వాని గుర్తింపుగా వాని మంచి చెడులు మిగిలి ఉంటా యనుటకు గుర్తుగా, ఆహార జీర్ణ శేషమును దేవుడు మిగిల్చి చూపాడు.

**24) ప్రశ్న :- ఒకసారి ఎవరితోనయినా మాట్లాడిన మాటలు ఇంతకుముందు ఎప్పుడో, ఎక్కడో ఇలాంటి సందర్భము వచ్చినట్లు అనిపిస్తుంది. కానీ అది ఎప్పుడూ జరుగలేదు. అట్లు ఎందుకు అనిపించింది?**

**జవాబు :-** ఆ భావము కొందరిలో అరుదుగా రావడము జరుగుచుండును. అయితే అది ఎప్పుడూ జరుగలేదని తెలిసినా, అది ఈ జన్మలో జరిగినది కాదు. వెనుకటి జన్మలలో అదే మనిషితో నీవు మాట్లాడిన సందర్భము జరిగియుండును. కనుక ఆ విధముగా అనిపిస్తుంది.

**25) ప్రశ్న :- పాముకు శ్రవణేంద్రియములు కళ్ళలో ఉన్నవన్నారు. అన్ని పాములలోనా? కొన్ని పాములకేనా? మరి మిగతా పాములు ఎలా**

**వినగలవు? కళ్ళే శ్రవణేంద్రియములుగా (చెవులుగా) యున్న ఇంకా కొన్ని జీవులు కలవా?**

**జవాబు :-** పాముల విషయము బాహ్య విషయమగును. అందువలన వాటి విషయము నాకు పూర్తిగా తెలియదు. అయితే నాకు తెలిసినంత వరకు, నేను విన్నంతవరకు విషపాములకు చెవులు లేవని విన్నాను. "కళ్ళలోనే వినికిడి శబ్దముండుట వలన శబ్దము వినిపించినప్పుడు పాముకు కళ్ళు కనిపించవు" అని విన్నాము. అందువలన విషముగల నాగుపామును ఆడించువారు బుర్రను ఊపుచూ, శబ్దము చేయుచూ దానికి కళ్ళు కనిపించ కుండా చేసి పాములను పట్టుచుందురు. అట్లే వాటిని ఆడించుచుందురు. శబ్దమునుబట్టి పాము తల త్రిప్పుచుండును. అది ఒక ఆటగా పాముల వాళ్ళు బుర్రను ఊదుచూ చూపుచుందురు. పాముకు కళ్ళలోనే వినికిడి యుండుట వలన కీటకములు శబ్దము చేయుచూ పాములను ప్రస్తుతము గ్రుడ్డివిగా యుండునట్లు చేసి తప్పించుకొనగలవు. అందువలన కొన్ని కీటకములకు, పక్షులకు శబ్దము ఎక్కువ చేయునట్లు వాటి కంఠములు తయారయినవి. **"పిట్టకొంచెము కూత ఘనము"** అని పెద్దలు చెప్పునది సత్యమే. పాములనుండి తప్పించుకొనుటకే పక్షుల కూతను ఘనముగా ఉండునట్లు దేవుడు చేశాడు. కొన్ని పెద్ద పాములయిన అనకొండ, కొండ శిలువ పాములకు చెవులు వేరుగాయుండునని విన్నాము. అందువలన అవి ఎంత శబ్దములో అయినా చూడగలవు. మిగతా అన్ని జీవులకు ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు సమానముగా యున్నవి.

**26) ప్రశ్న :- పుణ్యక్షేత్రములకు వెళుతున్నవారు రోడ్డు ప్రమాదములలో, మిగతా ప్రమాదములలో చనిపోవుచున్నారు కదా! మరి వారిని దేవుడు ఎందుకు రక్షించలేదు?**

**జవాబు :-** పుణ్యక్షేత్రాలకు పోయేవారు అందరూ కాక కొందరు ప్రమాదముల పాలగుట వాస్తవమే. పుణ్యక్షేత్రాలకు పోయినప్పుడు దానికి తగిన పుణ్యము లేకపోవడము వలన, పాపము వంతుకు వచ్చిన దానివలన మనుషులకు ప్రమాదము జరుగుచున్నది. దేవుడు ఎప్పుడుగానీ, ఎక్కడగానీ రక్షించువాడు కాదు, అట్లే శిక్షించువాడు కాదు. మనుషులు చేసుకొన్న పాపపుణ్యముల వలన ప్రమాదములు జరుగుచుండును. దేవుడు సాక్షిగా చూచేవాడే గానీ ఏమీ చేయువాడు కాడు. ప్రపంచ పనులతో దేవునికి సంబంధము లేదు. అందువలన మనిషియొక్క సుఖదుఃఖములను దేవుడు విధించువాడు కాదు. కర్మనుబట్టి **ఆత్మే** అన్నీ చేయుచుండును, జీవాత్మ అనుభవించుచుండును.

**27) ప్రశ్న :- దేవుడు అనేది విశ్వాసమా? మూఢనమ్మకమా?**

**జవాబు :-** దేవుడనేది విశ్వాసము మాత్రమే. దేవున్ని చూచానని చెప్పడము మూఢనమ్మకమగును. దేవుడు కనపడుతాడనీ, మాట్లాడుతాడని అనుకోవడము మూఢనమ్మకము.

**28) ప్రశ్న :- భగవద్గీత నాదే సరైన భావము గలది యంటున్నారు. మీరు సంస్కృత పండితులా?**

**జవాబు :-** భగవద్గీతను జీవుడుగా యున్న నేను వ్రాయలేదు. నేను మౌనముగా ఉండగా వ్రాసేవాడే వ్రాశాడు. ఆయన పండితులను మించిన పండితుడు. అందువలన మా ద్వారా వచ్చిన భగవద్గీత ప్రత్యేకముగా కనిపించుచున్నది. మేము చెప్పినా చెప్పకపోయినా మా త్రైత సిద్ధాంత భగవద్గీత అందరికీ గొప్పగనే కనిపించుచున్నది.

**29) ప్రశ్న :- బొద్దింకకు తల తీసివేసినా పది రోజులు దాని శరీరము**

**పని చేస్తుంటుంది. అన్ని రోజులు ఆత్మస్థానమైన దాని తల లేకుండా ఎట్లు బ్రతుకగలదు?**

**జవాబు :-** బొద్దింక తలపోయినా బ్రతుకుట వాస్తవమే! అయితే ఆత్మ శాశ్వత స్థానము తలయని అనుకోకూడదు. ఏడు నాడీకేంద్రములలో తల స్వస్థానమని చెప్పినా ఆత్మ తన స్థానమును మిగతా ఆరు స్థానములలో ఏ స్థానములోనికయినా మార్చుకోవచ్చును. ఒక బొద్దింక శరీరములోనే అలా ఆత్మ మార్చుకోవడము వలన బొద్దింకే మనకు కనిపిస్తున్నది. ఈ మధ్య దాదాపు సంవత్సరము క్రితము ఒక కోడికి తల కోసివేస్తే అది మొండెముతోనే బ్రతికి యున్నట్లు న్యూస్‌పేపరులో బొమ్మతో సహా వార్త వచ్చింది. అక్కడ కోడి శరీరములో కూడా ఆత్మ తలను వదలి మిగతా 6వ స్థానములోనికి తన స్థానమును మార్చుకొన్నట్లే కదా! ఇంకా లోతుగా విషయమును తెలియగలిగితే **ఆత్మ**కు శరీరములో స్వంత స్థానము అంటూ ఏదీ లేదనీ, ఉన్నది **జీవాత్మ**కేనని తెలియుచున్నది. జీవునితోపాటు ఆత్మ కదలి పోవలసియుండుట వలన ఆత్మ కూడా జీవాత్మవలె ఏడవ స్థానములోనే యున్నదని అనుకోవడము జరుగుచున్నది. అంతేగానీ ఆత్మకు స్వంత స్థానము ఎక్కడా లేదు. జీవుడు పుట్టినప్పటినుండి ఆత్మ శరీరమంతా వ్యాపించియున్నది. ఆత్మకు ఏడు నాడీస్థానములు కలవు. లెక్కాచారమునకు పై నాడీకేంద్రమునుండి ఆత్మ శరీరములో శ్వాసను ఆడించు పనిని చేయడము వలన మొదటి స్థానమును ఆత్మ స్వంత స్థానమన్నారుగానీ పై స్థానమే స్వంత స్థానము అనుటకు గట్టి ఆధారము ఏమీ లేదు. జీవునికి పొరుగు వాడని ఆత్మను చెప్పుట వలన కూడా జీవుడున్నచోటే ఆత్మయుండునను ఉద్దేశ్యముతో అందరూ ఆత్మ స్థానము పైన అని అంటున్నారు తప్ప ఇంకేమీ కాదు. ఆత్మకు ఒక స్థానమంటూ లేదు.

**30) ప్రశ్న :- కోమాలో యున్న వ్యక్తి ఎవరినీ గుర్తుపట్టలేడు. అలా గుర్తు పట్టకపోవడమునకు కారణము ఏమి? అతనిలో ఆత్మ దేనియందు ప్రసారము కాలేదు?**

**జవాబు :-** కోమాలోయున్న వ్యక్తికి ఆత్మ అన్ని విధముల సక్రమముగానే యుంది. శరీరమంతా సక్రమముగానే వ్యాపించియున్నది. అయితే బుద్ధి ఒక్కటి పని చేయలేని స్థితిలోయుండుట వలన బయటి విషయములను ఇంద్రియములు తెలుపుచున్నా బుద్ధి గ్రహించుకొనే స్థితిలోయుండదు. ఆత్మే అదేపనిగా బుద్ధిని పనిచేయనివ్వదు. శరీరములో అన్ని భాగములను నడిపించునది ఆత్మే. ఆత్మ బుద్ధిని నడిపించని దానివలన మనిషి బయటి స్థితిని గ్రహించుకోలేడు. అట్లే లోపలి స్థితిని కూడా బుద్ధి తెలుపదు. శరీరములో బుద్ధి పని చేయని దానివలన మనిషి కోమాలో యుంటున్నాడు.

**31) ప్రశ్న :- మనిషి చనిపోతే కాలమరణమా? అకాలమరణమా అని తెలుసు కొనుట ఎట్లు?**

**జవాబు :-** మనిషి చనిపోయినప్పుడు అవసానదశ ఏర్పడి చనిపోయివుంటే కాలమరణమగును. అవసానదశ ఏర్పడక అకస్మాత్తుగా చనిపోయిన వాడు అకాలమరణమును పొందినట్లేగా లెక్కించవలెను.

**32) ప్రశ్న :- ప్రబోధాశ్రమములో గల శిష్యగణము ఎందరు గలరు?**

**జవాబు :-** కనిపించేవారు దాదాపు రెండువందలమంది నివాసముంటు న్నారు. కనిపించని వారు దాదాపు ఐదువందల మంది ఉంటారు. పౌర్ణమి, అమావాస్య రోజులలో అయితే కనిపించనివారు కొన్ని వేలమంది యుంటారు, కనిపించేవారు కొన్ని వేలమంది వస్తారు.

**33) ప్రశ్న :- శ్రీకృష్ణుడినే జగద్గురువు అంటున్నారు. అట్లే పీఠాధిపతులను కూడా జగద్గురువు అని అంటున్నారు. దీని ప్రకారము జగద్గురువులు ఎందరైనా ఉండవచ్చునా?**

**జవాబు :-** ప్రపంచములో జగద్గురువు ఒక్కడే ఉండును. వాడే భగవంతుడు. ప్రపంచమునకంతటికీ వర్తించు బోధను చెప్పువాడు జగద్గురువు. అనగా **ప్రతి జీవరాసికి వర్తించు బోధను చెప్పువాడు జగద్గురువు.** శిష్యుల సంఖ్యనుబట్టి జగద్గురువు అని చెప్పుటకు వీలులేదు. భగవంతునికి శిష్యులుండరు అయినా ఆయన జగద్గురువే. చెప్పే బోధనుబట్టి జగద్గురువు అని చెప్పవచ్చునుగానీ, వినే శిష్యుల సంఖ్యనుబట్టి జగద్గురువు అని అనకూడదు. శంకరాచార్యుల వారికి శిష్యుల సంఖ్య ఎక్కువ యున్నదని జగద్గురు శంకరాచార్య అని అన్నారు. అలా చెప్పడము తప్పు. అన్ని మతములకు వర్తించు బోధను, అన్ని జీవరాసులకు వర్తించు బోధను చెప్పువానినే జగద్గురువు అని అనాలి. ఒక మతమునకు చెప్పిన బోధ ఇతర మతములకు వర్తించడము లేదు. అటువంటప్పుడు ఒక మత గురువును జగద్గురువు అని చెప్పకూడదు.

**34) ప్రశ్న :- సృష్టిలో ఇంత విచ్ఛిన్నత ఎందుకున్నట్లు?**

**జవాబు :-** కర్మనుబట్టే మనుషులలో విచ్ఛిన్నత ఏర్పడినది. కర్మనుబట్టి మనుషుల మధ్యలో ద్వేషములు ఏర్పడినవి. మనుషులలో ఎన్ని విచ్ఛిన్నతలున్నా అవన్నియూ కర్మనుబట్టి ఏర్పడినవేయని తెలియవలెను.

**35) ప్రశ్న :- సూక్ష్మశరీరముతో యున్న జీవుడు బ్రతికియున్న వారి శరీరములో చేరినప్పుడు, శరీరములో ఏదో ఒకచోట ఉండును. ఒకప్పుడు కడుపులో యున్నది మరొకప్పుడు తలలోనికి, తర్వాత కాలిలోనికి, ఆ తర్వాత**

**భుజము లోనికి ప్రాకుచుండును. ఆ విధముగా శరీరమంతా ఎక్కడబడితే అక్కడ ఉండుట సాధ్యమగునా? సూక్ష్మశరీరమునకు గుణచక్రమువుంటే వారు బ్రతికున్న వారి శరీరములో తలలోనే ఉండాలి కదా! గుణచక్రము అందులో జీవుడు సూక్ష్మముగా యున్న తల ఇతరుల శరీర భాగములలో ఎలా ఉండగలుగుచున్నది?**

**జవాబు :-** సూక్ష్మశరీరముతో జీవుడు బ్రతికియున్న వారి శరీరములో ఎక్కడయినా ఉండవచ్చును. ఒక్కచోటే అయినా ఉండవచ్చును. ఇతర శరీర భాగములలోనికి కూడా మారవచ్చును. తలలో పాల భాగములో చేరితే సూక్ష్మశరీరము బ్రతికియున్న వానిని నిద్రమత్తులోనికి పంపించి, నిద్రలోనికి పోవునట్లు చేసి శరీరములో పైకి వచ్చి మాట్లాడును. శరీరములో పైకి వచ్చి మాట్లాడలేదు అంటే శరీరములో ఏదో ఒకచోట శరీరములో ఉంటుందని తెలియవలెను. పూర్తి పైకి వచ్చి మాట్లాడవలెనంటే శరీరములో ఇతర భాగములయందుండు సూక్ష్మశరీరము తల మధ్య భాగములో సమానముగా వచ్చి మాట్లాడును.

**36) ప్రశ్న :- హద్దులు మీరుచున్న నాగరికత, అశ్లీల నృత్యాలు, వేశ్య వాటికలు, మితిమీరిన వ్యభిచారము, పాశ్చాత్య నాగరికత ఎంతో వెగటుగాయుంది. తన సృష్ఠి ఇలా మారినందుకు దేవునికి ఎదురు దెబ్బ తగిలినట్లుగా మేము భావిస్తున్నాము. దేవుడుంటే ఈ సృష్ఠిని ఎందుకు చేశానురా!యని తలపట్టు కొని బాధపడుతాడని అనుకోవచ్చునా?**

**జవాబు :-** 'తన సృష్ఠి ఇలా మారినందుకు' అని మీరు అన్నారు. ఇక్కడ మనము తెలియవలసినది ఏమనగా! దేవునికి తెలియకుండా ఏదీ స్వయముగా మారుటకుగానీ, తయారగుటకుగానీ వీలులేదు. అన్నీ దేవునికి

తెలిసే జరుగుచుండును. దేవుని సంకల్పముతోనే ఆత్మ చేయించగా అందరూ అన్ని పనులు చేయుచున్నారు. తాను చేసిన సృష్టిని తానే నడుపుచున్నాడు కావున దేవునికి ఎదురుదెబ్బ, బయట దెబ్బ తగుల లేదు. మనుషులు వారివారి కర్మలను అనుభవించుటకు దేవుడే ఆత్మచేత సమాజమును ఇలా మార్చాడు అని అనుకోవడము మంచిది. జరిగినది కూడా అంతే!

**37) ప్రశ్న :- "సూక్ష్మములు (దయ్యాలు) స్థూలమైన వాటిని గ్రహించి వాటి పరిమాణాన్ని తగ్గిస్తున్నాయి" అని మీరు అంటున్నారు. అంటే దయ్యాలలో కూడా కొన్ని రకముల స్థోమతలు గల దయ్యాలున్నాయా?**

**జవాబు :-** సూక్ష్మశరీరములు అనగా దయ్యాలు ఒక్కటే కాదు. అనేక దేవతలు కూడా సూక్ష్మముగానే యున్నారు. మనుషులను, దేవతలను దేవుడు సృష్టించాడు. మనుషులు శరీరమును వదలి అకాలమృత్యువు చెందితే దయ్యాలుగా మారుదురు. తిరిగి వారి ఆయుష్షు అయిపోవు వరకు, వారికి కాలమరణము వచ్చు వరకు దయ్యాలుగా (సూక్ష్మ శరీరములతో) యుండవలసిందే. ఇక దేవతల విషయమునకు వస్తే దేవతలు పుట్టినప్పటి నుండి సూక్ష్మముగానే బయట తిరుగుచున్నారు. వారు గుడిలో ప్రతిమ యందున్నప్పుడు మాత్రము స్థూలముగా యున్నట్లు, ప్రతిమను వదలి బయటకి వచ్చి తిరుగునప్పుడు సూక్ష్మముగాయున్నట్లు తెలియవలెను. ప్రతిమలో ఉండడము ఒక గంట, రెండు గంటలుండగా మిగతా కాల మంతా బయట తిరుగుటకే దేవతలు ఇష్టపడుచుందురు. కొందరు దేవతలు రెండు మూడు నెలలకొకమారు గుడికిపోయి అక్కడ ఒక దినముండి తిరిగి బయటకివచ్చి తిరుగువారు కలరు. దేవతలలో అనేక తరగతుల శక్తిగలవారు గలరు. దయ్యాలలో జ్ఞానులు, అజ్ఞానులు రెండు రకముల

వారు గలరు. దేవతలలో కూడా జ్ఞానులున్నారు, అజ్ఞానులున్నారు. దేవతలలో కొందరు స్థూలమును గ్రహించి వాటిని వేరే జాగాలోనికి చేర్చును. అప్పుడు ముందున్న చోట ఆ వస్తువు లేకుండా పోవును. అదే విధముగా వస్తువులనేకాక దాన్యమును కూడా తీసుకపోవు అవకాశముండుట వలన అటువంటి దేవతలకు ముందే విందు పెట్టినట్లు **'పొలి'** అను పేరుతో వారికి చేయు ప్రక్రియ కూడా కలదు. అదే దయ్యాలలో అయితే స్థూలమును గ్రహించు స్థోమత అందరికీ యుండదు. ఎక్కడో ఒక్కరికి మాత్రము స్థూలమును గ్రహించు స్థోమతయుండును. ఇవన్నియూ చెప్పితే అర్థము కాకపోవచ్చును. ఇవన్నీ సూక్ష్మ విషయములైనందున బయటికి కనిపించు నిరూపణకు రావు. అందువలన వీటిని అనుభవపూర్వకముగా తెలియ వలసిందే. మేము మా అనుభవములో ఎన్నో విషయములను చూశాము కనుక వీటిని గురించి చెప్పుచున్నాము.

**38) ప్రశ్న :- చేతబడుల మీద గల గుట్టును మేము ఎన్నోమార్లు రట్టు చేశాము. మీరు చేతబడులను నమ్ముతారా? మంత్రాలకు చింతకాయలు రాలుతా యంటారా?**

**జవాబు :-** 'చేతబడులు' అనునవి నేడు కనిపెట్టినవి కావు. కృతయుగము నుండి ఉన్నవని చెప్పుచున్నాము. ఆనాడు వాటి పేరు వేరు, ఈనాడు వాటి పేరు మారుతూవచ్చి 'చేతబడి' అని అనడము జరిగినది. పేరు మార్పు చెందినది అనుటకంటే పేరును మరచిపోయి చివరకు చేతబడి అంటున్నారు. చేతబడి యనునది కలియుగములో మాట. మిగతా ముందు మూడు యుగములలో **'శస్త్రము'**లని చెప్పెడిమాటను నేడు 'చేతబడి' యని అంటున్నాము. పూర్వము ఒక మంత్రమును నేర్చి ఆ మంత్రమును శత్రువు మీదికి ప్రయోగించడమును శస్త్రమును ప్రయోగించడము అని

అనెడివారు. మొదట విలువిద్యలో ఈ శస్త్ర ప్రయోగము అమలులో యుండేది. ఒక పుల్లను మంత్రప్రయోగము చేసి వదలితే అది పెద్ద బాణముగా తయారయి ఎదుటి మనిషిని చంపేది. దానినే శస్త్రప్రయోగము అని అనెడివారు. తర్వాత కొంతకాలమునకు ఒక బాణమును శస్త్రముగా ఉపయోగించకుండా బాణము (పుల్ల) బదులు ఒక బొమ్మను తయారు చేసి దానిని మంత్ర ప్రయోగములో శస్త్రముగా బొమ్మను ఉపయోగించేవారు. అప్పుడది బాణమువలె అక్కడికి పోయి సూక్ష్మముగా బాధించేది. ఈ విధముగా ఒక బాణమునుండి మొదలయిన శస్త్రప్రయోగము బొమ్మగా తయారయినది. నేడు బొమ్మ ప్రయోగములు మంత్రములతో చేయుచూ చెడుపు చేశామని అంటున్నారు. వంద సంవత్సరముల పూర్వము ఈ చేతబడులు ఎక్కువగా యుండేవి. నేడు అవి ఏమాత్రము లేవని చెప్పవచ్చును. వాటి విద్యను తెలియకపోవడము వలన ఎవరూ చేతబడులు చేయు స్థితిలో లేరు. అయినా మాకు మంత్రాలు తెలుసుననీ, చేతబడులు చేస్తామనీ బెదిరించుచుందురు. వాస్తవానికి నేడు ఆ విద్య ఈ రాష్ట్రములో లేదని చెప్పవచ్చును. పూర్వము మంత్ర ప్రయోగముతోనే ఎన్నో పనులను సాధించెడివారు. అనేక విషయములలో మంత్రముల పనితనముండేది. ఆ కాలములో మంత్రాలకు చింతకాయలను రాలగొట్టే వారు. నేడు ఆ విద్య లేదుగానీ ఉండివుంటే చింతకాయలనే కాదు తుమ్మకాయలు కూడా రాలిపోగలవు. మంత్రముల విషయము సంపూర్ణముగా తెలియాలంటే, మంత్రములు తయారు చేయు విధానము తెలియాలంటే మా రచనలలోని **"మంత్రము–మహిమ"** గ్రంథమును చదవండి. చేతబడులను కొన్ని ప్రాంతములలో 'చెడుపులు' అని అంటున్నారు. కొన్ని ప్రాంతములలో 'ప్రయోగములు' అని కూడా అంటున్నారు. తెలంగాణ ప్రాంతములో 'చిల్లంగి' అని అంటున్నారు.

**39) ప్రశ్న :- ఉదయము నాలుగు గంటలకు నిద్ర లేవాలంటే, రాత్రి నిద్రపోయేముందు ఆ విషయమును అనుకుని పడుకొంటే జీవుడైన నాకు నిజముగానే మరునాడు నాలుగు గంటలకే మెలుకువ వస్తుంది. ఆ విధముగా నాలోయున్న ఆత్మ ఎందుకు సహకరించాలి? మెలుకువ రాకుండా చేయవచ్చు కదా! అయితే నాలుగు గంటలకే లేవాలి అని అనుకొన్నది జీవాత్మనా? ఆత్మనా?**

జవాబు :- ఉదయము నాలుగు గంటలకే లేవాలని జీవాత్మ అనుకోలేదు. ఆత్మ బుద్ధి చేత అనిపిస్తున్నది. ఆత్మ బుద్ధిచేత చెప్పించినా మనిషి తానే అనుకొన్నానని అనుకొనుచున్నాడు. తాను చేయని పనులను జీవుడు స్వయముగా తన నెత్తిన వేసుకుంటున్నాడు. శరీరములో బుద్ధి చేయు పనులను తానే చేశానని అనుకోవడము జీవునకు పూర్తి అలవాటై పోయినది. వాస్తవముగా కర్మప్రకారము జీవున్ని నడిపించి అనుభవింపజేయు ఆత్మ బుద్ధి చేత ఉదయము నాలుగు గంటలకు లేవాలని అనిపించినది. జీవున్ని నిద్రనుండి లేపేది ఆత్మే అయినందున అనుకొన్న సమయమునకు ఐదు, పది నిమిషముల ముందో లేక ఐదు పది నిమిషముల వెనుకో లేక సమాన సమయమునకో లేపుచున్నది. ఆత్మే అనుకొనుచున్నది, ఆత్మే లేపుచున్నది.

**40) ప్రశ్న :- ప్రపంచ పరముగా కనిపెట్టిన ఆవిష్కరణలుగానీ, ప్రతి అంశమును పరిశోధనాత్మకముగా చూడకల్గి, ఎన్నో సైన్సు పరిశోధనలు చేసే అవకాశము లాటిన్, గ్రీక్ మరియు అమెరికా దేశాలలో గల మనుషులలోనే ఆత్మ ఎక్కువగా అందిస్తున్నది ఎందుకు?**

**జవాబు :-** ఆ దేశముల వారిని బయట ప్రకృతియందు లగ్నమగునట్లు చేయుటకు ఆత్మ ఆ విధముగా చేయుచున్నది. అటువంటి పరిశోధకులు

తామే అన్ని చేయునట్లు తలచుచూ దేవున్ని విశ్వసించరు. పరిశోధనలలో వెనుకయున్న దేశమువారే ఎక్కువగా దేవున్ని విశ్వసించగలరు. పరిశోధనలు చేసి కొన్ని ఫలితములను పొందినవారు ఆధ్యాత్మికమును నమ్మరు. పరిశోధనలలో వెనుకయున్న భారతదేశములో ఆత్మజ్ఞానులు కలరని భారత దేశమును **'ఇందూ దేశము'** అని అంటున్నారు.

**41) ప్రశ్న :- వెంట్రుక ఆత్మకు గుర్తుగా అర్థమయినది. కానీ 'తల కొరిగించుకొనుట' అను క్రియలో తలమీద వెంట్రుకలను మాయకు గుర్తుగా, గుణముల సమూహముగా చెప్పారు. దేవునిగాయున్న సంకేతమును మాయగా ఎట్లు చెప్పెదరు?**

**జవాబు :-** వెంట్రుక ఆత్మకు గుర్తని నేను ఈ మధ్య కాలములో చెప్పాను తప్ప ఇంతకుముందు ఎవరికీ ఆ విషయము తెలియదు. **"తలలు బోడులైన తలంపులు బోడులవునా"**యని వేమనయోగి తన పద్యములో చెప్పినప్పుడు కూడా వెంట్రుకలను గుణముల ఆలోచనలుగానే అనుకొని చెప్పాడు. అట్లే పూర్వము వెంకటేశ్వర గుడిముందరగానీ, మిగతా గుడుల ముందరగానీ తల వెంట్రుకలను తలలోని తలంపులుగానే (కోర్కెలుగానే) లెక్కించి అదే భావముతోనే 'మావద్ద కోర్కెలు లేవు' అని చెప్పినట్లు తలలను బోడి చేసి దేవునికి చూపెడివారు. దేవుని దర్శనములో జ్ఞానులయిన వారు అదే ఉద్దేశ్యమునే వెలిబుచ్చుచూ మ్రొక్కెడివారు. అయితే అప్పటి ఆచరణ అయిన తలలు బోడి చేసుకోవడము నేటికీయున్నా ఆనాటి భావము కూడా నేడు లేదని చెప్పవచ్చును.

**42) ప్రశ్న :- పామును మాయకు గుర్తుగా చెప్పారు. వెంట్రుకలేనిది ఒక్క పామే కాదు, ఏకకణ జీవులు, వానపాములు కూడా కలవు. అటువంటప్పుడు ఒక్కపామే మాయకు గుర్తని ఎందుకు చెప్పాలి?**

**జవాబు :–** ఏకకణ జీవులను, వానపాములను కొందరు చూచియుండరు. నేడు కూడా చాలామంది వానపాములను చూడని వారు కలరు. పాములనయితే అందరూ చూచి యుండుట చేత పామును మాయగా **ఇంజీలు** గ్రంథమందే చెప్పియున్నారు. మాయతో కూడుకొన్న మనుషులను 'సర్ప సంతానము' అని చెప్పారు. మాయ మనుషులలోని ఆధ్యాత్మికమును లేకుండా చేయును. అలాగే పాము విషము మనుషులలోని ప్రాణమును లేకుండా చేయును. అందువలన మాయకు సమానముగా పామును గుర్తించి చెప్పారు.

**43) ప్రశ్న :– పీయూష గ్రంథి (గ్రంథి రాజము) లేకుండా ఏక కణ జీవులలో ఆత్మ నివాసమెక్కడ? అలాగే వృక్షజాతిలో ఆత్మ స్థానము (కేంద్ర స్థానము) ఎక్కడ? ఆత్మ చైతన్యము ఎక్కడనుండి ప్రసారమగును? వేరు నుండా? కాండము నుండా?**

**జవాబు :–** ఏకకణ జీవిలో ఆత్మ కణమంతా యున్నది. వృక్షజాతిలో నాడీకేంద్రములుండవు. అలాగే 25 శరీర భాగములుండవు. మొదలు వరకు నరికినా చెట్టు చనిపోదు కావున దాని ఆత్మస్థానము వేర్ల భాగమందే యుండును. బహుశా వేరునుండి కాండము ప్రారంభమయిన చోట కాండము కంటే క్రింద వేరు భాగములో కేంద్ర స్థానముండును. అందువలన దానికి చైతన్యము కాండము క్రింది వేరు భాగమునుండి ప్రసారమగునని తలంచు చున్నాము.

**44) ప్రశ్న :– భగవద్గీతా శ్లోకములో "అశ్వత్థం ప్రాహు రవ్యయం" అని ఉండగా మీరేమో 'అశ్వర్థం ప్రాహు రవ్యయం" అని వివరణ వ్రాశారు?**

**జవాబు :–** సంస్కృతములో "అశ్వత్థం" అనుట వాస్తవమే. అదే తెలుగు

భాషలో "అశ్వర్థం' అనుట సరిపోవును. భాషనుబట్టి కొంత వ్యత్యాస మున్నది అని తెలియాలి.

**45) ప్రశ్న :- అనాగరికులుగా యున్న మొదటి సంతతి ప్రజలలో పెళ్ళి అనే తంతు లేకుండా, వావి వరుసలు లేకుండా సంభోగాలలో పాల్గొన్నట్లు చరిత్ర ఉంది. మరి దేవుడు ఆ సమయములో దేవుని ధర్మములు ఎందుకు తెలుపలేదు?**

**జవాబు :-** సంభోగములు, వావి వరుసలు అన్నీ ప్రపంచ సంబంధమైన వగును. అవి దేవునికి సంబంధించిన విషయములు కావు. అందువలన వాటిని గురించి ఏమీ చెప్పలేదు. దేవుని ధర్మములు ప్రపంచ జీవనమునకు సంబంధించి లేవు. దేవుని ధర్మములన్నియూ ఆధ్యాత్మిక సంబంధమైనవే యని తెలియవలెను.

**46) ప్రశ్న :- సృష్ఠి, పరిణామ సిద్ధాంత పరముగా జరిగినది యని మేము అంటాము. మీరేమో అంతా ఒకేసారి జరిగిందియని అంటున్నారు. అంతా ఒకేసారి జరిగింది అనుటకు మీ వద్ద సాక్ష్యముందా?**

**జవాబు :-** పరిణామ సిద్ధాంతము ప్రకారము సృష్ఠి తయారు కాలేదు. అంతా ఒకేమారు పుట్టినదని మేము అంటున్నాము. దానికి సంబంధించిన సాక్ష్యము కొరకు వెదక వలసిన పనిలేదు. మొదట పుట్టిన వారికి తల్లితండ్రులు లేరు. మొదట మనుషులను యవ్వన, కౌమారముల నుండి దేవుడు తయారు చేశాడు (సృష్ఠించాడు). తర్వాత తల్లితండ్రుల వలన అందరూ పుట్టడము జరిగినది. మొదట తల్లితండ్రి లేరనుటయే దేవుని సృష్ఠికి ఆధారము (సాక్ష్యము). మొదట బ్రహ్మాండము నుండి మనుషులు

నేరుగా పుట్టగా తర్వాత అండము నుండి, పిండము నుండి పుట్టారని తెలియుచున్నది.

**47) ప్రశ్న :– స్త్రీ, పురుష, నిర్ధిష్టత లేని ఏకకణ జీవులు ప్రకృతికి గుర్తుగా ఉన్నట్లా, పురుషునికి గుర్తుగా ఉన్నట్లా?**

**జవాబు :–** పురుషుడైన దేవునికి గుర్తుగాయున్నట్లు. పరమాత్మ అనగా దేవుడయినా పరమాత్మ యది యని స్త్రీలింగముగా ఒకమారు, వాడు, ఆయన అని మరొకమారు పులింగముగా పిలువబడుచున్నది. దేవుడు స్త్రీ లింగముగా పులింగముగా రెండు విధముల పిలువబడుట చేత స్త్రీలింగ, పులింగ ఏ నిర్ణయము చేయలేనివాడు దేవుడు కనుక ఏకకణ జీవులను దేవుడయిన పురుషుని గుర్తుగా చెప్పబడుచున్నది. ఏక కణ జీవులే కాకుండా కొన్ని బల్లిజాతి తొండలు కూడా ఆడ, మగ లేనివి గలవు. అవన్నీ కనిపించునట్లు కలవు.

**48) ప్రశ్న :– పెళ్ళిలో మంగళ వాయిద్యములు దేనికొరకు ఉన్నవి?**

**జవాబు :–** నాశనమునకు ముందు శబ్దము తప్పనిసరిగా ఉండును. కర్మ నాశనము చేయు చక్రము కుడిచేతిలో ధరించిన విష్ణువు, తన ఎడమ చేతిలో శంఖును ధరించాడు. చక్రము కర్మనాశనమయినది కాగా, శంఖు కర్మనాశనమునకు ముందు తెలియు జ్ఞాన శబ్దమునకు గుర్తుగా యుందని చెప్పుకొన్నాము. ఇప్పుడు పెళ్ళిలో అదే సూత్రమును అనుసరించి పెళ్ళి తంతు అంతయూ జ్ఞాన ఆచరణకు గుర్తుగా కర్మనాశనమునకు గుర్తుగా యుండుట వలన దానికి తోడు జ్ఞానమునకు గుర్తుగా మంగళ ధ్వనులను ఉంచడమైనది. జ్ఞానము శబ్దముతో కూడుకొన్నది, కావున శబ్దముతో కూడుకొన్నదని ధ్వనులను పెళ్ళివద్ద, గుడివద్ద పెట్టడమైనది.

**49) ప్రశ్న :- నేల వెంపలి చెట్టు పరచితే దానిమీద నిలుచున్న వ్యక్తికి నక్షత్రములు కనిపిస్తాయన్నారు. నేల వెంపలి చెట్టులో ఏ పదార్థము కనులకు చీకటిని కల్పించుచున్నది?**

**జవాబు :-** ఆ విషయము లోతుగా నాకు తెలియదు. అదియునూగాక పూర్వము చేయుచున్న పద్ధతియని వినడము తప్ప నా స్వ అనుభవము కూడా లేదు. నేలవెంపలి అను పేరును కొన్ని వైద్య గ్రంథాలలో చూడడము తప్ప ప్రత్యక్షముగా చూడలేదు. అది ఎట్లున్నదో కూడా తెలియదు. పూర్వము జరిగెడిదని పెద్దలు చెప్పగా వినిన విషయమును మీకు అందించాను తప్ప దానిలో ఏ పదార్థము అలా చీకటి చేయుచున్నదో తెలియదు.

**50) ప్రశ్న :- సూర్యుడు నక్షత్రమా? గ్రహమా? నక్షత్రమని సైన్సు చెప్పుతుంటే జ్యోతిష్యులు గ్రహమంటారు. సైన్సు ప్రపంచమంతా అది నక్షత్రమని నిరూపించినా కొందరు సూర్యున్ని గ్రహమే అంటున్నారు. దానికి గల కారణమేమి?**

**జవాబు :-** సూర్యుడు నక్షత్రము అనుటకు నావద్ద ఏ ఆధారము లేదుగానీ, గ్రహము అనుటకు ఆధారము గలదు. నక్షత్రము మోక్షమునకు గుర్తు. అవి దేవునికి గుర్తుగాయున్న నక్షత్రములలో జీవము ఉండదు. గ్రహములుగా యున్న వాటిలో జీవము గలదు. సూర్యునిలో జీవము గలదు కావున సూర్యున్ని గ్రహము అనుచున్నాము. సూర్యుడు ఆకాశము చెప్పిన శబ్దముల లోని జ్ఞానమును గ్రహించి తిరిగి భూమిమీద మనుషులకు చెప్పాడు. సూర్యుడు జ్ఞానమును గ్రహించు శక్తి గలవాడయిన దానివలన సూర్యున్ని గ్రహము అని అంటున్నాము. ఒకవేళ సూర్యుడు నక్షత్రమే అయివుంటే ఆకాశశబ్ద జ్ఞానమును గ్రహించలేక దేవునివలె స్థబ్దతగా యుండునదని

చెప్పవచ్చును. నక్షత్రము నాశనము చేయగలదుగానీ, జ్ఞానమును గ్రహించ లేదు. గ్రహించు స్థోమత సూర్యునికి ఉండడము వలన సూర్యున్ని గ్రహము గానే మన తత్త్వవేత్తలు చెప్పుచున్నారు. ఈనాడు సైన్సు ఏ సూత్రమును ఆధారము చేసుకొని సూర్యుడు నక్షత్రమని చెప్పినదో నాకు తెలియదు.

**51) ప్రశ్న :- మంత్రరహితముగా, శాస్త్రబద్ధముగా జరిగిన పెళ్ళి తరువాత వారి ప్రారబ్ధములో పెళ్ళికూతురు చనిపోయే కర్మో, ఇద్దరు చనిపోయే కర్మో ఉంటే, ఆ కార్యము (చనిపోవటము) ఆగిపోతుందా? అర్థము తెలియక చేసిన పెళ్ళి కార్యములు ప్రారబ్ధమును తప్పించలేదు. భావము తెలిసి చేసిన పెళ్ళిలో కూడా ప్రారబ్ధమును తప్పించలేమా?**

**జవాబు :-** మంత్రరహితముగా శాస్త్రబద్ధముగా జరిగిన పెళ్ళి ప్రారబ్ధమును తప్పించుట చేయలేదు. అలా చేయడము వలన ప్రారబ్ధము పోతుందని చెప్పుటకు వీలులేదు. భావముతో కూడిన పెళ్ళిని భావము తెలిపి చేయుట వలన పెళ్ళి చేసుకొనువారు వారి జీవితములో జ్ఞానమును తెలిసి జ్ఞాన జీవితమును గడుపవలెననీ, అజ్ఞాన జీవితమును గడుపకూడదను ఉద్దేశ్యముతో భావమును చెప్పి చేయుచున్నారు తప్ప, కర్మలు పోవునను ఉద్దేశ్యముతో చేయలేదు. మరణములు ముందే నిర్ణయించబడియుండును. వాటిని ఎవరూ మార్చలేరు. దంపతులు జ్ఞాన జీవితమును గడిపితే వచ్చిన జ్ఞానశక్తి ద్వారా వారు అనుభవించే కర్మనుండి కొంత తప్పించుకొనుటకు వీలుకలదు గానీ, మరణమునుండి తప్పించుకొనుటకు వీలుపడదు. పెళ్ళి జ్ఞాన జీవితము గడుపుటకు తెలియజేయు వేదికేగానీ మంత్రరహితముగా చేయు పెళ్ళిలో కర్మ పోతుందనిగానీ, మరణము తప్పిపోతుందనిగానీ ఎక్కడా చెప్పలేదు.

**52) ప్రశ్న :- వినాయక విగ్రహాలు పాలు త్రాగడము ఎంత విడ్డూరమో అలాగే బ్రహ్మముగారి విగ్రహము కళ్ళనుండి నీరు కారటము అంతే విడ్డూర మగును. వాస్తవముగా భారతీయులను సెంటిమెంటల్ ఫూల్స్ అంటాను. మీరేమంటారు?**

**జవాబు :-** వినాయక విగ్రహాలు పాలు త్రాగడము ఆశ్చర్యమేమీ కాదు. ఆరిపోయిన ప్రతిమ తడిని పీల్చుకోవడము వలన వినాయకుడు పాలు త్రాగాడని అందరూ అనుకొనియుండవచ్చును. చెంబు నీళ్ళను బండమీద పోస్తే కొద్దిసేపటికి నీళ్ళు బండమీద లేకుండా పోవుచున్నవి. అప్పుడు నీటిని బండ త్రాగిందని అంటామా! లేక గాలి త్రాగిందని అంటామా! ఉన్న నీరు లేకుండా పోవుట సులభముగానీ, లేని నీరు బండమీదికి రావడము జరుగదు. అలాగే ఉన్న పాలను గానీ నీరునుగానీ ఆరిపోయివున్న విగ్రహము తేమను పీల్చుకొనుట వలన విగ్రహము నీరు త్రాగిందని అంటున్నాము. వినాయకుడుగానీ, మరి ఏ విగ్రహమయినాగానీ నీరును గ్రహించవచ్చును కానీ నీటిని విడుదల చేయలేదు. నీరును విడుదల చేయుటకు ప్రతిమలో ముందే నీరుండవలెను. అందువలన యోచించు వారికి వినాయకుడు పాలను త్రాగడము విచిత్రముగాదు. అయితే ఆరిపోయిన రాతి ప్రతిమనుండి అనగా బ్రహ్మముగారి విగ్రహమునుండి ఒక కంటిలోనే నీరు కారడము విచిత్రమేయగును. వినాయకుడు పాలు త్రాగడమును, బ్రహ్మము గారి ప్రతిమకు కన్నీరు రావడమును ఒకే విధముగా పోల్చకూడదు. రెండింటిలోనూ ఎంతో వైవిధ్యము కలదు. వినాయకుడు పాలు త్రాగడము ఎక్కడయినా జరుగవచ్చును, ఎవరయినా త్రాపవచ్చును. బ్రహ్మముగారి ప్రతిమనుండి కుడికంటిలో నీరు కారడము నేను స్వయముగా చూచాను. అక్కడ అజ్ఞానము పనికి రాదు. కేవలము జ్ఞానము మాత్రము

పనికి వచ్చును. బ్రహ్మాముగారి కుడికంటిలో నీరు కారుటకు గల కారణము జ్ఞానము వలన తెలియనగును.

**53) ప్రశ్న :- మీ గ్రంథము చర్మమునకు బాధయున్న చోట అంటుకొన్నట్లు చెప్పుకొంటున్నారు. బాధలేకపోయినా మీ గ్రంథములు చర్మమునకు అతుక్కోవడము జరుగుచున్నది. దానికి మీ సమాధానము ఏమిటి? మీ గ్రంథములే కాకుండా వేరే గ్రంథములు కూడా అలా కరచుకొనుటను గమనించాము. ఆ గ్రంథములు సైన్సు పుస్తకాలు. మరి అవి ఎందుకు కరచుకొన్నట్లు వివరించగలరా?**

**జవాబు :-** మా గ్రంథములలో ఆత్మజ్ఞానము గలదు. అంతకు మించి ఏమీ లేదు. కర్మతో బాధపడు మనుషులకు మా గ్రంథములు అంటుకొని వారి కర్మలను లేకుండా చేసినట్లు కర్మలనుండి బయట పడినవారే చెప్పగా విన్నాము. మా గ్రంథములు అంటుకొనియున్నది ప్రత్యక్షముగా చూడకున్నా, కొన్ని ఫోటోలలో చూచాను. గ్రంథముల మీద విశ్వాసమున్న వారికి అతుక్కోవచ్చు అని అనుకొన్నాము. కాలము జరుగగా చాలాచోట్ల చాలామందికి గ్రంథములు అతుక్కొని క్యాన్సర్, ఎయిడ్స్ మొదలగు దీర్ఘ కాల రోగములను కూడా లేకుండా చేసినట్లు విన్నాము. మా అంచనా ప్రకారము గ్రంథములలో ప్రత్యేకించి ఆత్మ విధానము, ఆత్మజ్ఞానము ఉండుట వలన నమ్మకము గల జీవాత్మల శరీరములలోని ఆత్మ తన జ్ఞాన గ్రంథములను ఆకర్షించుకొని గ్రంథములోని ఆత్మజ్ఞానము వలన కర్మ కాలిపోవునట్లు చేయుచున్నదని అనుకొన్నాము. గ్రంథములు మనిషిని అంటుకోలేదనీ మనిషిలోని ఆత్మే గ్రంథములను ఆకర్షించుకొంటున్నదని ఇదంతయూ ఆత్మ చేయు పనేయని అనుకొంటున్నాము. ఇతర గ్రంథము

లను పెట్టుకొన్నా, అతుక్కోలేదని చాలామంది చెప్పారు. ఇప్పుడు మీరు బాధ లేకున్నా గ్రంథములు అతుక్కున్నాయని అన్నారు. అది జరిగి యుండ వచ్చును. బాధలు తెలియకున్నా కర్మలు లోపలయుండుట వలన గ్రంథములు అతుక్కొని యుండవచ్చును. ఇప్పుడు మీరు సైన్సు గ్రంథములు కూడా అతుక్కున్నాయి అన్నారు. ఆ విషయము మాకు తెలియదు. అతుక్కొని కర్మను పోగొట్టాయా లేదాయని చెప్పలేదు. కొందరిని దేవుడే తప్పు మార్గములో పంపునని దైవగ్రంథములో వ్రాసియుండుట చూచియున్నాను. దేవుని మీద శ్రద్ధయున్న వారిని దైవమార్గములో పంపుదుననీ, శ్రద్ధలేని వారిని అపమార్గములో పంపుదుననీ తెలిపియున్నాడు. అందువలన కొందరిని తప్పు మార్గములో పంపుటకు ఆ విధముగా ఆత్మే చేసి యుండ వచ్చును. ఏది ఏమయినా మేము ప్రత్యక్షముగా సైన్సుకు సంబంధించిన గ్రంథములు అతుక్కున్నప్పుడు చూడగల్గితే వెనుకయున్న సత్యమును చెప్పగలను.

**54) ప్రశ్న :- "కథల జ్ఞానము" అను గ్రంథములో దయ్యాల కోన ప్రాంతము దేశములో ఎక్కడున్నది? ఇప్పటికీ అది వుందా? కల్పితమా?**

**జవాబు :-** ఆ గ్రంథములో ఆ పేరు కల్పితమే కానీ ఉప్పలపాడు కోన అనునది ఉన్నది వాస్తవమే. ఆ గ్రంథములో ఒక మహర్షి చెట్టు దిగివచ్చి కోన నీటిలో స్నానము చేసి మర్రిచెట్టు క్రింద గుడిముందర తపస్సు చేసేవాడు అని వ్రాశాము కదా! అదే ఉప్పలపాడు కోన. అయితే వాస్తవ విషయములనే కల్పిత కథలతో చెప్పడమైనది. దయ్యాలకోన యనునది గ్రంథములో చెప్పిన విధముగా ఎక్కడా లేదు. అయినా కథలలో చెప్పినవన్నీ వాస్తవమే యని తెలియవలెను.

**55) ప్రశ్న :- కథల జ్ఞానములోని భేతాళుని కథలో ఉన్న మూడు ప్రశ్నలకు సమాధానము ఎంత యోచించినా జవాబులు అందటము లేదు. ఏవో సమాధానములు వచ్చినా వాస్తవము కాదేమో అనిపిస్తుంది. కనుక దయచేసి ఆ కథ వివరమును ప్రశ్నలకు జవాబులను చెప్ప ప్రార్థన?**

**జవాబు :-** మీలో అనగా చదువుచున్న వారిలో చురుకుదనము తెప్పించుటకు ఆ కథను చెప్పాము గానీ, అందులో వాస్తవముగా జవాబులు ఉండవు. ఆలోచించినా జవాబులు దొరకకూడదనే ఉద్దేశ్యముతోనే వ్రాశాము.

**56) ప్రశ్న :- ఎనిమిది అడుగుల విగ్రహములో ఆ విగ్రహమంతా ఆవహించి ఆ దేవత ఆత్మయుండునా? ఒకవేళ అన్ని అడుగులుగా ఉన్న దేవతలు విగ్రహమునుండి బయటికి వచ్చి సంచరిస్తే దానిని చూడగలిగే వారికి అంత ఎత్తులోనే (పొడవుగా) కనిపించునా?**

**జవాబు :-** విగ్రహము ఎంత ఎత్తు ఉండునో అంత ఎత్తు సూక్ష్మములు కనిపించుట వింతేమీ కాదు. విగ్రహములు లేని సూక్ష్మములు కొండ ఎత్తు, పర్వతము ఎత్తు కనిపించిన సంఘటనలు గలవు. దానిని బట్టి చూస్తే ఎనిమిదడుగుల సూక్ష్మము కనిపించుట వింతకాదు.

**57) ప్రశ్న :- మీరు ఇన్ని క్రొత్త విషయములు ఏ గ్రంథములో చూచి చెప్పుచున్నారు?**

**జవాబు :-** గ్రంథములు చదివే అలవాటు నాకులేదు. నేను ఏ గ్రంథములో చూడలేదు. నాలోని ఆత్మ తెలిపితే నేను మీకు మధ్యవర్తిలాగ తెలుపు చున్నాను. అంతతప్ప నేను స్వయముగా చెప్పిన క్రొత్త విషయములు ఏమీ లేవు. ఏమి చెప్పినా నా ఆత్మ చెప్పవలసిందే.

**58) ప్రశ్న :- ఒకడు దొంగతనము చేస్తున్నప్పుడు ఏ భావముతో చేస్తున్నాడో, ఆ భావమునకు తగిన కర్మ వస్తుంది కదా! నేను చేస్తున్నది పాపకర్మ అనుకోకుండా, ఏ పని దొరకక కరువు వలన ఒక ధనికుని ఇంటిలో దొంగిలించి తింటే తప్పేమిటి? అని "రాబిన్‌హుడ్"ను అనుసరిస్తే వారికి పాపము రాకూడదు కదా! ఇంతకీ పాపపు పనులు ఇవియని లిస్టు ఉందా? ఉంటే ఎక్కడ ఉంది. మంచి ఆడిటర్‌తో ఆడిట్ చేయిస్తాము.**

**జవాబు :-** అటువంటి లిస్టు ఏదీ లేదు. ఇవి చెడు పనులని దేవుడు చెప్పలేదు కదా! మనిషి చేసే పని ద్వారా పాపము రాలేదు. అతడు అహము ద్వారా "నేనే ఈ పనిని చేయుచున్నాను" అని అనుకోవడము వలన జరిగిన పనిలో పాప పుణ్యములు ఏర్పడుచున్నవి. అంతతప్ప దేవుని దృష్టిలో మంచి చెడు కార్యములు లేవు.

**59) ప్రశ్న :- వ్యభిచారము చేసేవాడి భావములో నేను పాపము చేస్తున్నాను అనే భావము ఉండదు కదా! 'నేను ఆనందించుచున్నాను' అనే భావనేయుంటే పాపము అనే కర్మ ఎట్లు తగులుతుంది? ఎందుకంటే పనికంటే పనిలోయున్న భావమే ముఖ్యము కదా! "మోహపు చూపుతో ఒక స్త్రీని చూచిన వ్యభిచరించి నట్లే కదా!" అని ప్రభువు అన్నారు. పని లేకుండా పనిలోయున్న భావమే కదా! ముఖ్యము. పై పనులలో జీవుని భావనలు 'ఆనందిస్తున్నాను' అనే కదా! మరి పాపము అనేది మధ్యలో ఎక్కడి నుండి మొలిచింది?**

**జవాబు :-** "నేను ఆనందించుచున్నాను" అనేదానికంటే ముందు ఆనందము పని చేస్తేనే వచ్చినదని వానికి తెలుసు. పనిని నేను చేస్తున్నానని ఇతరులతో చెప్పకున్నా ఆనందము పొందే కార్యము చేయుటకు ముందు కొంత ప్రయత్నించి కార్యము చేయుటకు మొదలు పెట్టును. అప్పుడు కొంత

బుద్ధిని, కొంత మనస్సును, కొంత కర్మేంద్రియముల పనిని చేయవలసి వచ్చును. అప్పుడు ఆ పనిని తాను చేయుచున్నానను భావము అందరిలో అంటుకొని యుండును. ఎప్పుడు బుద్ధి పని చేయునో అప్పుడు అహము పనిచేయును. అహము నా చేతులు పని చేస్తున్నాయను ధ్యాసతోనే చేయును. అహము అనునది జరిగెడి ప్రతి పనిలోనూ భాగమైయుండుట వలన కార్యము చేయగా సుఖమును అనుభవించానను భావముండును. సుఖము గాలిలో వచ్చి అతనిని చేరలేదు. అలా వచ్చి చేరేదే అయితే అక్కడ కార్యము లేదు, అహము లేదు. అప్పుడు పాపము లేదు. వ్యభిచారము చేయుట అనేది కార్యముతో కూడుకొన్నదే కదా! చిన్న కార్యముతో కూడుకొన్నదయినా వాడు నూరు శాతము **'నేను'** అనే భావముతోనే చేయుచున్నాడు. 'నేను' అనే భావముతోనే అనుభవించుచున్నాడు. ఒకవేళ ఎవడయినా కర్మయోగ పద్ధతి తెలిసి కార్యము చేయగలిగితే అనుభవము జీవుడు పొందినా కర్మను జీవుడు పొందడు. అట్లుకాకుండా చేయువానికి కర్మ తప్పక అంటును. కర్మను కాల్చుతూ కర్మయోగమను దానిని యజ్ఞముగా ఆచరించుచూ చేయుట వలన యజ్ఞములో కర్మ దహించి వేయబడుచున్నది. ఈ విషయమై భగవద్గీత కర్మయోగములో తొమ్మిదవ శ్లోకమున ఇట్లు చెప్పారు చూడండి...

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణో న్యత్ర లోకోయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ! ముక్త సంగస్సమాచర ॥

భావము :- **"యజ్ఞ సంబంధమైన కర్మను ఆచరించుటకంటే ఇతరముగా చేయుట వలన కర్మము అంటుకొనును. కార్య ఫలమునందు ధ్యాసను వదలి కార్యములు చేయుట యజ్ఞ కర్మయగును. అనగా కర్మ కాలిపోవును. లేకపోతే**

**కర్మ బంధనములు కల్గుచుండును."** అని చెప్పబడడమైనది. అగ్నికి ధూమము అంటుకొని యుండునట్లు ప్రతి కార్యమునకు అహము అను దానివలన కర్మ అంటుకొనియుండును. దానిని యజ్ఞ సంబంధముగా అనగా కర్మను దహించి లేక కర్మను అంటని విధముగా కార్యమును చేయుము అని చెప్పారు. అట్లు కాకుండా సుఖము మీద ఆశతో పనిచేస్తే ఆసక్తిగా చేయు కార్యమే కర్మగా మారుచున్నది. ప్రతి కార్యమునకు కర్మయుండడము సహజము. అయితే కొందరు యజ్ఞ పద్ధతిలో (కర్మయోగ పద్ధతిలో) పొందకుండా యున్నారు.

**60) ప్రశ్న :- బాహ్య యజ్ఞములు చేస్తే తప్పేమిటి?**

**జవాబు :-** బాహ్య యజ్ఞములు అంతర్ యజ్ఞములకు నమూనాలు. అయితే అంతర్ యజ్ఞములయిన ద్రవ్య, జ్ఞాన అను రెండు యజ్ఞములలో ద్రవ్య యజ్ఞమును అందరూ చేయుచున్నారు గానీ, జ్ఞానయజ్ఞమును ఎవరూ చేయడము లేదు. జ్ఞాన యజ్ఞమును చేయగల్గిననాడు ఎవడయినా కర్మలనుండి బయటపడును. అట్లు కాకుండా సుఖము మీదే ధ్యాసతో చేయుట వలన ఆ చేసినదే పాపముగా మారును. ఈ విషయము తెలియుటకు కన్ను చూస్తుంది, చెవు వింటూయుంది అని తెలిసినట్లు అంతరేంద్రియములయిన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము యొక్క పని తెలియగల్గినప్పుడు యజ్ఞముల విలువ తెలియును. అప్పుడు బాహ్య యజ్ఞములు నాలుగు అధర్మములలో ఒక అధర్మమని తెలియుచున్నది. బాహ్యయజ్ఞములు చేస్తే తప్పులేదు గానీ అధర్మమును ఆచరించినట్లగును.

**61) ప్రశ్న :- ఈ మధ్య కనిపించకుండా పోయిన (MH-370) కానీ, (N-32) విమానముగానీ కనిపించకుండా పోయిన విధానములో బెర్ముడా ట్రయాంగిల్‌లో ఉన్న శక్తి ప్రమేయమే అంటారా?**

**జవాబు :-** అవి కనిపించకుండా పోయిన రోజే నాకు ఏమి తెలియకనే దీనికి కారణము బెర్ముడా ట్రయాంగిల్ శక్తియని చెప్పడమైనది. ఎటువంటి ఆధారము లేకుండా చెప్పిన ఆ మాటలు నిజమైనాయి. ముమ్మాటికి ఆ శక్తే కారణము అని చెప్పవచ్చును. విమానములో పోయిన వారందరూ ఒక విధముగా అదృష్టవంతులే ఖర్చు లేకుండా మరొక గ్రహములో దిగి అక్కడ దైవజ్ఞానము తెలియగల్గుట అదృష్టమనియే చెప్పవచ్చును.

**62) ప్రశ్న :- క్రీస్తు పూర్వము 1వ శతాబ్దమునుండి క్రీస్తు శకము 14, 15 శతాబ్దముల వరకు రాజులు, చక్రవర్తులు పరిపాలించారు. రాజులు, రాజ్యాలు పోయి ఇప్పటికి ఇలా వుంది. ఇప్పుడు అన్ని దేశములకు రాజ్యాంగ వ్యవస్థ వుంది. ఈ విధమైన రాజ్యాంగము తర్వాత ఎటువంటి పరిణామం రాబోతుంది? మీరేమో వేయి సంవత్సరముల అనంతరము అందరూ జ్ఞానులగుదురు అన్నారు. రాకెట్ మిసైల్ యుగములో ఇంకా నాగరికత అభివృద్ధి చెందుతున్న భవిష్యత్ కాలములో జ్ఞానమును ప్రజలు పట్టించు కుంటారా?**

**జవాబు :-** ఏ యుగములో అయినా, ఏ కాలములో అయినా జ్ఞానము అజ్ఞానము రెండూ ఉంటాయి. భూమిమీద నాగరికత కాలములోగానీ, అనాగరికత కాలములోగానీ, జ్ఞానమునుండి అజ్ఞానమువైపు మనుషులు పోవుచుందురు. జ్ఞానమునుండి అజ్ఞానము వైపు మారుచూరాగా ఉన్న ప్రజలలో రెండు శాతము జ్ఞానము వరకు చూస్తున్న దేవుడు అప్పుడు ధర్మములకు ముప్పు ఏర్పడినదని ధర్మప్రతిష్టాపనకు పూనుకొనును. దేవుడు భగవంతునిగా వచ్చి ధర్మ ప్రచారమునకు పూనుకొనునప్పటికి భూమిమీద ఒక శాతము జ్ఞానము మిగిలియుండును. భగవంతుడు తిరిగి ధర్మములను నెలకొల్పి, ధర్మములను తెలియజెప్పి వచ్చిన దారినే పోవును. భగవంతుడు

చెప్పిన జ్ఞానము ప్రజలలోనికి పోయే దానికి కొన్ని వందల సంవత్సరములు పట్టును. అప్పుడు ధర్మములు ఒక శాతమునుండి అర్థ శాతమునకు తగ్గి పోవును. భగవంతుని జ్ఞానము ప్రజలలోనికి పోయి ప్రజలకు తెలియుటకు మొదలు పెట్టిన తర్వాత ధర్మములకు బలము చేకూరి అలా కొంత కాలమునకు అనగా వేల సంవత్సరములకు 90 శాతము ధర్మములు పెరిగి అధర్మములు క్షీణించి పోవును. అయినా అప్పటికీ పది శాతము అధర్మములు మిగిలియుండి తర్వాత క్రమేపీ అవి పదిశాతము నుండి తిరిగి తమ బలమును పెంచుకొనుచూ వచ్చును. అట్లు తిరిగి కాలము జరుగు కొలది అధర్మములు పెరుగుతూ వచ్చి ఒక యుగము కాలమునకు అనగా కొన్ని వేల సంవత్సరములకు తిరిగి అజ్ఞానము ప్రజలలో నిండిపోయి అధర్మముల శాతము 90 వరకు పెరిగిపోవును. అట్లే రెండు శాతమునకు దిగి పోయినప్పుడు తిరిగి భగవంతుడు రావలసియున్నది. భగవంతుడు వచ్చి మొదటివలె ధర్మములను బోధించిపోవును. బోధించిన ధర్మములు కొంత కాలమునకు ప్రజలలోనికి ప్రాకడము అధర్మములు 90 శాతము పెరగడము జరుగుచుండును. ఇదే విధముగా ధర్మాధర్మముల స్థితి భూమిమీద ఉండును. అప్పుడప్పుడు భగవంతుని రాకయుండును. ఇదంతయూ ఒక గొలుసువలె జరుగుచుండును. ఏ కాలములో నయినా ధర్మములకు ముప్పు కల్గును. ఏ కాలములో అయినా ధర్మముల ప్రతిష్ఠాపన జరుగును. ఇదంతయూ బండిచక్రము తిరుగుచున్నట్లు జరుగుచుండును. ఎంత నాగరికత కాలములో అయినా ధర్మములు లేకపోతే భగవంతుని ద్వారా తిరిగి తెలియబడును.

**63) ప్రశ్న :- ఈ విశ్వములో భూమిలాంటి వేరే గ్రహము ఉండి వుంటే అక్కడి ప్రజలకు జ్ఞానాన్ని బోధించేందుకు భగవంతుడు వచ్చునా? అక్కడ కూడా భగవంతుని రాక మూడుమార్లు యుండునా?**

**జవాబు :–** భగవంతుని రాక, భగవంతుడు ధర్మములను బోధించుట భూమిమీద మాత్రమే జరుగుచుండును. వేరే గ్రహములో పరిస్థితి వేరుగా యుండును. అక్కడ కాలక్రమములో అజ్ఞానము పెరుగదు. ఎప్పటికీ జ్ఞానము ఒకే విధముగా ఉండును. భూమిమీద భగవంతుని వలననే జ్ఞానము తెలియబడుచుండును. ఇతర గ్రహములలో గురువు వలన జ్ఞానము బోధించబడుచుండును. అక్కడున్న వారందరూ జ్ఞానులుగానే యుందురు. అందువలన వారికి గురువు అవసరము లేదు. గురువులకు బోధించు పని ఉండవలెనని భూమినుండి కొంతమంది మనుషులను ఇతర గ్రహములలోనికి చేర్చుట వలన అక్కడ వారికి జ్ఞానమును బోధించెదరు. గురువులుగా యున్నవారు ఆ గ్రహము మీద అజ్ఞానులను జ్ఞానులుగా మార్చు చుందురు. అయితే అక్కడ భగవంతుని రాక యుండదు.

**64) ప్రశ్న :– కృష్ణుడు విశ్వరూపాన్ని అర్జుననకు చూపించినట్లు, ఏసు ప్రభువు కూడా తన జీవితములో విశ్వరూపాన్ని చూపించెనా? మూడవమారు వచ్చే భగవంతుడు కూడా తన విశ్వరూపాన్ని చూపించే సన్నివేశము ఉండునా?**

**జవాబు :–** విశ్వరూపము గారడి విద్య ప్రదర్శనలాంటిది కాదు. "దేవుడు విశ్వరూపుడు" అని తెలియజేయు నిమిత్తము ఒకమారు కృష్ణుడు అర్జుననకు విశ్వరూపము చూపడము జరిగినది. తర్వాత రెండవమారు విశ్వరూపము చూపబడలేదు. తర్వాత కాలములో ఎప్పుడుగానీ విశ్వరూప ప్రదర్శన యుండదు. విశ్వరూపము సాక్ష్యము కొరకు చూపినదేగానీ తర్వాత రెండవ మారు చూపునది కాదు.

**65) ప్రశ్న :– కొన్ని వృక్షములలో ఉన్న జీవాత్మలు కొన్ని వేల సంవత్సరములు**

**జీవించుచుందురు. అనగా నాలుగువేలు, ఐదువేల సంవత్సరములు జీవించుచుండును. అట్లే చెట్లలో ఉండే జీవాత్మలవలె జంతువులలో, మనుష్యులలో ఎందుకు ఎక్కువ ఆయుస్సు ఉండలేదు?**

**జవాబు :-** జంతువులు, మనుషులు మాంసముతో కూడుకొన్న శరీరములు గలవారుగా యున్నారు. అందువలన వారి శరీరములు వాతావరణ మార్పులకు, శీతోష్ణమునకు తొందరగా శిథిలావస్థకు వస్తున్నవి. అందువలన మనుషులు, జంతువులు తొందరగా చనిపోవడము జరుగుచున్నది. మనుషులు, జంతువులు స్థూలముగా ఎక్కువ కాలము బ్రతకడము లేదు. చనిపోయిన మనుషులు, జంతువులు సూక్ష్మముగా ఎక్కువ కాలము బ్రతుకు చున్నవి. వృక్షమునకు సూక్ష్మశరీరముతో బ్రతికే సదుపాయము లేదు. ఎంత కాలమయినా వృక్షములు స్థూలముగా బ్రతుకవలసినదే. మనుషులు జంతువులు చాలావరకు స్థూలముగా తక్కువ కాలము బ్రతుకుచున్నవి. సూక్ష్మముగా ఎక్కువ కాలము బ్రతుకుచున్నవి. మనుషులు చాలావరకు అకాల మరణమునే పొందుచున్నారు. అరుదుగా కాల మరణమును పొందు చున్నారు. అకాల మరణము పొంది సూక్ష్మముగా బ్రతుకువారిని చాలామందితో నేను మాట్లాడడము జరిగినది. 250 సంవత్సరములుగా బ్రతికియున్న మనిషితో (సూక్ష్మ శరీరముగల మనిషితో) మాట్లాడడము జరిగినది. అప్పుడు నాకు ఆశ్చర్యము కలిగినా నేడు అది సహజమే అనుకొంటున్నాను. దాదాపు 600 సంవత్సరములు బ్రతికిన మనుషులతో మాట్లాడాను. వారిని కొన్ని ప్రశ్నలడిగి తెలుసుకొన్న విషయములలో మనుషులు రెండువేల సంవత్సరముల వారు కూడా బ్రతికేయున్నట్లు తెలిసినది. జంతువులు కూడా దాదాపు మూడు వందల సంవత్సరములు బ్రతికినవి కూడా ఉన్నట్లు తెలిసినది. స్థూలముగా 20 సంవత్సరములు

బ్రతుకు జంతువులు మూడు వందల (300) సంవత్సరములు బ్రతికియుండడము వలన స్థూలముగా తక్కువ కాలము బ్రతుకు మనుషులు కూడా సూక్ష్మముగా వేల సంవత్సరములు బ్రతుకుచున్నారని తెలియుచున్నది.

**66) ప్రశ్న :- జంతువుల కొరకు కొంత ఆయుష్షు నిర్ధిష్టత యున్నట్లు చెట్లకు నిర్ధిష్టత లేదా?**

**జవాబు :-** మనుషులకుగానీ, జంతువులకుగానీ ఆయుష్షు నిర్ధిష్టతయనునది లేనేలేదు. ఆయుష్షు నిర్ధిష్టత కర్మప్రకారము ఎంతయున్నదో ఎవరికీ తెలియదు. స్థూలముగా బ్రతుకుచున్న ఆయష్షునుబట్టి చెప్పుటకు వీలు పడదు. మనిషికిగానీ, జంతువుకుగానీ 12 గ్రహముల దశలు ఒకమారు అయిపోవుటకు 120 సంవత్సరములు పట్టును. దానిని మనుషుల ఆయుష్షని కొందరనుకోవడము జరుగుచున్నది. కృష్ణుడు 126 సంవత్సరములు బ్రతికినట్లు గలదు. వ్యాసుడు స్థూలముగానే 380 సంవత్సరములు బ్రతికినట్లు చెప్పుచున్నారు. విక్రమార్కుడు రెండువేల సంవత్సరములు బ్రతికినట్లు చరిత్రగలదు. అందువలన మనిషి యొక్క నిర్ధిష్ట ఆయుష్షుగానీ, జంతువుల యొక్క నిర్ధిష్ట ఆయుష్షుగానీ ఇంతయని ఎవరూ చెప్పలేరు.

**67) పంట పొలాలలో ఉండే పైరును (వరి లేదా గోధుమ) కొడవలితో కోసినప్పుడు వాటిలోయుండే ఆత్మను మన రైతు శరీరములో యుండే చైతన్యముతోనే కోసివేస్తే అది హత్యయగును కదా! అప్పుడు పైరులో యుండే జీవాత్మల మరణము అకాల మరణమగునా? లేక కాలమరణ మగునా?**

**జవాబు :-** మొక్కల జీవాత్మ వేరునందుండుట వలన మొక్కలు చనిపోవు.

కోసిన తర్వాత రెండు, మూడు దినములకు మొక్క చనిపోవును. అప్పుడు కాలమరణమును పొందుచున్నది.

**68) ప్రశ్న :- స్థూలముగా మన కడుపు నిండినంత ఆహారమును తీసుకొంటే ఆకలి తీరిపోవును. కడుపు నిండిపోవును. అయితే దేవతలకు ఒకే రోజు వేల గొర్రెలు, మేకలు కొళ్లను బలి ఇస్తే సూక్ష్మముగా దేవతలు గ్రహించును కదా! విగ్రహాలలో ఉండే దేవతలకు అంతపెద్ద మొత్తములో వుండే ఆహారము సూక్ష్మముగా అయినా కడుపులో పట్టునా?**

**జవాబు :-** సూక్ష్మముగా ఉండే దేవతలు వేల గొర్రెలను, మేకలను, కోళ్ళను ఒకేమారు ఆహారముగా తీసుకోవు. వాటి కడుపులో పట్టినంతమాత్రమే తినగలవు. మిగతా వాటిని తీసుకోవు. బయట స్థూలముగా ఎంత ఆహారమున్నా తమకు అవసరమైనంత ఆహారమును మాత్రము తీసుకొనగలవు. అంతటిని తీసుకోవు.

**69) ప్రశ్న :- కాలజ్ఞానములో వీరబ్రహ్మముగారు చెప్పిన 'ప్రబోధాశ్రమము' మీదేయని సాక్ష్యమేమిటి? ప్రబోధాశ్రమము భవిష్యత్తులో రావచ్చును కదా! మీ గ్రంథములో మీదే ప్రబోధాశ్రమమని ఉన్నట్లు తెలిసినది. అందువలన అడుగుచున్నాము.**

**జవాబు :-** బ్రహ్మముగారు బ్రతికియున్నప్పుడు ఆయనకు రహస్య గురువు ఉండేవాడు. తన గురువు ఆజ్ఞప్రకారము బ్రహ్మముగారు జీవ సమాధి చెందియుండెను. గురువు గారు తన సమాధి దగ్గరకు వచ్చి చూచినప్పుడు బ్రహ్మముగారు సమాధినుండి బయటికి వచ్చి జన్మ తీసుకోవలెనని గురువు ఆజ్ఞ కలదు. ఆ ఒప్పందము బ్రహ్మముగారు పది జన్మల క్రిందటే పొంది యున్నాడు. పది జన్మల క్రిందట తన గురువుగారు చెప్పిన మాటను

బ్రహ్మముగారు పాటించి జీవసమాధిలోనికి పోవడము. ఆయన గురువుగారు తన సమాధి వద్దకు వచ్చినప్పుడు బ్రహ్మముగారు శరీరమును వదలి బయటికి వచ్చి జన్మను తీసుకోవడము జరిగినది. ప్రస్తుతము బ్రహ్మముగారు 36 సంవత్సరముల వయస్సులో యున్నా నేను గతములో బ్రహ్మముగారినను జ్ఞాపకము కలుగలేదు. ఆయనకు జ్ఞాపకము వచ్చినప్పుడు కొంత సాక్ష్యమును తెలియజేయగలడు.

**70) ప్రశ్న :- అర్జునా! శరీరము నశ్వరము, క్షణ భంగురము. నీ సామర్థ్యమునకు హస్తినాపురము క్షణ కాలములో మట్టిలో కలిసిపోగలదు. ప్రపంచ విషయములు తుచ్ఛమైనవి. యుద్ధము చేయకపోతే క్షత్రియుడు యుద్ధభూమిని వదలిపోయాడని లోకులు నవ్వేదరు. అయితే ఎవరు నిజమైన జ్ఞానులో వారు నిందలకు ప్రశంసలకు చలించరు. "తుల్య నిందా స్థుతిర్మౌనీ సంతుష్టోయేన కేనచిత్" అను శ్లోకాన్ని నీవు ఏమి గ్రహించావు. హిమాలయములకు వెళ్ళి, బ్రహ్మయోగము చేసుకో అని కృష్ణుడు బోధించక, యుద్ధానికి పురిగొల్పాడు. ఇంత జరిగినా గీతలో అహింస, వైరాగ్యము ఉందంటారు. దీనిని సక్రమ బుద్ధి అనాలా? వక్రబుద్ధి అనాలా? మీరే చెప్పండి.**

**జవాబు :-** భగవద్గీతలో చెప్పిన జ్ఞానము రెండు విభాగములుగా యున్నది. పది అధ్యాయముల వరకు రెండు యోగముల జ్ఞానమును కృష్ణుడు చెప్పాడు. ఒకటి బ్రహ్మయోగము, రెండు కర్మయోగ జ్ఞానము. భక్తియోగ జ్ఞానములో మీరు చెప్పిన స్థుతియు నిందయు సమముగా చూడడము కలదు. ఈ విషయము భక్తియోగము అను అధ్యాయములో 19వ శ్లోకమున చెప్పి యున్నారు. రెండవదయిన కర్మయోగములో బయటి విషయములను సమానముగా చూడక నిందకు స్పందించి యుద్ధము చేసినా కర్మయోగ

పద్ధతిలో చేయమని చెప్పాడు. కర్మయోగములో అన్ని కార్యములను గుణముల ప్రకారము కర్మ అంటని విధానముగా చేయవలెనని చెప్పాడు. రెండు యోగములను వేరుగా అర్థము చేసుకోనివారు అక్కడ నిందను చూచి మౌనముగా యుండమని చెప్పి, ఇక్కడ నిందను చూచి యుద్ధము చేయమన్నారేమిటి? యని ప్రశ్న రాగలదు. బ్రహ్మయోగములో మౌనముగా ఉండడము సక్రమ బుద్ధే. అట్లే కర్మ యోగములో యుద్ధము చేయడము సక్రమ బుద్ధేయని చెప్పవచ్చును. అక్కడ సందర్భమునుబట్టి, యోగమునుబట్టి నడువకపోతే అట్టివారిదే సక్రమ బుద్ధి కాదు.

**71) ప్రశ్న :- దుఃఖములలో ఏడవకుండా, సుఖములలో పొంగిపోకుండా, రాగ, భయ, కోపరహితుడై యుండే వాడే స్థిత ప్రజ్ఞుడని చెప్పిన కృష్ణుడు యుద్ధములో భీష్ముని మీద కోపముతో బండిచక్రమును పట్టుకొని కొట్టుటకు బయలుదేరితే అతను భయ కోపరహితుడగునా? "చెప్పేవి శ్రీరంగ నీతులు దూరేది దొమ్మర గుడిసెలు" అను సామెతలాగ ఉంది. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** కృష్ణుడు స్థితప్రజ్ఞునకు చెప్పిన విధానము ప్రకారము ప్రపంచ సంబంధ ఏ ధ్యాసలు లేనివాడు స్థితప్రజ్ఞుడు. స్థిత ప్రజ్ఞుడు బ్రహ్మయోగ విధానములో ఉండవలసిన పద్ధతియది. అయితే కృష్ణుడు తాను కర్మయోగమును అనుసరిస్తున్నానని ముందే చెప్పాడు. కర్మయోగములో ఏ సమయములో ఎట్లు ప్రవర్తించవలెనో అట్లే ప్రవర్తించవలసియుండును. యుద్ధరంగములో కత్తిపట్టి యుద్ధము చేయనని ముందే చెప్పిన కృష్ణుడు మాట తప్పి భీష్ముని మీదికి పోయాడు. కృష్ణుడు కర్మయోగి అయిన దానివలన ఆ పని చేయడము అతనికి చెల్లుతుంది. ఆయనను అర్థము చేసుకోలేనిది మనమే.

**72) ప్రశ్న :- శరీరము అశాశ్వితము అందువల్ల యుద్ధము చెయ్యి. ఆత్మకు మరణము లేదు కనుక యుద్ధము చెయ్యి. క్షత్రియుడివైనందున యుద్ధము చెయ్యి. యుద్ధము చేయకపోతే నిందలపాలగుదువు. కావున యుద్ధము చెయ్యి. ఇదే భగవద్గీతలో కనిపిస్తుంది. మరి ఇందులో జ్ఞానము ఉంది. మనోతత్వ శాస్త్రము ఉంది. పర్సనాలటీ డెవలప్‌మెంట్ ఉంది అంటారు. నన్ను అడిగితే అలా చెప్పడము గుడ్డి ఎద్దు చేలో పడినట్లున్నది.**

**జవాబు :-** వినింది అర్థము కాకపోతే అట్లేయుంటుంది. గ్రుడ్డును చేతిలో పట్టుకొని పరుగెత్తాలి. కూర్చున్నప్పుడు జోబిలో పెట్టుకోవాలని చెప్పితే అర్థము కాక గ్రుడ్డును నిక్కరు జోబిలో పెట్టుకొని పరిగెత్తి గ్రుడ్డు పగిలి పోయిందే! అంటే పరుగెత్తితే గ్రుడ్డు పగలక ఏమవుతుంది? అలాగే మీ ప్రశ్న వుంది. భగవద్గీతలో రెండు రకముల జ్ఞానము గలదు.

**73) ప్రశ్న :- క్షత్రియుడు యుద్ధము నుండి పారిపోరాదు అని చెప్పుచూ జరాసంధునితో యుద్ధము చేయలేక ద్వారకకు పలాయనం చిత్తగించాడు ఇదేమి విచిత్రమో?**

**జవాబు :-** తాను ఎవరో బయటపడకూడదని కృష్ణుడు అలా చేశాడు. ఇప్పుడు కృష్ణుడు భగవంతుడంటే ఎవరయినా నమ్మగలరా? నమ్మరు. నమ్మకూడదనే అలా చేశాడు.

**74) ప్రశ్న :- అగ్గిపుల్ల వెలుగుటకు అగ్గిపెట్టె అవసరము, దాని ద్వారా అగ్గి పుట్టును. ఈ రెండు రసాయన చర్యలే కదా! ఈ రెండింటికి ప్రాణము లేదు కానీ రసాయన చర్యవలననే మంట పుట్టింది. అలాగే కణాల మధ్య జరిగే రసాయన చర్యవలననే జీవి కదలుచున్నది, జీవనము జరుగుచున్నది. అంతేగానీ ప్రాణం అనే భాగము లేదు. మీరందరూ అన్నట్లు ఆత్మలేదు,**

**జీవుడూ లేడు. అంతా రసాయన క్రియ ప్రక్రియల ప్రభావము వలననే జరుగుచున్నది. మా మాట నిజమనుటకు అనాటమిస్ట్‌లు, భౌతిక శాస్త్రవేత్తలు, వైద్య పండితుల సాక్ష్యము గలదు. మీరు చెప్పే ప్రాణం, ఆత్మ, జీవాత్మలను మీరు చూపించలేరు. అలాంటప్పుడు మీ మాట నిజమనుటకు ఆత్మ, జీవాత్మలను చూపించే పరికరమును దేవున్ని అడిగి తీసుకరావచ్చు కదా?**

**జవాబు :-** కొంత విజ్ఞానము తెలిసినవారు దేవుని మీద విశ్వాసము లేని శాస్త్రవేత్తలు ఈ మాటను పెద్ద ఆయుధముగా చేసుకొని అడుగుచుందురు. జీవాత్మను, ఆత్మను చూపించే పరికరమైన జ్ఞానమును దేవుడు ఎప్పుడో ఇచ్చాడు. ఈనాడు క్రొత్తగా అడుగవలసిన అవసరము లేదు. నిమ్మకాయను గ్యాస్‌గల సోడాను కలిపితే రసాయన చర్యవలన బసబస పొంగిపోవును. 200 మిల్లీలీటర్ల సోడా 2000 వేల మిల్లిలీటర్ల వరకున్నట్లు పొంగును. అలాకావడము రసాయన చర్యయని చెప్పవచ్చును. అలాగే సున్నము, నవాసాగ్రము కలిస్తే కార్బన్‌డై ఆక్సైడ్ వాయువు వచ్చును. అది కూడా రసాయన చర్యే. అయితే ఈ రసాయన చర్యను ఎవరూ ఆపలేరు. దానిని ఆపగల పద్ధతిని, అవసరమైనప్పుడు ఉపయోగపడునట్లు చేయు విధానమును బుద్ధిచేత తయారు చేయవచ్చును. రసాయన చర్యను పరిమితి చేయునది, రసాయన చర్యను అవసరమొచ్చినప్పుడు ఉపయోగపడునట్లు చేయగల శక్తి ఒకటి గలదు అదియే బుద్ధి. బుద్ధి వలన నిమ్మరసమును ద్రవ పదార్థము నుండి ఘన పదార్థముగా మార్చినాము. అట్లే సోడాను కూడా ద్రవము నుండి పొడిగా మార్చినాము. రెండింటినీ కలిపి మాత్రగా తయారు చేయించి ఎప్పుడు నీళ్ళు కలిపితే అప్పుడు నిమ్మరసము సోడాగా తయారగునట్లు రసాయన చర్యను బుద్ధి చేత నియంత్రించి పెట్టాము. అప్పుడు రసాయన

చర్యను నియంత్రించు బుద్ధి ఎవరికీ కనిపించకయున్నది. రసాయన చర్యకంటే దానిని నియంత్రించు బుద్ధి గొప్పదియని ఎందుకు అనుకోకూడదు? శరీరములో కణముల మధ్య రసాయన చర్య వలన జీవనము సాగినా ఆ జీవనమును నియంత్రించు బుద్ధి యుండుట వలన జీవనము క్రమబద్ధముగా సాగుచున్నది. బుద్ధి పని చేయకపోతే వానిని తిక్కవాడు అని అంటాము. వాని జీవితము వృథా అంటాము. తిక్క వానిలో కూడా రసాయన చర్య జరుగుచున్నది కదా! అయినా బుద్ధి పనిచేయకపోతే వాని జీవితము వృథా అన్నప్పుడు రసాయన చర్యకు విలువ లేదని దానిని నియంత్రించు బుద్ధికే విలువయున్నదని తెలియు చున్నది. బుద్ధికి శక్తి నిచ్చునది ఆత్మ. బుద్ధి ద్వారా అనుభవమును పొందునది జీవాత్మ. ఆత్మ, జీవాత్మలకంటే క్రిందయుండు బుద్ధే ఎట్లుండేది భౌతిక శాస్త్రవేత్తలకు, వైద్యులకు తెలియనప్పుడు బుద్ధికంటే శ్రేష్టమయిన ఆత్మగానీ, జీవాత్మగానీ తెలియాలనుకోవడము ఆశేయగును. ఎవరయినా దైవజ్ఞానము తెలియగలిగితే శరీరముతో గల రసాయన చర్యను కూడా కలుగజేయు ఆత్మలు తెలియుటకు అవకాశముండును.

**75) ప్రశ్న :- పేదల ఆకలి తీర్చలేని మూఢజనుల పూజలు, దేవుడు అనుచూ కోట్లు గుమ్మరించి డబ్బుగల దేవతలను పోషించువారు గలరు. నిజంగా దేవుడుంటే నాకు డబ్బు అవసరము లేదు. నా హుండీలో డబ్బులు వేయవద్దండి. నాకు ఇచ్చు డబ్బులు పేదలకు ఖర్చు పెట్టండియని కలలోనైనా చెప్పవచ్చును కదా! అట్లు చెప్పని దేవునికి, ప్రస్తుత రాజకీయ నాయకులకు ఏమీ తేడా లేదని నేను అంటాను. మీరేమంటారు?**

**జవాబు :-** సామాజిక న్యాయమును గురించి మాట్లాడితే మేము కూడా మీరు చెప్పినట్లు చెప్పవలసిందే. అయితే దేవుని జ్ఞానములో కర్మ సిద్ధాంతము

తప్ప సామాజిక న్యాయముండదు. ఎవని పని వానిది, ఎవని కర్మ వానిది. కర్మను నిరోధించుకోవడానికి జ్ఞానము గలదు. జ్ఞానములో అన్యాయము నుండి బయటపడవచ్చును. అలాంటప్పుడు అందరూ జ్ఞానమును తెలిస్తే సామాజిక న్యాయము జరిగిపోవును కదా! మేము ఇలానే కష్టపడుతాము, మాకు జ్ఞానము వద్దు అనేవారిని దేవుడు ఏమీ చేయలేడు. మనుషులు ఏమీ చేయలేరు. రాజకీయ నాయకులు డబ్బును సంపాదించాలని రాజకీయములోనికి వచ్చారు. దేవుడు అట్లు డబ్బు సంపాదించాలని అనుకోలేడు కదా! అలాంటప్పుడు రాజకీయ నాయకులకు దేవునికి ఏమి తేడా లేదని ఇద్దరిని ఒకటిగా కలుపడము అజ్ఞానమగును.

**76) చర్మాసనములు వేసుకొని బ్రహ్మయోగము చేస్తే మంచిదని చర్మాసనముల ఉపయోగము చెప్పారు. అది బాగానే ఉందిగానీ, దానిని చెయ్యాలని తాపత్రయపడే భక్తులు చర్మాలకై పులిని, సింహాలను వేటాడి వాటి చర్మాలకై ప్రాకులాడితే బ్రహ్మయోగానికి ముందే కారాగార యోగము పొందే అవకాశమున్నదని నేనంటాను. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** "చర్మాసనములు బ్రహ్మయోగములో ఉపయోగించడము వలన కొంత వరకు శక్తిని పొందవచ్చును" అని చెప్పాను. అంతేగానీ పులి చర్మమే వాడాలనిగానీ, లేక సింహం చర్మమునే వాడాలనిగానీ చెప్పలేదు. ఏ చర్మమైనా ఒకే విధానము కల్గియున్నదని చెప్పాము. ఏ పేచీలు లేని ఎద్దు చర్మములు, బర్రెల చర్మములు బజారులో దొరుకును వాటిని వాడవచ్చును కదా! అనవసరముగా పులి, సింహము చర్మములను ఎందుకు వాడాలి? కారాగార యోగము ఎందుకు పొందాలి? నేను చెప్పినట్లు సులభముగా దొరుకు చర్మములను వాడి బ్రహ్మయోగములో శక్తిని నష్టపోకుండా చూచుకోవలెనని కోరుచున్నాము.

**77) ప్రశ్న :- మీరు చెప్పే దయ్యాలు నాస్తికులమైన మావద్దకు రావు. మీ దేవునికంటే మేమంటేనే వాటికి ఎక్కువ భయమేమో! ఈ రాకెట్‌యుగములో దయ్యాలు, దేవుళ్ళు అనువారు కొందరు కలరు. మీరు నమ్మిన దయ్యాలను మేము కూడా నమ్మాలని మీరు ప్రయత్నించుచున్నారు. దయ్యాలు భయపడి మావద్దకు రాకపోతే వాటిచేత దూరమునుండయినా వీడియో కాన్ఫరెన్సు పెట్టించండి. మేము దయ్యాలున్నాయని నమ్మితే మా చేత దేవుడున్నాడని సులభముగా నమ్మించవచ్చును. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** దయ్యాలున్నాయని నమ్మించవలసిన అవసరము నాకు ఏమాత్రము లేదు. పైగా దయ్యాలు మీకు భయపడి మావద్దకు రాలేదని చెప్పారు. దయ్యాలు మీవద్దకు రాలేదని మీరు ఎలా చెప్పగలరు? దయ్యాల విషయము ఏమాత్రము మీకు తెలియనప్పుడు అవి మీవద్దకు వచ్చినా అవి వచ్చినట్లు మీకు తెలియదు కదా! దయ్యాలు పదిమందిలో ఆరు లేక ఏడు మంది దగ్గరికి చేరి వారిలో ప్రవేశించి ఎవరికీ తెలియకుండా వుండును. అవి తెలియనంతమాత్రాన అవి లేవని చెప్పలేము. వాటివలన కలుగు బాధలను అనుభవించుచున్నా కొందరు వాటిని గుర్తించలేరు. దయ్యములు లేవను వారిలో చాలామందికి వారికి తెలియకుండానే దయ్యములున్నవని వారికే తెలియదు. దయ్యాలచేత వీడియో కాన్ఫరెన్సు పెట్టమన్నారు. అటువంటి అవసరము మాకు ఏమీ లేదు. ఇక్కడ మావద్ద ఐదునెలలనుండి దేవతలు వచ్చి మా బోధలు వింటున్నారు. వారు ఇతరుల శరీరము మీదికి వచ్చి మాట్లాడుచున్నారు. వారి దగ్గరకు వచ్చి మీ అనుమానములను అడగండి.

**78) ప్రశ్న :- భార్యా పిల్లలను వదలుకొన్న బుద్ధుడు అజ్ఞాని అని మీరు ఒక గ్రంథములో వ్రాయగా చూచాను. ఇంకొక గ్రంథములో బుద్ధుడు**

**జ్ఞానము కొరకు సర్వసంగ పరిత్యాగము చేశాడు. ఆయనకంటే మనము గొప్పవారమా? అని అన్నారు. ఈ రెండింటిలో ఏది నిజము?**

**జవాబు :-** రెండు సందర్భములలో చెప్పిన రెండు మాటలు నిజమే. జ్ఞానరీత్యా చూస్తే శరీరము లోపల గుణములను వదలుకోవలసియుండగా, శరీరములోపల గల తన పరివారమయిన వారు 24 మంది యుండగా వారిని వదలక, శరీరము బయట భార్యాపిల్లలను వదలడము అజ్ఞానము. భార్యా పిల్లలను వదలమని ఏ దేవుడు చెప్పలేదు. ఇంకొక సందర్భములో బయట వస్తువు మీద, ధనము మీద, బంగారుమీద ధ్యాసను పెంచుకొని వాటి కొరకు మనము నిత్యము ప్రాకులాడుచున్నాము. బుద్ధుడు బయట ధనము, బంగారుకంటే గొప్పగాయున్న భార్యాపిల్లలనే వదలినప్పుడు బయట ఏదీ వదులుకోని మనము, ఆయనకంటే గొప్పవారమా అనుమాట సత్యమే. బయట విషయములలో మనతో పోల్చుకుంటే ఆయనే గొప్ప. అంతరంగ జ్ఞాన విషయములో జ్ఞానరీత్యా బ్రహ్మవిద్యా శాస్త్రం ప్రకారము చూస్తే బయట భార్యా పిల్లలను వదలిన ఆయన అజ్ఞానియేనని చెప్పవచ్చును.

**79) ప్రశ్న :- అర్జునునిలో ప్రేమ, గౌరవము, పెద్దలంటే పూజ్యత ఉండేది. యుద్ధరంగములో పెద్దలయిన భీష్మ, ద్రోణుల వారి మీదికి చేయి ఎలా ఎత్తేది? అని సందేహించాడు. వారిమీద గౌరవ భావముతో ధనుర్బాణములు క్రిందవేశాడు. అయితే మత్తు కల్గించే సారాయి త్రాగిన మనిషి మారిపోయినట్లు కృష్ణుడు ఇచ్చిన గీతారసమును త్రాగిన అర్జునుడు మారిపోయి పెద్దల మీద గౌరవమును వదలి వారి మీదికే చేయి ఎత్తి యుద్ధము చేశాడు. అప్పటి విషయముకంటే ఇప్పుడు పాకిస్థాన్ వాళ్ళు నేర్పే ఉగ్రవాదము చిన్నది కాదా? కృష్ణుడు అర్జునునికి నేర్పినది మంచిదా, చెడ్డదా? ప్రేమనా, ఉగ్రవాదమా?**

**జవాబు :-** మీరు చెప్పే పద్ధతి ప్రకారమైతే కృష్ణుడు చెప్పినది, నేర్పినది హింసను గురించియనియే చెప్పవలెను. ఇప్పుడు ఉగ్రవాదము నేర్పి ఒక మనిషిని ఉగ్రవాదిగా మార్చుటకు కనీసము ఆరునెలలైనా పట్టును. కృష్ణుడు ఆరు నిమిషములలో అర్జునున్ని ఉగ్రవాద భావములలోనికి మార్చివేశాడు. ఈ కాలములో నేర్పే ఉగ్రవాదముకంటే కృష్ణుడు నేర్పిన ఉగ్రవాదమే గొప్పదియని చెప్పవచ్చును. అయితే ఆ దినములలో రాబోయే భవిష్యత్తు లోని ప్రజలకు జ్ఞానమును అందించుటకు అర్జుననకు కర్మయోగమును బ్రహ్మ యోగమును చెప్పాడు. అర్జునుడు ఆచరించుటకు కర్మయోగము యోగ్యమయినదని చెప్పాడు. కర్మయోగమును అర్థము చేసుకోకపోతే అది ఉగ్రవాదములాగనే కనిపించును. కర్మయోగమును అర్థము చేసుకొంటే మనిషి కర్మలనుండి బయటపడి దేవునియందైక్యమై పోవును. అర్థము కాకపోతే కర్మలను సంపాదించు ఉగ్రవాదములాగా కనిపించును. ఎవరి దృష్ఠి వారిది. ఎవరి గ్రాహిత శక్తి వారిది.

**80) ప్రశ్న :- "వాసాంసి జీర్ణాణి" అనే శ్లోకము చెప్పి "మనిషి చినిగిన దుస్తులు వదలుకొని, క్రొత్త దుస్తులు ఎలా ధరిస్తాడో, అదే విధముగా జీవాత్మ జీర్ణించిన శరీరమును వదలి క్రొత్త శరీరమును ధరిస్తుంది" అని చెప్పి వేదాంతమును బోధిస్తారా? ముసలివారైన భీష్మ, ద్రోణ, కృపా చార్యులకైతే వృద్ధులయిన దానివలన శరీరము జీర్ణమైనదని కొంత వరకు చెప్పవచ్చును. అభిమన్యుడు, దుశ్శాసన, కర్ణుడులాంటి వారి లాగినా లాగబడని శరీరము కల్గిన వారికి పై శ్లోకము ఎలా వర్తించును? శరీరము ఎంతో దృఢముగాయుంటే ఆత్మ ఎందుకు బయటపడాలి? దానికి ఏమయినా తెగులా? ఎందుకులెండి, లేని ఆత్మను ఉందని చెప్పే ప్రయత్నము?**

**జవాబు :-** వస్త్రము దానంతట అది పాతబడి చినిగిపోవునది గలదు. బలవంతముగా చించితే చినిగిపోవునది గలదు. భీష్మ, ద్రోణ, కృపాచార్యుల వారి దేహములు పాతబడినవే. అయితే యుద్ధములో ఎదురైన వారిలో అభిమన్య, కర్ణ, దుశ్శాసన మొదలగు వారందరిది క్రొత్త శరీరమే. చేయునది యుద్ధము, యుద్ధములో పాతదేహము, క్రొత్త దేహము అని అనుకోకూడదు. శత్రువు పెద్దవయస్సువాడుగానీ, చిన్నవయస్సు వాడుగానీ తప్పక ఎదుర్కొన వలసిందే. యుద్ధములో బలవంతముగా దేహము చినిగిపోయినప్పుడు ఆత్మ అందులో ఉండలేదు. పాత శరీరము ఎట్లు నివాస యోగ్యముకాదో అట్లే చినిగిన వస్త్రముగా యున్న శరీరము పాతవస్త్రమువలె మారి యుండును. కావున ముసలివాడయినా, వయస్సువాడయినా శరీరము పాతది సహజముగా అయినా, బలవంతముగా అయినా అవి నివాస యోగ్యములు కావు. అందువలన వృద్ధులకుగానీ, యువకులకుగానీ మరణము తప్పదు. శరీర విషయములో వయస్సు గడచుకొలది పాతది అగుట గలదు. యువకులుగా యున్నప్పుడే పాతదగుట గలదు. అప్పటికి కర్మ అయిపోయి వుండును. కావున తర్వాత జన్మకుపోయి అక్కడ ఏదీ జ్ఞప్తిలేని దానివలన వెనుకటి జన్మతో సంబంధము లేకుండా బ్రతుకుదురు. ఇదంతా సర్వసాధారణముగా జరుగునదే.

**81) ప్రశ్న :- ఎవరు ఏ పని చేసినా ఏదో ఒక కోర్కె ప్రేరణతో చేస్తారు. అన్ని కోర్కెలు త్యజించుకోవడము కూడా కోర్కెయగును కదా! 'నిష్కామ కర్మ' అనడములో అర్థము ఏముంది?**

**జవాబు :-** 'ఏ కోర్కె ఉండకూడదు' అని అనుకోవడము కూడా ఒక కోర్కేయగును. అయితే ఇక్కడ చెప్పినది కోర్కె లేకుండాయని కాదు. కోర్కె వలన వచ్చే కర్మను లేకుండా చేసుకొమ్మన్నాడు. కోరి చేసే పనులలో

వచ్చే కర్మను లేకుండా చేసుకొమ్మన్నాడు. ముందు అనుకోనిది, పూనుకోనిది ఏ పనిని చేయలేము. ఇక్కడ పనిని చేయకుండా మానుకోవడము లేదు. అయితే పనిని చేయట వలన వచ్చెడి కర్మను లేకుండా చేసుకొమ్మన్నాడు. దానినే 'నిష్కామకర్మ' అని అనడము జరిగినది.

**82) ప్రశ్న :- "భ్రామయన్ సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా" (గీత 18-61) "నా మాయ ప్రభావముతో జీవులను కీలుబొమ్మలుగా ఆడిస్తున్నాను" అని చెప్పిన భగవద్గీత ఒక శ్లోకము తర్వాత శ్లోకములో (18-63) 'యధేచ్ఛసి తథాకురు" "నీకు ఎలా ఇచ్ఛ కలిగితే అలా చేయి" అనే మాట ఎందుకన్నట్లు?**

**జవాబు :-** మనిషి ఇష్టము ప్రకారము చేసినా అది వాని ఇష్టమునుబట్టి జరగడము లేదు. మనిషిలోని ఇచ్ఛ కూడా ఆత్మదేయై యుండుట వలన మనిషికి ఒక పనిని చేయాలను ఇచ్ఛను కల్గించి, ఆ ఇచ్ఛ ప్రకారము పనిని చేయించుట వలన మనిషి నా ఇష్టము ప్రకారము పని జరుగు చున్నదని భ్రమించుచున్నాడు. వాస్తవముగా లోపలికి పోయి చూస్తే అన్ని పనులు ఆత్మ ఘతకము ప్రకారము నడుపుచున్నది. తాను గుర్తింపుకు రాకుండా ఆత్మ చేయు పనులు స్వయముగా జీవుడు చేయునట్లు భ్రమింప జేయుచున్నది. ఆత్మ తన మాయ చేత మనిషిని బొమ్మను ఆడించునట్లు కర్మప్రకారము ఆడించడము జరుగుచున్నది. మనిషి (జీవుడు) ఆత్మ చేతిలో ఆడింపబడుచున్నా ఆడించునది ఆత్మ, ఆడింపబడువాడు మనిషి (నేను) అని గ్రహించలేక పోవుచున్నాడు. జ్ఞానము ప్రకారము ఆత్మ మనుషులను బొమ్మలవలె నడుపు విధానమును 61వ శ్లోకములో చెప్పి ప్రక్కనే 63వ శ్లోకములో అజ్ఞానము ప్రకారము మనిషి ఇచ్ఛ ప్రకారము పనులు చేయునట్లు చెప్పడము జరిగినది. జ్ఞానులకు 61వ శ్లోకము సత్యము. అజ్ఞానులకు 63వ శ్లోకము సత్యము అనునట్లు చేశాడు.

**83) ప్రశ్న :- "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వ పాపేభ్యోః మోక్షయిష్యామి మాశుచః" ఈ ఒక్క శ్లోకము చెప్పితే, దానినే పరిగణిస్తే, మిగతా శ్లోకములు చెప్పే అవకాశము లేదు కదా! అని నేనంటాను. మీరేమంటారు?**

**జవాబు :-** భగవద్గీతలో చెప్పినవి ముఖ్యముగా మూడు ధర్మములని చాలామార్లు చెప్పాము. అందులో ఒకటి బ్రహ్మయోగ ధర్మము, రెండు కర్మయోగ ధర్మము. ఈ రెండు కానిది భక్తి యోగము. మొదటి రెండు యోగములు ధర్మములతో కూడుకొనియుండగా మూడవ భక్తి యోగము ధర్మములకు అతీతముగా యున్నది. రెండింటిని మించినది భక్తియోగము. మొదట ధర్మముల ప్రకారము రెండు యోగములను తెలియగల్గిన తర్వాత ధర్మాతీతముగాయున్న భక్తియోగమును తెలియవచ్చును. మొదట రెండు యోగములను తెలియనిదే చివరిదయిన భక్తియోగము అవగాహనకు రాదు. అందువలన బ్రహ్మ, కర్మయోగములను తెలియగల్గితే తర్వాత భక్తి యోగమును తెలియవచ్చును. ముందు గల రెండు యోగములను తెలియ గల్గిన తర్వాత రెండు యోగములకున్నట్లు ధర్మములు లేని భక్తి యోగమును తెలియగల్గితే అటువంటి వానికి మిగతా శ్లోకములతో పనేలేదు. ముందే ధర్మములు లేని శ్లోకము చెప్పుటకు వీలులేదు. ధర్మములను తెలిసిన తర్వాత ధర్మము లేని స్థితిలోనికి రావచ్చును. అందువలన ముందు భగవద్గీతలో 17 అధ్యాయములు చెప్పి ఆఖరున 18వ అధ్యాయము చివరిలో భక్తి యోగమును గురించి చెప్పాడు. మొదట ధర్మములులేని భక్తియోగమును చెప్పిన అది వరుస క్రమము కాదు. అట్లు చెప్పినా భగవద్గీత జ్ఞానము అర్థము కాదు. అందువలన ముందు ధర్మములతో కూడుకొన్న జ్ఞానమును చెప్పడమైనది. ధర్మయుక్తమైన రెండు యోగముల ద్వారానే మనిషి ముక్తిని

పొందవచ్చును. ఆ రెండు విధానములను ఆచరించడము వలన శరీరములోని ఆత్మ తెలియబడును. ఈ రెండు విధానములు కాని భక్తి యోగమును తెలియుట వలన మనిషికి ముక్తియే లభించినా భక్తి యోగము వేగవంతమైనది. ముందు రెండు యోగములు వలన కర్మ కాలిపోయిన తర్వాత ముక్తి లభించును. వాటివలన ముక్తి లభించినా యోగము చేయు కొలది కర్మ కాలుతూ వచ్చును. ఇదంతయూ పద్ధతి ప్రకారము జరుగు చుండును. ధర్మాతీతమైన భక్తి యోగములో కర్మలు కాలిపోవడము చాలా వేగముగా జరుగును. అయితే ముందు బ్రహ్మ, కర్మయోగములను తెలియనిదే భక్తియోగము అర్థము కాదు. బుద్ధిలో శ్రద్ధయున్న వారు రెండు యోగములను తెలియగల్గును. ఇంకా శ్రద్ధ గలవాడు భక్తియోగమును కూడా తెలియగల్గును. ముందు బ్రహ్మ, కర్మయోగములను తెలియువాడు యోగ భ్రష్టుడు అనుటకు అవకాశము తక్కువగాయుండును. భక్తి యోగమును అనుసరించువాడు యోగభ్రష్టుడు అగుటకు అవకాశము ఎక్కువ గలదు. అందువలన భక్తియోగములో ఎక్కువ కాలము ఎవడూ కొనసాగ లేడు. ఒకవేళ భక్తియోగములో కొనసాగితే తక్కువ కాలములోనే మోక్షము పొందు అవకాశము గలదు.

**84) ప్రశ్న :- శివగీత, రామగీత, గోపిగీత అలాగే భగవద్గీత గలవు. ఇవన్నీ కవి కల్పన. కవికి కావ్య చమత్కారము ప్రదర్శించటానికి ఏదో ఒక ఆధారము కావాలి. అందువలన ఈ పేర్లు పెట్టి ఆ పేర్ల ఆధారముతో కావ్యమును వ్రాశారు. అందులో కవి చమత్కారము తప్ప ఏమీ లేదని, కవి కల్పన తప్ప ఏమీ లేదని అంటాను. మీరేమంటారు?**

**జవాబు :-** శివగీత, రామగీత, గోపిగీత, గురుగీత అను గ్రంథములను కవులు వారి భావములను అందులో ఇరికించి వ్రాశారు. వాటిని చదివితే

వాటి విషయము కవులు వ్రాసినదని తెలిసిపోవును. అందులో మనుషులకు తెలిసిన ఆధ్యాత్మికముంది గానీ, దేవుడు చెప్పిన, మనుషులకు తెలియని ఆధ్యాత్మికము లేదు. భగవద్గీత అటువంటిది కాదు. దేవుడు అందించిన ఆధ్యాత్మికము ఇందులో గలదు. అందువలన మిగతా గీతలతో సమానముగా పోల్చి భగవద్గీతను చెప్పకూడదు. భగవద్గీత ప్రత్యేకమైన బ్రహ్మావిద్యా శాస్త్రము. మిగతా గీతలలో శాస్త్రీయత ఉండదు. పురాణ కల్పితములు మిగతా గ్రంథములలో కన్పించును. అయితే భగవద్గీతలో కర్మ రహస్యము, యోగ వివరములు గలవు. భగవద్గీత బ్రహ్మావిద్యలో శాస్త్రబద్ధమైన గ్రంథము.

**85) ప్రశ్న :- "తస్మాత్ యుద్ధ్యస్య భారతా" అని పదేపదే చెప్పాడు. అదే భగవద్గీత యొక్క ఆంతర్యం అని కొందరి భావన. మీరు ఏమనుకొంటారు?**

**జవాబు :-** అప్పుడు ఎదురుగా యున్నపని యుద్ధము చేయడమే, కర్మయోగము ప్రకారము యుద్ధము చేయమన్నారు తప్ప యుద్ధము చేయడమే ముఖ్యమని చెప్పలేదు. కర్మయోగము ప్రకారము పని చేయుట మేలు త్యజించుటకంటే అన్నారు. సమయమునుబట్టి కర్మ ప్రకారము ఎదురైన కార్యమును చేయమని చెప్పడమే భగవద్గీత యొక్క ఆంతర్యముగానీ, యుద్ధమే చేయమనడము గీత ఆంతర్యము కాదు.

**86) ప్రశ్న :- గతులు కల్గిన గతులు లేనియని (ప్రకృతి,మాయ) చర, అచర ప్రకృతి గురించి మీ గీతలో "గతాసూ నగతాసూంశ్చ నాను శోచన్తి పండితాః" అనే శ్లోకాన్ని గురించి చెప్పారు. అర్జునుడు అడిగిన ప్రశ్న ఒకటైతే కృష్ణుడు చెప్పిన జవాబు ఇంకోలాగవుంది. ఎల్.కె.జి చదివే వానికి ఫిలాసఫీ చెప్పితే అర్థమగునా?**

**జవాబు :-** అతను ఏడ్చుచున్నాడు కావున ప్రస్తుత పరిస్థితిని బట్టి ఆ

శ్లోకముతోనే మొదలు పెట్టడము మంచిదయినది. సందర్భానుసారము ఆ శ్లోకము చెప్పడము సమంజసముగానే యున్నది. అదే నిజమైన దారియని మేము అనుకొంటున్నాము.

**87) ప్రశ్న :- స్థూలముగా యున్న దుస్తులు ధరిస్తే వాటి ద్వారా శరీరమునకు స్పర్శ, మెత్తదనము, వెచ్చదనము లేక చల్లదనము పొందవచ్చును. మరి సూక్ష్మశరీరముగా ఉండే వారికి శరీరము, చర్మము లేనందున సుఖానుభూతిని ఎట్లు పొందుదురు?**

**జవాబు :-** సూక్ష్మశరీరమునకు స్థూలమైన చర్మము లేకున్నా స్పర్శ అను ఇంద్రియశక్తి పని చేయుచుండును. అందువలన చర్మము వలన కలుగు అన్ని అనుభూతులను సూక్ష్మ శరీరముల వారు పొందుచున్నారు. సూక్ష్మ శరీరమునకు ఐదు జ్ఞానేంద్రియ శక్తులు ఉండుట వలన అన్ని అనుభవములను సూక్ష్మ శరీరముల వారు పొందుచున్నారు. మనవలె చూస్తున్నారు, తింటున్నారు. మిగతా అన్ని అనుభవములను స్థూల శరీరము లేకున్నా పొందుచున్నారు.

**88) ప్రశ్న :- జూదము ఆడి సర్వము కోల్పోయిన ధర్మరాజు చివరకు భార్యను కూడా జూదములో పెట్టినా ధర్మరాజును తప్పుయని కృష్ణుడు దండించలేదు. అలా ముందే దండించియుంటే ద్రౌపదికి వస్త్రాపహరణ జరిగెడిది కాదు కదా! అర్జునునికి గీతోపదేశము చేసిన కృష్ణుడు ధర్మరాజుకు నీతోపదేశము ఎందుకు చేయలేదు?**

**జవాబు :-** పేరుకు ధర్మరాజు పెను చేపవిత్తు అనుమాట ఇక్కడ బాగా తెలుస్తుంది. ఒక మనిషి తనకున్న రెండు ఎకరములలో ఒక ఎకరమును జూదములో పోగొట్టుకొంటే వానిని అందరూ నిందిస్తారు. బంధువులు

నిందించడమే కాక ఇతరులు కూడా వానిని జూదరియని హేళన చేయుదురు. అయితే తమ్ముళ్ళను, చివరికి భార్యను జూదములో పెట్టి ఆడిన ధర్మరాజు, ఎకరము భూమి పోగొట్టుకొన్న వానికంటే ఎంతో నీచముగా కనిపించుచున్నా అతనిని ఎవరూ దండించలేదు. అదేమో మనకు అర్థము కాదు. బహుశా ఉన్నవానికి లేనివానికి ఉండే తేడా ఇదేనేమో! కృష్ణుని విషయమునకు వస్తే ఆయన మనకు తెలిసినా తెలియకున్నా భగవంతుడే. భగవంతుడు ప్రపంచ విషయములను గూర్చి చెప్పడు. తాను చెప్పునది ఒక్క దైవికమయిన విషయములనే అయినందున అర్జునునికి భగవద్గీతను చెప్పినా, ధర్మరాజుకు చిన్న నీతి కూడా చెప్పలేదు. **నీతి, న్యాయము ప్రపంచ సంబంధమైనవి. అట్లే జ్ఞానము, ధర్మము దైవ సంబంధమైనవి.** అందువలన దైవ సంబంధ జ్ఞానమును చెప్పు కృష్ణుడు ప్రపంచ సంబంధ నీతిని గురించి చెప్పలేదు.

**89)** ప్రశ్న **:- ద్రౌపదికి వాస్తవముగా ఐదుగురు భర్తలా? అటువంటి సాంప్రదాయము ద్వాపర యుగములో ఇంకెవరి చరిత్రలో కనిపించలేదు. "అమ్మా పండును తెచ్చాము అంటే ఐదుగురు పంచుకోండి" అనే మాటను ఒక వ్యక్తి విషయములో నిర్ణయము తీసుకోవడము ఏ తల్లి అనుమతించ కూడదు. కనీసం కృష్ణుడైనా వారించాలి కదా?**

**జవాబు :-** ఈ విషయము తక్కువ జాతి మనుషులలో కూడా ఇంతకు ముందు లేదు, ఇప్పుడూ లేదు. అమ్మా కోడలును తెచ్చానని అర్జునుడు చెప్పియుండవచ్చును కదా! అట్లు కాకుండా పండును తెచ్చానని ఎందుకు చెప్పాలి? ఇది ముందే చేసిన తప్పును కప్పిపుచ్చుకొనే దానికి చెప్పిన మాటయనీ, వారు తల్లివద్దకు రాకముందే ద్రౌపదిని ఒకరికి తెలియకుండా ఒకరు అనుభవించారని, చివరికది తెలిసి ఒక ఒడంబడికకు వచ్చారని,

అదియే ఐదుమంది ఆమెతో కాపురము చేయడమనీ, తమ తప్పును కప్పిపుచ్చుకొనే నిమిత్తము 'అమ్మా పండు' మాటను పైకి తెచ్చారని తెలియుచున్నది. వారేమో తల్లి మాటను జవదాటని వారిగా కనిపించుటకు అట్లు చెప్పారు తప్ప అందులో నిజము లేదు. ఇది వారు మొదట చేసిన తప్పేననీ, వారి అమ్మ తప్పు కాదనీ తెలియుచున్నది. సామాజిక నీతి కూడా వారిలో లేదని తెలియుచున్నది. అంతేకాక జూదములో భార్యను పెట్టారు అంటే వారు ఎంత నీతిమంతులో చెప్పకనే తెలియుచున్నది. కృష్ణునికి వారిని గురించి బాగా తెలుసు. అయినా వారిని పట్టుకొని నాటకమాడాడు తప్ప వారి పట్ల గౌరవము లేదు.

**90) ప్రశ్న :- కౌరవులు నూర్గురు అని సమాచారము. అందరూ గాంధారికే పుట్టారా? పిండ విచ్ఛేదనము వలన వందల ముక్కలు బయట కుండలో పెరిగెను అన్నారు. దానిని ఇప్పుడు క్లోనింగ్ పద్ధతిలాంటిది అప్పుడున్నదా? లేదంటే అందులో ఏదయినా దైవరహస్యము ఉన్నదా?**

**జవాబు :-** ఇది ఆధ్యాత్మికము కాదు, అమ్మాపండు అని పాండవులు ఇతరులను నమ్మించినట్లు, కుండలో గర్భవిచ్ఛేదనము అదియు నూరు భాగములు పెరిగినదని చెప్పడము చాకచక్యమే అగును. క్లోనింగ్ పద్ధతి ఆ రోజులలో వీరికొక్కరికే ఉండేదా? వారందరూ ఇతర స్త్రీలకు పుట్టిన పిల్లలయివుంటారు. అంతేగానీ ఒక గర్భములో పుట్టినవారుండరు.

**91) ప్రశ్న :- ఉత్తర భారతదేశములో మేనమామ కూతురు చెల్లెలుతో సమానముగా చూస్తారు. దక్షిణ భారతదేశములో పెళ్ళి చేసుకొని భార్యగా చెప్పుకొంటారు. వావి వరుసల విషయములు దేవుడు బ్రహ్మవిద్యా శాస్త్రములో ఎందుకు వివరించలేదు? వావి వరుసలు తెలియకపోతే మనకు**

**పశువులకు ఏమి తేడా? ముస్లీమ్‌లు చిన్నాన్న కూతురును పెళ్ళి చేసుకొంటారు. దేవుడు అసలైన విషయములను వివరించకుండా దేవున్ని చేరే మార్గమే చెప్పితే అది అసంపూర్ణమేయగును. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** దేవుడు ప్రపంచ విషయములలో జోక్యము చేసుకోకూడదని ఒక హద్దును ఏర్పరచుకొన్నాడు. నీతి, న్యాయములను గురించి ఏమాత్రము ఆయన జోక్యము చేసుకోడు. అట్లు నీతి, న్యాయముల గురించి చెప్పితే ప్రపంచ సంబంధ పెద్ద మనిషిగా దేవుడు తయారయినట్లేయగును. దేవుడు దైవిక విషయములలోనే జోక్యము చేసుకొనును. అదియూ భగవంతుని వేషధారణలో, దేవుడు దేవునిగానే యుంటూ సాక్షిగా అన్నిటినీ చూస్తున్నాడు తప్ప ఆయన ఏమీ చేసే స్థితిలో, చెప్పే స్థితిలో లేడు.

**92) చంద్రుడు ఉపగ్రహము అయినా జ్యోతిష్యములో చంద్రున్ని గ్రహముగానే చెప్పారు. సూర్యుడు గ్రహమే కాదు మీరు గ్రహము అని అంటున్నారు. అది ఎట్లు చెప్పుచున్నారు?**

**జవాబు :-** భూమిమీద వస్తువుల విషయములను గ్రహించడము తిరిగి మనుషులకు లభించునట్లు చేయడము రెండు పనులను చంద్రుడు, సూర్యుడు చేయుచున్నారు కావున జ్యోతిష్యము ప్రకారము సూర్య చంద్రులను గ్రహములు అని అనుచున్నారు. చంద్రుడు కొన్ని విషయములను గ్రహించి తన ఆధీనములో పెట్టుకొన్నాడు. ఉదాహరణకు నీటికి సంబంధించిన సమాచారమును చంద్రుడు గ్రహించి భూమిమీద మనుషులకు నీరు ఎవరికి లభ్యము కావాలో, ఎవరికి లభ్యము కాకూడదో తెలిసి కొందరికి నీరును అనుకూలము చేసి వానికి బాగా లభ్యమగునట్లు చేయుచున్నాడు. కొందరికి సరిగా లభ్యముకానట్లు, కొందరికి నీటి విషయములో అనేక చిక్కులు,

బాధలు కల్గునట్లు చేయుచున్నాడు. జ్యోతిష్యము ప్రకారము చంద్రుడు అనుకూలము లేనివారికి ఈ బాధలు తప్పవని చెప్పవచ్చును. చెప్పినట్లే నీటి బాధలు వారు పొందుట సత్యముగా, సాక్ష్యముగా కనిపించుచున్నది. అందువలన చంద్రుడు గ్రహమే అంటున్నాము. అట్లే సూర్యుడు కూడా గ్రహమని నిరూపింపబడుచున్నది. భూమిమీద గల వస్తు సముదాయము యొక్క అధికారమును గ్రహించి వారి ఆధీనములో ఉంచుకొన్నాడు. కావున వారిని గ్రహించువారు గనుక గ్రహములు అని అంటున్నాము.

**93) ప్రశ్న :- ఆవలింతలు ఒకరికి వస్తే ప్రక్క వారికి కూడా ఎందుకు వస్తాయి?**

**జవాబు :-** ఆవలింతలు అంటు రోగములాంటివి. అందువలన ప్రక్కవారికి కూడా రోగమువలె వ్యాపించుచున్నవి.

**94) "పితృదేవతలను కొలిచేవారు (ఆరాధించే వారు) పితృ దేవతలనే చేరుదురు" అని భగవద్గీత చెప్పుచున్నది. పితృదేవతల విగ్రహాలున్నాయా, పితృదేవతలు విగ్రహాలను ఆవహిస్తారా?**

**జవాబు :-** పితృ దేవతలు విగ్రహాల రూపములో లేరు. అకాల మరణము పొంది సూక్ష్మ శరీరములతో యున్నవారినే పితృదేవతలని అంటున్నాము. వారిని పూజించగా వారు కూడా అకాల మరణమునే పొంది వారి పెద్దల వద్దకు పోయి సూక్ష్మముగానే ఉందురని అర్థము చేసుకోవలెను.

**95) ప్రశ్న :- అకాల మరణము పొందిన వ్యక్తికి శ్రాద్ధాది కర్మలు కొన్నాళ్ళు చేసి, జ్ఞానమార్గములోనికి వచ్చిన తర్వాత మనము వారికి ఆ కర్మలు చేయకుండా మానివేసి ఆహారము పెట్టడము, క్రొత్త గుడ్డలు చూపించడములాంటివి మానివేస్తే వారు ఏమవుదురు? మనపైన కోపగించు**

**కొందురా? లేక ఎవరినైనా స్థూలముగా యున్నవారిని ఆవహించి వారి ఆకలి తీర్చుకొందురా?**

**జవాబు :-** శ్రాద్ధకర్మలు ఆపివేస్తే పితృదేవతలకు కోపము రావడము సహజమే. కొందరు ఇతరుల శరీరములలో ఆవహించి మాకు గుడ్డలు ఎందుకు పెట్టడము లేదనీ, మంచి గుడ్డలు పెట్టలేదనీ వాదించిన వారిని చూస్తూనేయున్నాము. తప్పనిసరిగా ప్రతి సంవత్సరము క్రొత్త గుడ్డలు పెట్టాలని ఒప్పందము చేసుకొనే వారిని చూచాము. తిండి విషయానికి వస్తే ఇతరులను ఆవహించి ఆకలి తీర్చుకోవలసిన అవసరము వారికి లేదు. ఎక్కడయినా సూక్ష్మముగానే వారు గ్రహించుకొందురు.

**96) ప్రశ్న :- పితృదేవతలను పూజ చేసేవారు పితృదేవతలలోకి చేరుదురు అంటే వారు ఎక్కడ ఉండెదరు? భూమిమీదనే ఉంటారా? భూమిమీదే ఉంటే వారంతా మిగతా దయ్యాలకంటే గొప్పవారా? వారి సమూహము వేరుగా ఉంటుందా?**

**జవాబు :-** పితృదేవతలను పూజించెడి వారు చనిపోయిన తర్వాత దయ్యాల గుంపులోనే చేరిపోవుదురు. వారి పెద్దలు దయ్యాలే కనుక వీరు కూడా వారివద్ద చేరవలసిందే. దయ్యాలన్నీ భూమిమీదనే ఉంటాయి. పితృ దేవతలని చెప్పినంత మాత్రమున వారు దేవతలేమి కాదు. వారు మిగతా దయ్యాలతో సమానముగా యున్నారు. వారి సమూహము వేరుగా ఏమీ లేదు.

**97) ప్రశ్న :- సూక్ష్మ శరీరాలకు మరణావస్థ యుండునా? మనమైతే శరీరమును వదలిపెట్టుదుము. తద్వారా ఆత్మ, జీవాత్మలు బయటపడును. శరీరము, చర్మము లేని దయ్యములలో ఆత్మ, జీవాత్మలు ఎట్లు వేరు అగును?**

**వాటికి బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య దశలు ఉండునా? మూడు సంవత్సరములలో హత్య చేయబడిన బాలుడు దయ్యముగా మారితే ఆయన సూక్ష్మ శరీరధారియై వృద్ధాప్య దశ వరకు చేరునా?**

**జవాబు :–** అకాల మరణము పొంది సూక్ష్మ శరీరములుగా మిగిలినవారు తిరిగి మరణదశలో పూర్తి మరణము పొంది తర్వాత జన్మకు పోవుదురు. స్థూల శరీరము లేకపోయినా పదిహేను భాగముల సూక్ష్మ శరీరము గలదు. కావున అందులో ఇప్పుడెట్లు ఆత్మ, జీవాత్మలున్నారో అప్పుడు కూడా అట్లే ఉందురు. వారికి కూడా బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య దశలు ఉండును. బాల్యములో చనిపోయి సూక్ష్మ శరీరముగాయున్నవారు అదే శరీరములో పెరిగి వృద్ధాప్యము వరకు జీవితమును సాగించుట కలదు.

**98) ప్రశ్న :– మడి, మైలు అన్నవి ఉన్నాయా? దేవతా ఉపాసకుడు స్త్రీ బహిష్ఠు సమయములో ఉన్నప్పుడు తాకితే ఆయన పొందిన సిద్ధులు కోల్పోవునని కొందరు చెప్పుచుందురు. ఆ మాట వాస్తవమేనా?**

**జవాబు :–** మడి, మైలు అనేవి ఉన్నాయనే చెప్పవచ్చును. దేవాతారాధనలు కొన్ని నియమములతో కూడుకొనియుండును. ఆ నియమముల ప్రకారము నడచినప్పుడు దేవతారాధన వలన కొన్ని ఫలితములు (సిద్ధులు) కల్గుట వాస్తవమే. అయితే నియమముల ప్రకారము నడువనప్పుడు ఆ సిద్ధులు కోల్పోవడము కూడా జరుగును. నియమములలో బహిష్ఠు మనుషులను తాకకూడదనేది కూడా ముఖ్యమైన నియమముగా ఉండుట వలన దానిని తప్పనిసరిగా ఆచరించవలెనని చెప్పుచుందురు. బయటి దేవతల ఆరాధనలన్నీ నియమములతో ఉండడము వాస్తవమే. వాటి ప్రకారము మడి, మైలు అన్నవి కూడా వాస్తవమే. అయితే అసలయిన దేవుని విషయములలో, ఆరాధనలో నియమములుండవు, సిద్ధులు ఉండవు. సిద్ధి మాత్రముంటుంది. సిద్ధి అనగా మోక్షము.

**99) ప్రశ్న :- ఈ ప్రపంచములో జవాబు లేని ప్రశ్న ఒక్కటే ఉంది, మిగతా వాటికి జవాబులు గలవు అని ప్రసంగములో మీరు చెప్పారు. ఆ ప్రశ్న ఏదో తెలుప ప్రార్థన?**

**జవాబు :-** జవాబు లేని ప్రశ్న ఉన్నది నిజమే. ఈ ప్రపంచములో పెద్ద ప్రశ్న, జవాబులేని ప్రశ్న, బ్రతికినన్నాల్లు వెదికినా జవాబు దొరకని ప్రశ్న, "దేవుడు ఎవరు?" అన్నదే. దానికి జవాబు బ్రతికిన వారివద్ద లేదు?

**100) ప్రశ్న :- జ్ఞానానికి చంద్రుడు అధిపతియైనప్పుడు చంద్రుని ద్వారా మనకు జ్ఞానము అందివ్వకుండా దేవుడు సూర్యుని ద్వారా జ్ఞానము ఎందుకు తెలియబరచాడు. దేవుడు సృష్ఠి ఆదిలో చంద్రునికే జ్ఞానము చెప్పవచ్చును కదా?**

**జవాబు :-** ఎలా తెలియబరచాడు అన్నది ముఖ్యము కాదు, ఎలా మనిషి తలకు చేరుతుంది అనేది ముఖ్యము. సూర్యుని ద్వారా సృష్ట్యాదిలో జ్ఞానమును బయటి ప్రపంచమునకు తెలియజేసినా అది మనుషుల తలలకు చేరుటకు చంద్రుని అనుమతి అవసరము. చంద్రుని ఆధీనములో జ్ఞానముండును. కనుక చంద్రుని గ్రహచారము మనిషివైపు ఉన్నప్పుడే జ్ఞానము వాని తలకు తెలియును. చంద్రుని చూపులేని అనగా చంద్రుని అనుకూలత లేని వానికి జ్ఞానము తెలియుట కష్టమగును. అటువంటి వానికి జ్ఞానము మీద శ్రద్ధయుండదు. జ్ఞానము మీద శ్రద్ధను కల్గించి జ్ఞానమును అందించు గ్రహము చంద్రుడేయని తెలియవలెను.

**101) ప్రశ్న :- భారతదేశములో కృష్ణుడు పుట్టుటకు కారణము భారతదేశము జ్ఞానుల దేశము కనుక ఈ దేశములో పుట్టాడని చెప్పవచ్చును. కానీ ఏసుప్రభువుగా వచ్చినప్పుడు ఇజ్రయేల్ దేశములో పుట్టెను. ఆ దేశ విశిష్టత ఏమి?**

**జవాబు :-** భారతదేశము జ్ఞానుల దేశము అని గుర్తింపు ప్రజలకేగానీ, దేవునికికాదు. దేవుడు జ్ఞానుల దేశములో పుట్టవలసిన పనిలేదు. అక్కడ జ్ఞానముండుట వలన జ్ఞానుల దేశములో దేవుని అవసరముండదు. ఎక్కడ అజ్ఞానముండునో అక్కడ దేవుడు అవతరించునుగానీ, జ్ఞానుల దేశమని చూచి పుట్టడు. ఎక్కడ తన జ్ఞానము తెలియవలసిన అవసరమున్నదో, ఎక్కడ అజ్ఞానమున్నదో అక్కడ దేవుడు ఉద్భవించునని విన్నాము. ద్వాపర యుగములో భారతదేశమందు అధర్మములు తారాస్థాయికి చేరియుండుట వలన భారతదేశములో పుట్టవలసిన అవసరము ఏర్పడినది అంతేగానీ ఇది జ్ఞానుల దేశమని కాదు.

**102) ప్రశ్న :- సూక్ష్మ శరీర జీవులు ఆహార పదార్థములలో పోషకాలను గ్రహించునా? వాటి పరిమాణాన్ని స్థూలముగా తగ్గించునా?**

**జవాబు :-** సూక్ష్మ శరీర జీవులలో అనేక జాతులు (అనేక రకములు) కలవు. అందులో కొన్ని ఆహార పదార్థములలో పోషకాలను తీసుకొనునవి గలవు. ఉదాహరణకు ఒక హోటల్‌లో రెండు సూక్ష్మములు (దయ్యములు) ప్రవేశించి ఒక్కొక్కటి పది ఇడ్లీలను ఇద్దరు కలిసి 20 ఇడ్లీలను తిన్నారనుకోండి. అప్పుడు 20 ఇడ్లీలు స్థూలముగా అట్లే కనిపించు చుండును. అయితే వాటిలో సూక్ష్మముగా యున్న పోషక విలువలు లేకుండా పోయివుండును. ఆ ఇరవై ఇడ్లీలను ఇతరులు తినినా వారికి కడుపు నిండనట్లేయుండును. వాటి వలన శరీరమునకు బలము రాదు. ఇదంతా కనిపించకుండా జరుగుచుండును. కొన్ని ఇళ్ళలో దయ్యాలు తినేదే ఎక్కువ యుండును. అందువలన ఆ ఇంటిలోని వారు ఎంత తిన్నా బలహీనముగానే ఉందురు. సూక్ష్మ శరీరములుగా యున్న వారిలో కొందరు స్థూలముగాయున్న ధాన్యమును కూడా లేకుండా చేయగలరు. వారు దేవతా సంబంధ సూక్ష్మములు. దేవతలుగా యున్నవారు పొలములో యున్న పంటను,

కల్లములోయున్న దాన్యమును దొంగిలించగలరు. అనగా స్థూలముగా లేకుండా చేయు స్థోమత కల్గియుందురు. వారినుండి పంటను కాపాడు కొనుటకు పొలములో 'పొలి' చేయుదురు. కల్లములో పొలిగీత గీయుదురు. రాసిమీద కొడవలి లేక జిల్లెడు కొమ్మ, లేక భగవద్గీత పెట్టుచుందురు. రాసి చుట్టూ గీతను గీయుచుందురు. దీనినిబట్టి దేవతలు స్థూలముగా, దయ్యములు సూక్ష్మముగా అపహరించుచున్నవని తెలియుచున్నది.

**103) ప్రశ్న :- నైవేద్యము అనే దానికి అర్థమున్నట్లే ప్రసాదమునకు కూడా అర్థము కలదా?**

**జవాబు :-** నైవేద్యము దేవతలకు ప్రసాదము మనుషులకు, ఆరాధన ఫలితములోని శక్తి ప్రసాదములో చేరియుండునది కావున దానిని ప్రసాదము అని అంటున్నారు. 'ప్ర' అనగా ముఖ్యమైన అనియు, 'సాదము' అనగా తినునదియనియు, 'ప్రసాదము' అనగా ముఖ్యమైన శక్తితో కూడుకొన్న ఆహారమనియూ చెప్పుకోవచ్చును.

**104) ప్రశ్న :- కృష్ణ ప్రతిమలో ఎటువంటి సూక్ష్మశక్తి ప్రవేశించలేదు. కనుక మనము చేసే పూజను పరమాత్మే స్వీకరించునా?**

**జవాబు :-** వాస్తవమే కృష్ణప్రతిమ దగ్గర చేయు పూజ నేరుగా దేవునికే చేరును. ఇంకొక రహస్యమేమనగా! భగవద్గీత రాజవిద్యా రాజగుహ్య యోగమున 23, 24 శ్లోకములను చూస్తే ఇలా గలదు.

శ్లో॥ 23. యేప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేపి మామేవ కౌంతేయ! యజన్త్య విధిపూర్వకమ్ ॥

శ్లో॥ 24. అహంహి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
నతుమా మభిజానన్తి తత్త్వేనా తశ్చ్యవన్తితే ॥

భావము :- **"ఎవడు శ్రద్ధగలిగి అన్యదేవతారాధన చేసినా అతడు కూడా నన్నే ఆరాధించు వానిగా లెక్కించును. అయితే వానిది దారి తప్పిన విధానము. సర్వ దేవతలకు చేయు ఆరాధనలయందు, యజ్ఞములయందు ప్రభువును నేనే, వారు ఇచ్చు వాటిని స్వీకరించు వాడిని నేనే, నన్ను నిజముగా తెలియని వారికి ఫలితమున్నా దానిని వారు పొందలేరు"** అని చెప్పాడు. అంతేకాక విజ్ఞాన యోగములో 21, 22 శ్లోకములయందు ఈ విధముగా చెప్పియున్నారు చూడండి.

శ్లో॥ 21. యోయో యాం యాం తనుంభక్త శ్రద్ధ యార్చితు మిచ్ఛతి।
తస్య తస్యా చలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహమ్ ॥

భావము :- **"ఎవడు శ్రద్ధతో ఏ దేవతను పూజింపవలెనని తలచుచున్నాడో వానికి ఆ దేవతను పూజించు శ్రద్ధను నేనే కల్పించుచున్నాను."**

శ్లో॥ 22. సతయా శ్రద్ధ యా యుక్తస్త స్యా రాధన మీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥

భావము :- **"వాడు ఆ దేవతనే శ్రద్ధతో పూజచేయగా వాని మంచిని కోరి వాని కోర్కెను నేనే నెరవేర్చుచున్నాను"** దీనినిబట్టి ఏ దేవతను పూజించినా అక్కడ ఆ పూజను స్వీకరించువాడు దేవుడేయని, ఆ దేవత ఏమీ చేయలేకున్నా వాని కోర్కెను దేవుడే నెరవేర్చుచున్నాడని తెలియుచున్నది.

**105)** ప్రశ్న :- **భగవంతునిగా వచ్చిన కృష్ణుడు మీరాబాయికి స్థూలముగా కనిపించాడా? లేక మాటలే వినిపించాయా?**

**జవాబు :-** ఈ విషయము చాలామందికి సందిగ్ధముగాయున్నా నాకు తెలియును కనుక చెప్పుచున్నాను. మీరాబాయి స్థూలముగా చూడాలని

ఆశపడినది స్థూలముగానే కనిపించి మాట్లాడినాడు. ఇతరులకు ఆయన మాటలు వినిపించాయిగానీ రూపము కనిపించలేదు. కృష్ణుడు భగవంతుడు. భగవంతుడు అనగా దేవుని ప్రతినిధి. ప్రతినిధియనగా దేవునికి యున్నంత శక్తి ఆయనకు ఉండును. అందువలన ఆయన తనకు ఇష్టమైతే స్థూలముగా కనిపించి మాట్లాడగలడు. అదే మీరాబాయి జీవితములో జరిగినది.

**106) ప్రశ్న :- మన వివాహ వ్యవస్థ ఎప్పుడు ప్రారంభమయినది.**

**జవాబు :-** మనిషికి కొంతవరకు దైవజ్ఞానము తెలిసిన తర్వాత వివాహ వ్యవస్థ ప్రారంభమయినది. ఇదంతయూ కృతయుగములోనే జరిగినది.

**107) ప్రశ్న :- భార్యా భర్తలలో పురుషునికి పెద్ద వయస్సు ఎందుకు?**

**జవాబు :-** జీవితములో భర్తదే ఆధిపత్యముండుటకు. వయస్సు కొంత ఎక్కువ యుండుట వలన అన్ని విషయములలో భార్యకంటే ఆధిపత్యములో ముందుండవలెనను ఉద్దేశ్యముతో పెద్ద వయస్సు ఉండవలెనన్నారు.

**108) ప్రశ్న :- దైవ ప్రార్థనలలో శృంగారము సమంజసమా?**

**జవాబు :-** శృంగారము దైవప్రార్థనలలో ఉండకూడదనే ఉద్దేశ్యముతోనే అవన్నీ గాలిగోపురము వద్దనే వదలిరమ్మని గుడిముందర గల పెద్ద గోపురము మీద అన్ని రంగములకు సంబంధించిన బొమ్మలను పెట్టియుందురు. అందులో శృంగార బొమ్మలు కూడా ఉండును. పెద్దగోపురము వద్దనే అన్ని విషయములు వదలి గర్భగుడివద్దకు చేరవలెనను సూచనగా వాటిని భావించవలెను.

**109) ప్రశ్న :- సృష్ఠి మొదటి దంపతులు ఎవరు?**

**జవాబు :-** సృష్ఠి మొదటిలో దంపతులు లేరు. సృష్ఠి జరిగిన తర్వాత సృష్ఠించబడినవారే దంపతులుగా తయారైనారు.

**110) ప్రశ్న :- దైవబలము లేకుంటే మానవశక్తి సహకరించదా?**

**జవాబు :-** మానవ శక్తి అనునదే లేదు. జరుగునదంతయూ దైవశక్తి (ఆత్మబలము) చేతనే జరుగుచున్నది. అంతటా మధ్యాత్మ శక్తి తప్ప మానవ శక్తి ఎక్కడా లేదు.

**111) ప్రశ్న :- ఆది మానవులు అని చెప్పే కాలము కృతయుగపు కాలమా లేక కలియుగపు మొదటి కాలమా?**

**జవాబు :-** కృతయుగము కాలమునే ఆది మానవుల కాలమని చెప్పవచ్చును.

**112) "బ్రెయిన్ డెడ్" లో లేదా కోమాస్థితిలో జీవుడు ఏ గుణ భాగములో ఉండును. బుద్ధి, చిత్తము మొదలగునవి ఎందుకు పని చేయవు?**

**జవాబు :-** ఏ గుణములో అయినా ఉండవచ్చును. ఆత్మ బుద్ధిని, మనస్సును పనిచేయక యుండునట్లు చేయును. ఆత్మ శక్తి ఇచ్చి ఆడిస్తే ఆడేవి బుద్ధి, మనస్సు. మనస్సు బయటి సమాచారముల ప్రతినిధి. బుద్ది లోపల సమాచారముల ప్రతినిధి. ఈ రెండు ఆత్మ చైతన్యము చేత పని చేయు చుండును. ఈ రెండు ఆత్మ ఆడిస్తే ఆడేటివి. ఆత్మ ఆడించలేదు. అందువలన లోపల సమాచారము బయటికి రాదు. బయటి సమాచారము లోపలికి పోదు. మనస్సు, బుద్ధి యొక్క సంబంధమే కోమా లేక బ్రెయిన్ డెడ్ అని అంటారు. ఆ స్థితిలో జీవుడు ఏ గుణములోనయినా ఉండవచ్చును. ఇది జీవునికి ఏమాత్రము సంబంధము లేదు.

**113) ప్రశ్న :- జీవులు లేని స్థితి దేవుని పగలు అని అన్నారు. బ్రహ్మ చక్రము తిరగాలంటే ఏది కారణము?**

**జవాబు :-** జీవులు ఉన్న స్థితి పగలు అని చెప్పాము. లేని స్థితి పగలు అని చెప్పలేదు. జీవులు లేని స్థితి బ్రహ్మరాత్రి అగుట జరుగుచున్నది. బ్రహ్మచక్రము ఆగితే కదా! ఎప్పటికీ అగదు. బ్రహ్మచక్రము తిరుగుటకు

క్రింది మూడు చక్రములు కారణము. పై చక్రము తిరుగుట వలన క్రింద చక్రములు ఆగవు. నాలుగు చక్రములు ఒకదానితో మరొకటి అవినాభావ సంబంధము కల్గియున్నాయి.

**114) ఆరు నెలలు పగలు, ఆరు నెలలు రాత్రి కల్గిన కొన్ని దేశములు కలవు కదా! వారికి రాత్రి పగలు అనే నిర్వచనాలు రోజూ మనలాగ సరిపోవటము లేదు కదా!**

**జవాబు :-** పగలు రాత్రి అను విధానము లోపలి చక్రముల గమనమును బట్టియుండును. అంతేగానీ బయట జరిగేదానిని బట్టి యుండదు. ఆరు నెలలు పగలు, ఆరు నెలలు రాత్రి ఉండడము కూడా సరిపోవును. పగలు రాత్రి గుర్తింపునవే, లోపల చక్రముల గమనమునుబట్టి చెప్పవచ్చును. మనిషి ఎప్పుడు మెలుకువ కల్గునో అప్పుడు పగలు. ఎప్పుడు నిద్రలోనికి పోవునో అప్పుడే రాత్రియగును. మనిషి నిద్ర మెలుకువలనే చావు పట్టుకలుగా లెక్కించి, మెలకువను ప్రభవము అనియూ, నిద్రను ప్రళయము అనియూ చెప్పడము ఆధ్యాత్మికములోనున్న పద్ధతి.

**115) ప్రశ్న :- వర్ణములు అనేవి లేవు అని చెప్పి శ్రీకృష్ణుడు ఒక శ్లోకములో స్త్రీలు, వైశ్యులు, శూద్రులు సహితము 'నా జ్ఞానము ద్వారా తరించెదరు' అని చెప్పాడు. కులము పేరు చెప్పి వారిని జాలితో చూచినట్లా, దిగజార్చి చెప్పినట్లా?**

**జవాబు :-** కృష్ణుని లెక్కలో కులములు లేవు. ప్రజల లెక్కలో కులములు ఉన్నాయి. ఫలానా వారు అని చెప్పాలంటే ఇతరులకు అలవాటైన భాషలోనే చెప్పాలి. లేకపోతే ఎవరిని గురించి చెప్పేది తెలియదు. అందువలన కులముల పేర్లతో సహా చెప్పవలసి వచ్చినది. అంతేగానీ అట్లు కులము పేర్లు చెప్పడములో ప్రేమలేదు, అసూయ లేదు.

**116) ప్రహ్లోద్ జానీ గారి శరీరములోయున్న ఆత్మ, ఆయన శరీరములో యుండే దుర్గాదేవియే రక్షించింది అని ఎందుకు చెప్పింది? రక్షించినది దుర్గాదేవా?**

**జవాబు :-** ప్రహ్లోద్ జానీ శరీరములో ఆత్మే అన్నీ చేయుచున్నది. దుర్గాదేవికి ప్రహ్లోద్ జానీ శరీరమునకు ఏమాత్రము సంబంధము లేదు. అయినా అలా చెప్పడములో ఆత్మ బయటికి తెలియకుండా అణిగిపోవడానికే అలా చెప్పారని తెలియుచున్నది.

**117) ప్రశ్న :- ఒక స్త్రీ చివరి దశలో తన భర్తనే మరల జన్మలో భర్తగా కావాలని కోరుకుని చనిపోయింది. కానీ భర్త మాత్రము వేరొక స్త్రీ భార్యగా ఉండవలెనని కోరుకుంటూ చనిపోయాడు. ఇప్పుడు భగవద్గీత ప్రకారము వీరి కోరిక ఎట్లు తీరగలదు. ఎందుకనగా! చివరిలో ఏది అనుకుంటే అదే జరుగుతుంది కదా!**

**జవాబు :-** చివరిలో అనుకొన్న దానినిబట్టి తర్వాత జన్మ రావడము జరుగు తుందిగానీ, అనుకొన్న కోర్కెలు నెరవేరునని చెప్పలేదు. వారి వారి కర్మ ప్రకారము వారికి జీవిత భాగస్వామి దొరుకును. అంతేగానీ వారు కోరుకున్నట్లే జరుగదు. కర్మనుబట్టి జరుగడము ఖాయము. చివరి దశలో అనుకొన్న కోర్కెలు నెరవేరునని భగవద్గీతలో చెప్పలేదు. చివరిగా అనుకొన్న దానినిబట్టి జన్మ కల్గుతుంది. ఏ భావమును స్మరిస్తూ శరీరమును వదలు చున్నారో అదే భావము ప్రకారము తర్వాత జన్మ కల్గును అని చెప్పారు గానీ అనుకున్న కోర్కెలు నెరవేరునని చెప్పలేదు. ప్రపంచ సంబంధ కోర్కెలు కర్మను బట్టి యుండును. తర్వాత జన్మ జ్ఞానిగా పుట్టుటకు నన్ను స్మరించుతూ చనిపొమ్మని అక్షర పరబ్రహ్మయోగములో చెప్పడము జరిగినది. జ్ఞానిగా పుట్టడము కర్మకు అతీతమైన విషయము.

**118) ప్రశ్న :- మేఘము దేవుని సైనికులు కదా! మరి సత్యాన్వేషి కథలో తపస్విబాబాగారి మాట వినినట్లుగా ఉంది ఎందుకు?**

**జవాబు :-** 'మేఘములాంటి మేఘములను తనశక్తి చేత సృష్ఠించును' అన్నాము గానీ నిజమైన మేఘములని చెప్పలేదు. మంత్రశక్తి చేత అవి సృష్ఠించబడి కొద్దిసేపుయుండి మాయమగునవే గానీ శాశ్వతముగా ఉండునవి కావు, నిజమైన మేఘములు కావు.

**119) ప్రశ్న :- తత్త్వము అనగా నీకంటే వేరుగాయున్నది అని మీరు చెప్పారు. కానీ సంస్కృతములో "త్వ" అంటే నేను అని అర్థము కదా! ఆ విధముగా అర్థము చూస్తే "అది నేను" అని అర్థము కదా!**

**జవాబు :-** 'అది నేను' అని చెప్పినది ఎవరో అర్థమయినదా జీవుడా? ఆత్మనా? 'అది నేను' అని చెప్పినది ఆత్మ అయినందున నీకంటే వేరుగా యున్నది ఆత్మయని చెప్పాము. తత్త్వము అనగా ఆత్మ అని అర్థము చేసుకోవాలి గానీ ఆ పదమును జీవునకు చెప్పుకుంటే పూర్తి తప్పగును. భావములన్నీ చెడిపోవును.

**120) ప్రశ్న :- ఆదిత్య అనగా రెండవవాడు కానివాడని అర్థము చెప్పి 'దిత్య' అనగా రెండు అని చెప్పారు. కానీ దిత్య అంటే రెండు కాదు, ద్విత్య అంటే రెండు అని అర్థము. అదియునూ కాక రెండవ 'ఆ' ను మీరు వ్యతిరేఖార్థము సూచించినట్లు తీసుకొన్నారు. మర్యాద×అమర్యాద అని ఒకటవ 'అ' వాడుదురు. మరి ఆదిత్య అనగా "అదిత్య" అనాలి కదా! ఆకలి అను రెండవ పదమును చెప్పినప్పుడు రెండవ 'ఆ'ను ఇక్కడ వ్యతిరేఖాన్ని సూచించేటట్లు చెప్పక "ఆకలి" అనే ఎప్పుడూ విశేషముగా చెప్పారు. అట్లాగే 'ఆలోచన' అని చెప్పారు. 'ఆదిత్య' విషయములో సందేహము తొలగింప ప్రార్థన ఆది అనగా మొదటిది అని అర్థముంటుంది.**

**కానీ 'ఆదిత్య' అనే పదములో దిత్య అనగా రెండు అనే అర్థము దగ్గరే నా సందేహము. భాషను విడచి భావాన్ని చూడాలని వుంది. అయితే కొందరు నన్ను దీనిని గురించి అడిగారు. వారికి సమాధానము కొరకే ఈ ప్రశ్న.**

**జవాబు :-** ఇక్కడ సంశయము ఏర్పడినది దిత్యకు ద్విత్యకు ఎంతో తేడా యున్నది కదా! ద్విత్య అనగా రెండు కావచ్చును. దిత్య అని చెప్పడము వలన ది ప్రక్కన వ వత్తు లేనిదాని వలన రెండు అని అర్థము రాదను ప్రశ్న ఒకటి గలదు. అట్లే మొదటి 'అ' కు రెండవ 'ఆ' కు ఎంతో భేదమున్నది. రెండవ 'ఆ' ను ఉపయోగించి ఆదిత్య అనుచోట 'అదిత్య' అని మీరన్నారని వ్యతిరేకార్థమును ఇవ్వవచ్చునుగానీ ఆ అనునది వ్యతిరేఖార్థము ఇవ్వదు కదా!యనినది రెండవ ప్రశ్న. ఇవి అందరికీ వచ్చు సహజమైన ప్రశ్నలే. మర్యాద×అమర్యాద అన్నప్పుడు అ వ్యతిరేఖార్థమును కల్గియున్నది. అదే విధముగా రోగ్యము అనగా రోగము, లేక వ్యాధి అని అర్థము. వ్యాధి లేదు, రోగము లేదు అని వ్యతిరేఖార్థమును చూపునప్పుడు "అరోగ్యము" అని వ్రాయడము లేదు. రోగ్యము×ఆరోగ్యము అని రెండవ దీర్ఘము ఆ ను ఉపయోగించి చెప్పుచున్నాము. అంటే కలి అట్లే నాశనము అని అర్థము. కడుపులో నాశనము కాని బాధ ఉన్నదని తెలుపు నిమిత్తము అకలి అని చెప్పక రెండవ ఆ ను ఉపయోగించి ఆకలియని అంటున్నాము. నాశనము కాని బాధ అని చెప్పు విషయములో ఆకలి అని రెండవ ఆ ను 'కలి'కి వ్యతిరేఖార్థముగా వినియోగించుచున్నాము. మూడు అను భావమును చెప్పుటకు త్రైతము, త్రిత్వము, త్రయము అని ఒకే అక్షరమును మూడు నాలుగు విధముల త్ర, త్రి, త్రై, త్వి అని చెప్పినా మూడు అని అర్థమునే సూచించుచున్నది. అలాగే అ మరియు ఆ రెండు సందర్భానుసారముగా వాడినా వ్యతిరేఖార్థమునే సూచించుచున్నవి. అట్లే 'ద్వి' బదులు 'ది' ని

వాడినా ద్వంద్వమునే చూపుచున్నది. ద్వ, ద్వి, దో, ద్వా, ది అను అక్షరము రెండును సూచించుచున్నది. మొదటివాడు సూర్యుడు 'ఆదిత్యుడు' అని చెప్పుచున్నారు. గ్రహములలో మొదటివాడు అని అర్థము. అ ను, ఆ ను సందర్భానుసారము వాడినట్లే మిగతా అక్షరములను కూడా సందర్భాను సారముగా వాడుదురు. ఆరోగ్యములో రెండవ 'ఆ' వాడబడినది. ఆదిత్యలో కూడా రెండవ ఆ నే వాడబడినది. ఆరోగ్యము అనగా 'రోగము లేనిది' అని సందర్భమునుబట్టి ఆ ను వాడారు. సందర్భములను బట్టి చూడకపోతే భావములు మారిపోవును. సూర్యుడు గ్రహములన్నిటిలో మొదటివాడు అని చెప్పుటకు "ఆదిత్యాయచ" అని చెప్పారు. ఇక్కడ మొదటివాడను అర్థము మీరు చెప్పినట్లయితే లేకుండా పోవును. ఆదిత్యుడు అనగా సూర్యుడు అని అందరూ చెప్పగలరు.

**121) ప్రశ్న :- భగవద్గీత శ్లోకములో 'మశ్వత్థం' అని ఉన్నదానిని 'అశ్వర్థము' గా మార్చుకోవలెనా? అప్పుడే మీరు చెప్పే అర్థము సరిపోతుందా?**

**జవాబు :-** సంస్కృత శ్లోకములోని పదము 'మశ్వత్థము' అని ఉండవలెను. తెలుగు పదము వ్రాయునప్పుడు మాత్రము 'అశ్వర్థము' అని వ్రాయవలెను. భాషలో పదము మారుచున్నది. అశ్వ శక్తి అని యంత్రశక్తిని కొలుచు చుందురు. అశ్వర్థము అనగా అశ్వము యొక్క అర్థము అని అర్థము. అశ్వము యొక్క అర్థము అనగా ధనము, బలము. అశ్వము యొక్క బలమును ఇంగ్లీషులో హార్స్‌పవర్ అని అంటారు. తెలుగులో అశ్వర్థము అని అంటాము. రావిచెట్టు చుట్టూ ఒక మీటరు పరిధి వరకు ఒక హార్సు పవర్ శక్తి యున్నదని చెప్పుచూ దానికి అదే అర్థముతో అశ్వర్థము అని అన్నారు. నా యంత్రము పది హార్సుపవర్ గలది యని చెప్పుటకు తెలుగు భాషలో పది అశ్వర్థములు కలది అనేవారు.

**122) ప్రశ్న :- స్థూలమైన కిళ్లీలో (తాంభూలములో) ఉన్న పోషకాన్ని స్థూల శరీరమును ఆవహించిన సూక్ష్మము గ్రహించితే, సూక్ష్మము తేలిపోయిన తర్వాత స్థూల దేహములో శరీరమునకు తాంభూలము వలన ఎలర్జీ ఎందుకు వచ్చినది?**

**జవాబు :-** శరీరమును ఆవహించిన జీవున్నిబట్టి శరీరమునకు కొన్ని పదార్థములు సరిపోవచ్చును. అదే ఇంకొక శరీరములో జీవున్నిబట్టి అతనికి కొన్ని పదార్థములు సరిపోక ఎలర్జీ ఏర్పడవచ్చును. కొందరికి మాంసము చాలా ప్రియమైన ఆహారము. అరుదుగా ఎవరికో ఒకనికి మాంసము తింటే శరీరమంతా దద్దులు రావడము, చర్మము ఎర్రగా మారిపోవడము, నవ్వులు రావడము జరుగును. ఆ జీవునికి కర్మనుబట్టి అలా జరుగుచుండును. స్థూల శరీరములో చేరిన సూక్ష్మమునకు తాంభూలము అంటే ఇష్టము అందువలన తాంభూలమును అడిగి ఇప్పించుకొని వేసుకోవడము జరిగినది. సూక్ష్మ శరీరము స్థూలదేహములో ఉన్న అరగంటసేపు ఏమీ జరుగలేదు. తర్వాత సూక్ష్మము ఆవహించియున్న స్థూలమును వదలిపోయిన తర్వాత ఆ శరీరము మొదటినుండి యున్న జీవుని ఆధీనములోనికి వచ్చుచున్నవి. ఆ జీవుని కర్మ ప్రకాము తాంభూలము సరిపోదు. కావున ఆ జీవుడు పైకి రాగానే కర్మప్రకారము ఎలర్జీ ఏర్పడి తాంభూలము వాంతికి రావడము జరిగినది. శరీరములో నివశించు జీవుని కర్మనుబట్టి ఆహారము సరిపోయేది, సరిపోనిది ఉండును. అంతేగానీ శరీరములనుబట్టి ఎలర్జీ ఉండదు.

**123) ప్రశ్న :- సత్యాన్వేషి కథలో సత్యసాయిబాబా, సాయిబాబాలకు సమాన గుర్తు ఫోటోలలో ఏది ఉన్నట్లు కనుగొన్నారు?**

**జవాబు :-** తల భాగము కప్పియుంచినట్లు తెలిసింది. ఒకరు గుడ్డతో కప్పగా, మరొకరు వెంట్రుకలతో కప్పివేశారు.

**124) ప్రశ్న :- సాకార భగవంతున్ని చూపే ప్రయత్నములో "దేవాలయ రహస్యములు" గ్రంథములో నాలుగు చేతులు ఎందుకు చూపారు?**

**జవాబు :-** భగవంతుడు సాధారణ మనిషిగా వచ్చినా మనుషుల కంటే గొప్పవాడని అజ్ఞానులు కూడా తెలియుటకు సాధారణ మనుషులకు రెండు చేతులుండగా భగవంతునికి నాలుగు చేతులు పెట్టి చూపడము జరిగినది.

**125) ప్రశ్న :- "త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి" అని చెప్పి పాలిథీన్ కవర్ల వలన పొల్యూషన్ జరుగును కదా! పొల్యూషన్ చేయుటలో మీరు అందరి లాగే భాగస్వాములగును కదా! పైగా ఆ కవర్లు కాలువలో, మురికి నీళ్ళలో పడితే మీ గ్రంథాన్ని మీరు అవమానించినట్లు కాదా?**

**జవాబు :-** ఉద్దేశ్యము మంచిదయినప్పుడు మిగతా వాటిని గురించి ఆలోచించనవసరము లేదు. మిగతా పనులన్నియూ కర్మనుబట్టి కర్మ ప్రకారమే జరుగుచుండును. ప్రజలు జ్ఞానులు కావాలన్నదే మా ఉద్దేశ్యము. కవర్లు కాలువలో పడునని మా ఉద్దేశ్యమును మానుకోము. దేవుని దృష్ఠిలో అన్నీ సమానమేనని ముందు కూడా చెప్పాము. మనుషులమయిన మనకు మంచి చెడు, శుభ్రము అశుభ్రము ఉండునుగానీ, దేవునికి అవి ఏవీ లేవు.

**126) ప్రశ్న :- ఆదిత్య అనగా అదితి పుత్రుడు ఆదిత్యుడని, దశరథపుత్రుడు దాశరథ అని రామున్ని ఉద్దేశించి చెప్పినట్లు చెప్పియుండవచ్చు కదా!**

**జవాబు :-** అవి పురాణ కథలు, నేను చెప్పునది యదార్థ విషయములు. సూర్యుడు సృష్ట్యాదిలో ప్రకృతితో సహా దేవుని సంకల్పము చేత పుట్టినవాడు. సూర్యుడు తల్లి తండ్రికి పుట్టినవాడు కాదు. బ్రహ్మాండమునుండి నేరుగా పుట్టినవాడు. సూర్యునికంటే ముందు మనుషులు లేరు. సృష్ఠి తయారైన తర్వాత సూర్యున్ని గురించి వ్రాసుకొన్న పురాణములలో అదితి పుత్రుడు

అదిత్యుడు అని వ్రాసుకోవడము జరిగినది. పుక్కిటి పురాణములను నమ్ముతారా? యదార్థమును నమ్ముతారా? నీవే నిర్ణయించుకో.

**127) ప్రశ్న :- దిత్య అనగా రాక్షసుడు అని కూడా అర్థము కలదు. అట్లయిన అదితి పుత్రుడు అదిత్యుడు అనేది కూడా తప్పేయగును. సరైన అర్థము వివరింప ప్రార్థన. ఈ ప్రశ్నకు జవాబును, భావ పండితులకు కాకుండా భాషా పండితుల కొరకు చెప్పవలెను.**

**జవాబు :-** ఇంతకు ముందు 120వ ప్రశ్నలో భాషా పండితులకే వివరము చెప్పాము అక్కడ చూడండి.

**128) ప్రశ్న :- ఒక జీవిని నిర్వీర్యము చేసి వేరొక సూక్ష్మజీవిని చంపటమే యాంటిబయాటిక్ అని అంటున్నారు కదా! అంటే పెన్సిలిన్ నోటేటమ్ అనే శిలీంద్రజీవిని స్ట్రెప్టొకోకస్ అనే బాక్టీరియాను చంపుటకు ఉపయోగించాము. అదే పెన్సిలిన్ ఇంజక్షన్ మరి ఈ తరహా వైద్యము హోమియోపతియా, అల్లోపతియా, అందరిపతా అని నా సందేహము.**

**జవాబు :-** సద్ది అన్నము, దినము మారిన జొన్నరొట్టె, పెరుగు వీటన్నిటి యందు ఈస్ట్ పెరుగుట వలన ఈ ఆహారములు మనిషికి తెలియకుండానే వైద్యము అనిపించుకోకుండా మనిషికి మేలు చేయుచున్నవి. వీటిని అల్లోపతి, హోమియోపతి అని చెప్పుటకు వీలులేదు. అందువలన అందరిపతియని చెప్పడమే మంచిది. అలాగే అదే కోవకు పెన్సిలిన్ చెందియుండడము వలన అది వైద్యమయినా దానిని అందరిపతియని చెప్పుటే ఉత్తమము.

**129) ప్రశ్న :- ఎంత వారైనా 'కాంత దాసులే' ఇది వందశాతము వాస్తవము. స్త్రీలో అంత ఆకర్షణకు కారణమేమి?**

**జవాబు :-** స్త్రీలో ఆకర్షణ ఉందనుకోవడము పొరపాటు. పురుషునిలోనే ఒక విధమైన వత్తిడి, ఒక విధమైన బలహీనత రెండూ తోడైనప్పుడు

ఎంతవాడైనా కాంతదాసుడు కావలసి వస్తున్నది. శరీరములో ఆత్మే మనిషిని అలా అదేపనిగా బలహీనున్ని చేయుచున్నది. ఇదంతా పురుషునిలోని ప్రభావమే తప్ప స్త్రీలోని ఆకర్షణ ఏమీ లేదు.

**130) ప్రశ్న :- దైవజ్ఞానము ఎంతో గొప్పదని తెలియజేసేందుకుగానూ, అజ్ఞానుల కండ్లు తెరిపించుటకు గానూ, జ్ఞానులలో కొందరికయినా దూర శ్రవణమూ, దూరదర్శనమూ, గాలిలో నడువడమూ, అజ్ఞానులు జ్ఞానులను దూషించినా, దాడిచేసినా వారికి శిక్ష వేసే శక్తిలాంటివీ జ్ఞానులకు ఆత్మ ప్రసాదించవచ్చును కదా! అప్పుడు జ్ఞానశక్తి ప్రభావము తెలిసి అజ్ఞానులు కూడా జ్ఞానులుగా మారుటకు, తొందరగా జ్ఞాన ప్రచారము జరుగుటకు అనుకూలించును కదా!**

**జవాబు :-** దేవుడు భగవంతుడుగా వచ్చి తన ధర్మములను తెలియజేసి పోతే, శరీరములోని ఆత్మ మనిషిని కర్మ ప్రకారము నడుపుట వలన మనిషిని అజ్ఞానము వైపు తీసుకపోవుచున్నది. జ్ఞానము యొక్క విలువగానీ, తన ప్రాధాన్యతగానీ బయటికి తెలియకూడదని ఆత్మ తలచుచున్నది. ఆత్మ తలంపు ప్రకారము జ్ఞానశక్తి, జ్ఞానప్రభావము నీవు అడిగిన ప్రక్రియల వలన తెలియుటకు అవకాశముండుట వలన అవి ఏవీ లేకుండా కనిపించ కుండా చేసి తన ప్రభావమును కూడా కప్పిపుచ్చుకొని ఆత్మ శరీరములో యున్నది. వాస్తవము చెప్పితే దేవుడు జ్ఞానమును ధర్మ యుక్తముగా తెలియజేస్తే, ఆత్మ అజ్ఞానమును అధర్మయుక్తముగా బయటికి తెలియునట్లు చేయుచున్నది. జ్ఞానమును తాను (ఆత్మను) ఎవరికీ తెలియకుండా చేయునది. పూర్తి శ్రద్ధయున్న వానికే ఆత్మ తెలుపుటకు అవకాశము గలదు. శరీరములో అయినందున ఆత్మ అనుకొన్నవే జరుగును.

**131) ప్రశ్న :- ఏ పని చేయని వాడు, ఏ పని చేతగాని జీవుడు, గుణచక్రములో ఒక గుణ భాగమునుండి మరొక గుణభాగములోనికి ఎలా మారుచున్నాడు?**

**జవాబు :-** జీవుడు ఏదీ చేతకాని వాడు అని చెప్పుట వాస్తవమే. గుణచక్రములో గుణభాగములను మారు స్థోమత జీవునికి లేదు. జీవుడు స్వయముగా తనశక్తితో గుణ భాగములను మారడములేదు. గుణచక్రములో యున్న జీవున్ని గుణచక్రము పైన గల కర్మచక్రములోని కర్మ ఫోకస్ (కర్మ కిరణములు) జీవుని మీద పడి ఏ సమయములో ఏ గుణములో ఉండవలెనో కర్మే నిర్ణయించి జీవున్ని ఆ గుణములోనికి బలవంతముగా త్రోసి గుణ భాగములో ప్రవేశింపజేయుచున్నది. కర్మే జీవున్ని గుణ భాగములలో నడుపుచున్నది తప్ప జీవుడు స్వయముగా ఎక్కడికీ పోలేదు.

**132) ప్రశ్న :- 108 కోట్ల సంవత్సరముల సృష్టి కాలము అని చెప్పారు. అదియూ 12×9=108 అని చెప్పారు. ఇక్కడ ఒక గుణము తొమ్మిది భాగములుగా చీలియున్నదని చెప్పారు. ఇక్కడ తొమ్మిదే ఎందుకు పది భాగములుగా ఉండవచ్చును కదా! ఈ తొమ్మిది భాగములకు నవ గ్రహములకు సంబంధమున్నదా?**

**జవాబు :-** సృష్టికాలము 108 కోట్లని చెప్పిన మాట నిజమే. అది మనిషి తలలోని పన్నెండు గుణములు తొమ్మిది భాగములుగా చీలి యుండడమును బట్టి 12×9=108 అని చెప్పడము వాస్తవమే. అయితే సంఖ్యలో పెద్దది (9) తొమ్మిది మాత్రమే. ఆ తొమ్మిదినే పరమాత్మ గుర్తుగా చెప్పాము. మూడు (3) జీవాత్మ గుర్తుకాగా, ఆరు (6) ఆత్మ గుర్తుకాగా, తొమ్మిది (9) దేవుని గుర్తని చెప్పాము. దేవుని గుర్తు తొమ్మిది కావున, అదే పెద్ద సంఖ్య అగుట వలన దాని ప్రకారమే ప్రతి గుణము తొమ్మిది భాగములుగా

చీలిపోయినది. తొమ్మిది భాగములు సమానముగా చీలక పెద్ద భాగము నుంచి చిన్న భాగము వరకు క్రమేపీ సైజువారిగా యున్నవి. పన్నెండు గుణములు చీలడము వలన 108 సంఖ్య వచ్చినది. 108 సంఖ్యనే ప్రపంచ ఆయుష్షులా నిలిచినది.

**133) ప్రశ్న :- చిత్ర, మిత్ర గ్రహముల ప్రభావము జీవుని మానసిక కర్మకే పరిమితమైతే, అది బాహ్య ప్రపంచ జీవనానికి సంబంధము లేనప్పుడు జ్యోతిష్యములో వాటిని పరిగణించకపోతే నష్టమేమి లేనట్లే కదా?**

**జవాబు :-** మనిషి సుఖదుఃఖములను తెల్పునది జ్యోతిష్యము. మానసిక బాధ అయినా, శారీరక బాధ అయినా మనిషి సుఖ దుఃఖములలోనివే కదా! అటువంటప్పుడు రెండూ జ్యోతిష్యములోనికే వచ్చును. మనిషికి డబ్బులేని స్థితిని గురించి తెలుసుకొనుట శారీరక బాధకు సంబంధించినది కాదు కదా! అది మానసికమునకు సంబంధించిన విషయమే కదా! అందువలన మనిషి శారీరక మానసిక సుఖదుఃఖములను తెలియుటే సంపూర్ణ జ్యోతిష్యమగును.

**134) ప్రశ్న :- ఆనంద గురువుకు 'రామధర్మ రాజు కనకాభిషేకము చేసేనయా' అని వ్రాశారు. ఒకవేళ ఆనంద గురువు తెలిసినచో రామ ధర్మరాజు ఎవరై యుండవచ్చును. ఇంతకీ వీరబ్రహ్మము గారు ఎక్కడ పుట్టినట్టు?**

**జవాబు :-** ఇవన్నీ దైవ రహస్యములు వాటిని ఖచ్చితముగా ఎవరూ చెప్పలేరు. బ్రహ్మముగారు 1980లో పుట్టాడని తెలిసినది గానీ ఎక్కడ అను విషయము ఎవరికీ తెలియదు. వారు పుట్టియున్నా వారు ఎవరైనది వారికే తెలియని స్థితిలో యుందురని బ్రహ్మంగారి కాలజ్ఞానములోనే

వ్రాసియున్నారు. వారికే వారి పరిస్థితి తెలియనప్పుడు మనకు తెలియుట కష్టము.

**135) ప్రశ్న :- మేఘము దేవుని సైనికులలో పెద్ద భూతము కదా! మరి బాహ్యయజ్ఞములు చేసిన అనంతరము వర్షము వారు ఆశించినట్లుగానే కురియును కదా! యోగుల మాట మాత్రము వినగల మేఘములు వేద మంత్రములకు లొంగిపోవునా? ఈ విధముగా వారు యజ్ఞములను ప్రోత్సహించి మరింత అజ్ఞానములో పడిపోతున్నారు. దీనికి మీ సమాధానమేమిటి?**

**జవాబు :-** మేఘము యజ్ఞములకు సంతోషపడి వర్షించును అనుమాట అసత్యమని చెప్పవచ్చును. బాహ్య యజ్ఞములు అధర్మములని మేఘములకు బాగా తెలుసు. అందువలన యజ్ఞము వలన వర్షము వస్తుంది అనుమాట అభూత కల్పన. వర్షాకాలములో మేఘములకు ఇష్టమొచ్చిన చోట వర్షించును. ఒకవేళ వింటే యోగుల మాటను వినవచ్చును. అయితే యోగులు మేఘములకు పని చెప్పరు.

**136) ప్రశ్న :- జ్ఞానము ద్వారా కర్మలను నశింపజేయు సమర్థత గల రావణబ్రహ్మ గారు ఆర్యుడైన రాముని చేతిలో చనిపోయే కర్మను లేకుండా చేసుకొనియుంటే రామున్ని దేవునిగా వ్రాయవలసిన అవసరము వాల్మీకికి లేకుండా ఉండేది. తద్వారా రామున్ని కృష్ణున్ని ఏకం చేసే దౌర్భాగ్యము లేకుండా చరిత్రవుంటే ఈ గొడవలే ఉండక రావణుడు ఎవరో తెలిసేది.**

**జవాబు :-** జ్ఞానము వలన జీవితములో జరుగు దుఃఖములను జయించ వచ్చునుగానీ మరణమును ఎవరూ దాటలేరు. మరణము ఎప్పుడు రావాలో అప్పుడే వస్తుంది. ఎట్లు రావాలో అట్లే వస్తుంది. అది తెలిసిన యోగులు

మరణమును గురించి ఆలోచించరు. తమ జ్ఞానముతో మరణమును దాటవలెనని అనుకోరు. జ్ఞానము వలన తమ కర్మలను లేకుండా చేయవచ్చు, అట్లే ఇతరుల కర్మలను లేకుండా చేయవచ్చును గానీ తమ మరణమునుగానీ, ఇతరుల మరణమునుగానీ లేకుండా చేయు ప్రయత్నము చేయరు.

**137) "ఓం" ఏ భాషలోనిది?**

**జవాబు :-** స్వచ్ఛమయిన తెలుగు భాషలోనిది. మొదట పుట్టిన భాష తెలుగు భాష, తెలుగు భాషలో మొదట పుట్టిన అక్షరము "ఓం". అందువలన "ఓం" అను అక్షరమును ప్రథమ అక్షరమనియూ, ప్రణవ అక్షరమనియూ చెప్పుచుందురు.

**138) ప్రశ్న :- ఉంగరాలలో, హారాలలో దేవతామూర్తులను పెట్టి, వాటిని ధరించిన మనుషులు అజ్ఞాన పనులు, నీచమైన పనులు చేయుట వలన పాపము వచ్చునా? ఉంగరాలలోయున్న మూర్తులలో సూక్ష్మములు ఆవహించునా?**

**జవాబు :-** మూర్తులు ఎక్కడయున్నా వాటియందు సూక్ష్మములు ఆవహించుటకు అవకాశము గలదు. అయితే వాటిని ధరించి పనులు చేయడము వలన ప్రత్యేకించి పాపము వస్తుంది అనుట ఏమీ లేదు. మనిషి చేసే పనినిబట్టి ఉండే భావమునుబట్టి కర్మలు రావడము జరుగుచుండును.

**139) ప్రశ్న :- భారతదేశములో మొత్తము పదహారు గీతలు గలవు. మరి భగవద్గీతను వ్రాయకముందే ఆ గీతలను వ్యాసుడు వ్రాశాడు. అయితే గీత అంటే హద్దు అను అర్థముతో వాటిని వ్రాయలేదు. అట్లే భగవద్గీతను కూడా హద్దు అని వ్రాసియుండరు. గీత అంటే హద్దుయని వ్యాసునికి తెలుసా?**

**జవాబు :-** వ్యాసునికి తెలియకపోయినా తెలిసే వ్రాశాడు అని చెప్పవలెను. ఆయన వ్రాశాడు, ఆయన వ్రాసిన దానినిబట్టి నేడు ఆయన చెప్పకున్నా గీత అంటే హద్దు అని తెలిసినది. ఆయన వ్రాసిన విధానమునుబట్టి గీత అంటే హద్దు అని మనము చెప్పుచున్నప్పుడు బహుశా ఆయనకు ఈ విషయము తెలిసే యుంటుంది. అయితే కృష్ణుడు తన గీతను **'తౌరాతు'** అను పేరుతో ఇతరులకు చెప్పాడు. తన గ్రంథమునకు భగవద్గీతయని వ్యాసుడు నామకరణము చేసినా కృష్ణుడు భగవద్గీతను వేరే దేశములో మోషేకు (మూసాకు) ఇచ్చినప్పుడు భగవద్గీతయని చెప్పకుండా మూడు రాత్రులు అను అర్థముతో 'తౌరాత్' అని అన్నాడు.

**140) ప్రపంచ సృష్టికి కారణము ఏది?**

**జవాబు :-** దేవుని సంకల్పము.

**141) ప్రశ్న :- సాలగ్రామములను పరమాత్మకు చిహ్నముగా భావించ వచ్చునా?**

**జవాబు :-** సంఖ్యలో తొమ్మిదిని (9), శబ్దములో "ఓం"ను, దృశ్యములో లింగమును, ముద్రలో కాల కర్మ చక్రములను పరమాత్మగా భావించవలెను గానీ మిగతా దేనినీ పరమాత్మ చిహ్నముగా భావించకూడదు.

**142) ప్రశ్న :- దైవజ్ఞానమును గురువు చెప్పుచున్నప్పుడు సూక్ష్మగ్రహములు చేరి జ్ఞానమును వినును కదా! అదే విధముగా అదే జ్ఞానాన్ని ఒక జ్ఞాని ఇతరులకు తెలియజేయునప్పుడు దేవతలుగానీ సూక్ష్మగ్రహములుగానీ అక్కడ చేరగలవా? ఆ విధానము గురువువద్దనే జరుగునా? లేక ఇతరుల వద్ద కూడా జరుగునా?**

**జవాబు :-** శ్రద్ధగల సూక్ష్మశరీరములు దైవజ్ఞానమును ఎవరు చెప్పినా అక్కడికి పోయి వినగలరు. గురువువద్దనే వినవలెనను నియమము లేదు.

**143) ప్రశ్న :- వివాహములో జీలకర్ర, బెల్లము యొక్క విశిష్టత ఏమి?**

**జవాబు :-** ఆధ్యాత్మిక అర్థములలో దేనికిగానీ జీలకర్ర బెల్లము సరిపోదు. అయితే జీలకర్ర బెల్లమును కలిపి తలమీద పెట్టు సాంప్రదాయము హిందూ వివాహ వేదికలలో మొదటినుండి జరుగుచున్నది. ఆ విషయము వివాహము చేయు పెద్దలనే అడుగుట మంచిది.

**144) ప్రశ్న :- 108 మూలకములనే 108 పూసలుగా జపమాలలో ఉండునట్లు వివరించారు. మరి కెమిస్ట్రీ చార్ట్‌లో 112 మూలకములు కనుగొన్నట్లు గలవు. దీనికి మీ వివరణ ఏమి?**

**జవాబు :-** జపమాలలో 108 గుణములకు గుర్తుగా 108 పూసలను ఉంచినట్లు చెప్పాము. మిగతా వేరే సందర్భములో అప్పుడు 105 మూలకములే ఉన్నప్పుడు ఇంకో మూడు కనుగొనవచ్చును 108 సంఖ్యకు సరిపడు మూలకములు రావచ్చును అని చెప్పాము. అయితే అవి ఇప్పుడు 112 అయినట్లు మీ వలననే నేను వింటున్నాను. మూలకములు మొత్తము ఆధ్యాత్మిక సంఖ్యతో ముడిపడియుండును అను ఉద్దేశ్యముతో ఆ దినము అలా చెప్పాము. ఇప్పుడు 112 అయినందున ఇంకా ఎనిమిది పెరిగి 120 సంఖ్యకు పూర్తి కావచ్చును అని అనుకుందాము.

**145) ప్రశ్న :- కర్ణుని జీవితము శాపగ్రస్థమా?**

**జవాబు :-** కర్ణుని జీవితము శాపములతో నిండుకొనుటకు కారణము అతని ముందు జన్మ కర్మ ఫలితము అని తెలియుచున్నది. అందువలన ఆయన జీవితము కర్మగ్రస్థమేయని చెప్పవచ్చును.

**146) ప్రశ్న :- 'బీబీ నాంచరమ్మ కథ' వెంటటేశ్వరుని విషయములో జరిగిందా? అందుకే ముస్లీమ్‌లు వెంకటేశ్వరున్ని దర్శించుచున్నారా?**

**జవాబు :-** ముస్లీమ్‌లు వెంకటేశ్వరుని దర్శించడము నేను ఎప్పుడూ చూడలేదు. విగ్రహారాధనకు వారు చాలా దూరముగా ఉంటారు. ఇకపోతే 'బీబీ నాంచారమ్మ కథ' పూర్తి కల్పితము. దానిని నమ్మకూడదు, అసత్యము.

**147) ప్రశ్న :- గోవింద నామము ఎప్పటిది?**

**జవాబు :-** మనిషి వద్ద ఏమీ లేకుండా పోయినప్పటిదని బయటి అర్థముతో చెప్పవచ్చును. ఆధ్యాత్మికరీత్యా అయితే మనిషికి గల కర్మలన్నీ లేకుండా పోయినప్పుడు గోవింద నామము ఉచ్ఛరించబడుతుంది. ఎటు చూచినా ఏమీ లేని స్థితిని తెల్పునది గోవింద నామము.

**148) ప్రశ్న :- దేవతల వాహనముల మర్మము ఏమిటి?**

**జవాబు :-** మంత్రములతో నడిచేటివి దేవతల వాహనములు. మంత్రసిద్ధి వలన దేవతల వాహనము గాలిలో తేలిపోయేది.

**149) ప్రశ్న :- వేదాలలో సైన్సు అంతా వుంది అంటున్నారు, అది నిజమా?**

**జవాబు :-** శుద్ధ అబద్ధము. 'వేదాలలో మాయ వుందని' భగవద్గీత చెప్పుచున్నది. వేదాలలో సైన్సు ఏమాత్రము లేదు అని మేము అంటున్నాము. సైన్సుగలదని ఎవరయినా నిరూపించగలరా? నిరూపించలేరు. వేదాలలో మంత్రాలున్నాయి. మంత్రసిద్ధి కలదు. మంత్రసిద్ధి వలన కొన్ని పనులు జరుగును తప్ప అది ఏ కోణములోనూ సైన్సు కాదు.

**150) సృష్ఠి ఎందుకు జరిగింది?**

**జవాబు :-** దేవుడు సంకల్పించిన జగన్నాటకము జరగటానికి తప్ప

వేరుకాదు. అయితే అందరూ పాత్రలు మరచి ఆడుచున్నారు, కాదు ఆడింపబడుచున్నారు. జగన్నాటక నిర్మాత దేవుడయితే, దర్శకుడు ఆత్మ, పాత్రధారుడు జీవుడు. సన్నివేశములు కష్టసుఖములు, ముగింపు (శుభము) మోక్షము. ముగింపయిన మోక్షము రాదు. నాటకము అయిపోదు. ఆడించే దర్శకుడు ఆటను ఆపడు, పాత్రధారుడు తన్నుతాను మరచిపోయి నాటకములో లగ్నమయిపోయాడు. జీవున్ని జ్ఞప్తి చేయాలని పాత్రధారుని గానే ఆడమని చెప్పే ప్రయత్నములో అప్పుడప్పుడు జ్ఞాపకము చేయు జ్ఞానమును చెప్పినా వాడు వినే స్థితిలో లేడు. నిర్మాత చూస్తూ కూర్చున్నాడు. ఈ జగన్నాటకము ఇప్పుడే ముగిసేటట్లు లేదు.

## 151) ప్రశ్న :- అమీబా, మానవుడు ఒకేసారి జన్మించారా?

**జవాబు :-** జీవ పరిణామ సిద్ధాంతమును కనుగొన్న శాస్త్రవేత్తలు మొదట అమీబా అను ఏకకణ జీవి పుట్టిందని దాని తర్వాత పరిణామ క్రమములో అందరూ పుట్టారని చెప్పుచున్నారు. శాస్త్రవేత్తలు అన్న బిరుదును బట్టి అందరూ వారి మాటనే నమ్ముచున్నారు. మనిషికి అనగా జీవునికి ఏమీ తెలియదు అని ముందే చెప్పుకొన్నాము. మనిషిలోగల బుద్ధి ఏమి చెప్పితే దానిని మనిషి బయటికి చెప్పును. బుద్ధికి ఆత్మ అందించు విషయములే తెలియును. ఆత్మ అందించునదే సిద్ధాంతము. ఒక క్రొత్త విషయమును కనుగొనాలంటే ఆత్మ చెప్పితే మనిషికి తెలియుచున్నది గానీ మనిషి కనుగొన లేడు. ఆత్మ అందించిన దానిని తన బుద్ధి ద్వారా తెలియగా మనిషి తానే స్వయముగా కనుగొన్నానని చెప్పుకొనుచున్నాడు. మానవునికి సుఖములను అందించు నిమిత్తము కుట్టు మిషను మొదలుకొని ప్రతి యంత్ర నమూనాను లోపల ఆత్మ తెలియజేయగా, దానిప్రకారము చేసి బయట తయారయిన దానిని తానే కనుగొన్నానని చెప్పుకోవడము జరుగుచున్నది. ఈ విధముగా

కంప్యూటర్ల వరకు, ఆకాశములో వేగముగా పోవు రాకెట్‌ల వరకు, యుద్ధ రంగములో మిసైల్స్ వరకు కనుగొన్నాము. వాటిని వినియోగించుకొని బ్రతుకుచున్నాము. ఇన్ని యంత్రములను వాటి నమూనాను మనిషి బుద్ధికి అందించినవాడు మనలోని ఆత్మయని ఎవరూ అనుకోవడము లేదు. బయటి యంత్రములను ఎన్నో ఊహకు అందని వాటిని అందించిన ఆత్మ తన ఆధ్యాత్మిక విషయమును సక్రమముగా అందించడము లేదు. తాను అన్నీ చేయుచున్నా తాను ఎవరికీ తెలియబడకూడదని ఆత్మ అభిప్రాయము.

తనకు సంబంధించిన విషయములలో ముందే తప్పుదారి పట్టించి అందరి చూపు ప్రక్కకు త్రిప్పవలెనని ఆయన ఉద్దేశ్యము. అందువలన మొదటనే జీవపరిణామ సిద్ధాంతమును మనిషికి నేర్పినవాడు ఆత్మయే. తన విషయములో తప్పుదారి పట్టిస్తాడని చెప్పినట్లు మొదట మనిషి పుట్టలేదని, అమీబాలాంటి ఏకకణ జీవులు పుట్టాయని వాటి వలన పరిణామ క్రమములో మనిషి పుట్టాడని చెప్పుచుందురు. జీవపరిణామ సిద్ధాంతము అనునది తప్పు అని నేను గత నలభై సంవత్సరముల నుండి చెప్పుచున్నాను. మొదట మనిషి సృష్ఠింపబడ్డాడు. మనిషి తర్వాత చిన్న పెద్ద జీవులన్నీ పుట్టాయి. ఆ క్రమములోనే మనిషి పుట్టిన తర్వాత చాలా రోజులకు అమీబా క్రిమి పుట్టింది. అందువలన అమిబా మనిషి ఎవరు ముందు పుట్టారు అని అంటే మనిషియని చెప్పవచ్చును.

**152) ప్రశ్న :- దేవుడున్నాడని తెలిపేందుకు సృష్ఠి జరిగిందా?**

**జవాబు :-** కాదు దేవుని సృష్ఠి అంటే ఇలా ఉంటుంది అని అందరూ తెలియుటకు సృష్ఠి జరిగినది. సృష్టి జరిగిన తర్వాత సృష్ఠి ఎంత విచిత్రముగా యున్నదో కొంతకొంత ఇప్పుడిప్పుడే మనిషికి అర్థమగుచున్నది. కొందరికయితే ఏమాత్రము అర్థము కాలేదు.

**153) ప్రశ్న :- కర్మవలన జన్మవస్తే, ఏ కర్మలేని స్థితిలో సృష్ఠి జరిపి బలవంతముగా కర్మను అంటగట్టడము తెలివి తక్కువ పనికాదా?**

**జవాబు :-** పైకి తెలివితక్కువ పనిలాగనే కనిపించుచుండినా ఆలోచిస్తే ఎంతో ప్రణాళికాబద్ధముగా సృష్ఠిని దేవుడు తయారు చేశాడని తెలియుచున్నది. తాను పని చేయనప్పుడు మనుషుల సృష్ఠి జరుగుటకు కర్మను ఏర్పరచాడు. వాస్తవముగా కర్మలేని సమయములో మనిషిని తయారు చేయడము గొప్పపనిగా యున్నది. సృష్ఠి తర్వాత దేవుడు తన ధర్మము ప్రకారము పనిని చేయనివాడైనందున మనిషిని పుట్టించువాడు ఎవడూ లేడని, మనిషిని సృష్ఠించుటకు తనబదులు కర్మను అధిపతిగా పెట్టాడు. జన్మలు తిరిగి మరీమరీ కలుగుటకు కర్మయే కారణము. కర్మను అనుసరించి ఆత్మను పని చేయునదిగా దేవుడే తయారు చేశాడు. దేవుడు మనిషిని సృష్ఠించిన తర్వాత దేవుడు సృష్ఠించడము లేదు. కర్మనుబట్టి ఆత్మే మనిషిని తర్వాత జన్మలకు పంపుచున్నది. దేవుడు మనిషిని సృష్ఠించినందుకు ఆట ప్రకారము జీవితము కలదని తెల్పి ఆ కర్మ నుండి బయటపడుటకు కావలసిన జ్ఞానమును కూడా అందించాడు. అయితే దేవుని జ్ఞానమును మనిషి అందుకోలేకపోయాడు. దేవుడు చేసినది ఒక విధముగా అన్యాయము పనేయని చెప్పవచ్చును. మనిషికి తెలిసిన విధానములో మనిషిని సృష్ఠించడము దేవుని తప్పు అని తెలియుచుండినా, దేవుని వైపునుండి చూస్తే, దేవుని విధానము ప్రకారము దేవుడు చేసినది గొప్పపనియనీ, దేవుడు సృష్ఠించకపోతే నీవు అనేవాడివి లేకుండెడి వానివి కదా! నేడు నేనున్నానని నిన్ను నీవు తెలుసుకోగల్గుచున్నావు. నీ ఉనికి ఇదియని తెలియబడుచున్నది. నీవు అనేవాడివి ఒకడున్నావు అని తెలియుచున్నది. కష్టమో సుఖమో నీవు బ్రతికిన వాడిగా ఉన్నానని తెలియుట మంచిదా? లేవని చచ్చినవాడుగా యుండి నీ ఉనికి నీకు తెలియక భూమిలో రాయివలె ఉండడము మంచిదా

నీవే ఆలోచించుకో. సృష్ఠియున్నది కావున నేడు నీవు హీరోలాగాయున్నావు. సృష్ఠి లేకపోతే నీవు జీరోగా ఉండేవానివి. నీవు పుట్టినది మంచిదేయని పుట్టిన రోజు పండుగ చేసుకొంటున్నావు. ఒకవేళ పుట్టక పోయివుంటే నీకు పండుగే లేదుకదా! మంచిగా బ్రతికే దానికి దేవుడు పుణ్యమును కూడా ఇచ్చాడు. నీవు పుణ్యమే చేయి పుణ్యము వలన సుఖమును అనుభవించు. ఇవన్నీ చూస్తే సృష్ఠించిన దేవున్ని పొగడకుండా ఉండలేము. ఏదో ఒకటి మాట్లాడవలెననుకొంటే, దేవుడు బుద్ధి లేనివాడనీ మనకు బుద్ధిలేక చెప్పుచున్నాము. దేవునికి మనిషివలె బుద్ధియుండదని తెలియదు. అందువలన 'దేవునికి బుద్ధియుందా' అని అంటుంటాము.

**154) ప్రశ్న :- మీరు చెప్పిన జ్ఞానము సర్వజీవరాసులకని చెప్పినప్పుడు అమీబాలాంటి జీవులు ఎలా గ్రహించును?**

**జవాబు :-** మేము చెప్పు జ్ఞానము సర్వజీవరాసులకు వర్తించునని చెప్పిన మాట వాస్తవమే. వర్తించుట వాస్తవమే అయినా అందరూ గ్రహిస్తారని మేము కూడా చెప్పలేదు. జ్ఞానము అందరికీ సమానముగా వర్తించుటకే దేవుడు సృష్ట్యాదిలోనే జ్ఞానమును చెప్పడమైనది అయితే మనుషులు చెప్పేది జంతువులు, వృక్షములు, అమీబాలాంటి జీవులు గ్రహించలేవు.

**155) ప్రశ్న :- మీరు చెప్పిన గుణ వికార భాగములు 108, ఏకకణ జీవుల తలలో ఉండునా? వాటికి తలే లేదు కదా! మరి వాటిలో కాల కర్మ చక్రముల స్థానము ఎక్కడ గలదు? మొక్కలు, వృక్షములలో ఏడు చక్రముల స్థానము ఏది?**

**జవాబు :-** జీవరాసుల శరీర నిర్మాణములనుబట్టి, వాటి తెగలను బట్టి పుట్టుకలు అండజ, పిండజ, ఉద్భిజములు అను మూడు రకములుగా విభజించవచ్చును. అయితే వాటిలోనున్న అనేక విధానములనుబట్టి 84

లక్షల రకములుగా పెద్దలు విభజన చేశారు. 84 లక్షల రకములలో అన్నిటికి శరీర నిర్మాణము ఒకే రకముగా లేదు. వాటన్నిటిలో ఆత్మశక్తి నాలుగు విధముల ప్రవహించుచున్నది. వాటిని గురించి చెప్పుకుంటే కొన్ని వెన్నెముక లేనివి కూడా కలవు. కొన్నిటిలో నాడీవ్యవస్థ కనిపించదు. కొన్నిటి నిర్మాణమునుబట్టి ఎటూ చెప్పలేము. అవి ఎట్లున్నా వాటి శరీరములో జీవుడు ఉంటే, ఆత్మ కూడా ఉండును. ఆత్మయుంటే పరమాత్మ కూడా ఉండును. ఆత్మ ప్రవాహములు నాలుగు రకములు ఎట్లు గలవో సూచనప్రాయముగా తెలిస్తే ఇలా క్రింద చూపిన విధముగా కలవు.



ఈ విధముగా క్రిందికి ఆత్మశక్తి ప్రవాహముగా పోవు జీవులలో మనుషులు ఒక్కరు మాత్రము గలరు. మనుషులు పైనుండి క్రిందికి పెరుగు చున్నారు.



చిత్రములో చూపినట్లు శక్తి ప్రవాహము అడ్డముగా ప్రవహించుచుండును. అటువంటి జీవులు భూమిమీద అన్నిటికంటే ఎక్కువ సంఖ్యలో గలవు. పశువులు, జంతువులే కాక, చేపలు మొదలగునవి కలవు. ఈ రకము జీవులు అడ్డముగా పెరుగుచుండును.



ఈ రకముల ప్రవాహము గల ప్రాణులు వృక్షములు, చెట్లు, తీగలు మొదలగునవి కలవు. ఈ రకము జీవులు క్రింది నుండి పైకి పెరుగునవి కలవు.



పక్షుల జాతులలో ఏటవాలుగా శక్తి ప్రవహించుచుండును. ఇవన్ని పక్షి జాతులే అయి వుండును. ఈ రకము జీవులు పెరగడము పై నుండి క్రిందికే అయినా మనుషులవలె కాకుండా ఏటవాలుగా పెరుగుచుండును.

ఈ విధముగా పెరగడములో నాల్గు రకములుగాయుండు జీవరాసులలో జ్ఞానము అన్నిటికీ సమానమే. మన శరీర విషయమే మనకు సంపూర్ణముగా తెలియనప్పుడు వాటి విషయము తెలియదనియే చెప్పవచ్చును. దేవుడు చెప్పిన జ్ఞానము జీవముగల అన్నిటికీ వర్తించును. దేవుడు జీవున్ని ఆత్మను గురించి చెప్పడము వలన జీవాత్మ, ఆత్మలు అన్ని శరీరములలో ఉండుట వలన, శరీర నిర్మాణములనుబట్టి చెప్పకపోవడము వలన దేవుని జ్ఞానము అన్ని జీవులకు వర్తించునని తెలియుచున్నది. కాల కర్మ చక్రములు, గుణ భాగములు ఫలానా చోట ఉన్నాయని చూపలేము. అట్లే గుణ విభాగములు ఎక్కడున్నాయని కూడా చెప్పలేము. మనము చెప్పినా, చెప్పకున్నా వాటిలో మనకున్నవే యుండును. మనకు చెప్పిన జ్ఞానమే వాటికి సరిపోవును.

**156) ప్రశ్న :- ఏడు గ్రంథులు, ఏడు నాడీకేంద్రముల జ్ఞానము మానవులకే వర్తిస్తే సర్వజీవులకు భగవద్గీత ఎట్లు వర్తించును?**

**జవాబు :-** ఇతర జీవరాసుల శరీరములలో ఏడు నాడీకేంద్రములు లేకున్నా, ఏడు గ్రంథులు లేకున్నా వాటికి తగిన విధముగా నిర్మాణము చేయబడి యుండును. ఆధ్యాత్మిక జ్ఞానమంతయూ **జీవుడు, ఆత్మ, దేవుడు** అను ముగ్గురు పురుషుల మీద ఆధారపడియుండుట వలన భగవద్గీత జ్ఞానము అందరికీ అర్థమగును, అందరికీ వర్తించును.

**157) ప్రశ్న :- వృక్షములలో క్రెస్కోగ్రాఫ్ అనే పరికరము ద్వారా మొక్కల భావాలను నమోదు చేయుచున్నారు. నొప్పిని జీవుడు అనుభవించునట్లు చేయు ఆత్మ బయట గురువు చెప్పు జ్ఞానమును చెట్లలో యున్న జీవునికి అందజేయునా? లేక చెట్లే స్వయముగా గ్రహించుచున్నవా? ఏకకణ జీవిలో కూడా ఆత్మే జ్ఞానమును అందించునా? లేక స్వయముగా అవే తెలియగలవా?**

**జవాబు :-** చెట్లకు సుఖములు, కష్టములు, బాధలు, సంతోషములు ఉండుట వాస్తవమే. వాటిని ఆత్మే అందించుచున్నది. ఆత్మ లేనిది ఏదీ ఏ జీవరాసికి అందదు. ఏ శరీరములో జీవికయినా సుఖదుఃఖముల నయినా, జ్ఞానమునయినా ఆత్మే అందివ్వాలని, అట్లు కాకపోతే ఏ జీవికి ఏదీ అందదని తెలియుచున్నది. ఏకకణ జీవికయినా, బహుకణ జీవికయినా ఆత్మవలననే అన్నీ జరుగును.

**158) ప్రశ్న :- జంతువులలో ఏది లోపించుట వలన మాట్లాడలేక పోతున్నాయి?**

**జవాబు :-** మనిషి మాట్లాడుచున్నాడు, జంతువు మాట్లాడలేదు. అయినా మనిషికి వచ్చిన లాభము లేదు. జంతువుకు వచ్చిన నష్టము లేదు. మనిషి జంతువులకంటే ఎక్కువ పాపము చేసుకొన్న దానివలన మనిషి మాట్లాడు చున్నాడు. మాట్లాడుట వలన తిరిగి పాపమునే సంపాదించుకొనుచున్నాడు. ఇంకా కొందరు గత పాపముకంటే ప్రస్తుత పాపమునే ఎక్కువ సంపాదించు కొనుచున్నారు. ఉదాహరణకు చెప్పితే గతములోని ఒక రూపాయి పాపమును మాటల రూపములో మాట్లాడినా కొందరు దానికి తగిన రూపాయి పాపమునే పొందవచ్చును. లేకపోతే దానికంటే ఎక్కువ విలువయిన పుణ్యమును కూడా పొందవచ్చును. రూపాయి పాపమును మాటల రూపములో పది నిమిషములు మాట్లాడవలసియున్నప్పుడు ఆ

మాటలు మంచివయితే పుణ్యము రావచ్చును. అదియూ రూపాయి పుణ్యము నుండి పదివేల రూపాయలంత పుణ్యము రావచ్చును. అట్లుకాకపోతే పాపము కూడా రావచ్చును. పాపము ఒక రూపాయి నుండి పదివేల రూపాయలంతా రావచ్చును. ఇక్కడ కొలతలు తెలియుటకు 'రూపాయి' పదమును వాడాము అని తెలియవలెను. ఇంకొక విషయమేమనగా! దేవుని విషయముగానీ, దేవుని జ్ఞాన విషయముగానీ చర్చకు వచ్చి వ్యతిరేఖముగా మాట్లాడితే, కొన్ని లక్షల రూపాయల విలువగల పాపము సంభవించవచ్చును. కొందరు గురువులను మాటలతోనే దూషించుచున్నారు. కొందరు దేవున్ని కూడా మాటలతోనే హేళనగా అగౌరవముగా మాట్లాడు చున్నారు. దానివలన కొన్ని జన్మలకు సరిపడు కర్మను సంపాదించు కొంటున్నారు. ఇప్పుడు చెప్పండి మాటలు వచ్చు మనుషులు గొప్పా, మాటలు రాక ఏ పాపము సంపాదించుకోని పశువులు గొప్పా?

**159) ప్రశ్న :- దేవుని జ్ఞానము గ్రహించలేని జంతువులను ఉత్తమ జీవులుగా చెప్పారు. మోక్షము పొందాలంటే మానవజన్మే సులభమని కొందరు చెప్పారు. కర్మలు పాపము ఎక్కువగుట వలన దేవుని జ్ఞానము గ్రహించలేని జంతు, వృక్ష, క్రిముల జన్మవస్తుందా? పుణ్యము ఎక్కువ అగుట వలన మానవ జన్మవస్తుందా? ఈ కోణములో జంతువులు దేవునికి దగ్గరగా ఎక్కడ గలవో వివరించగలరా?**

**జవాబు :-** జంతువులుగానీ, వృక్షములుగానీ దేవుని జ్ఞానము గ్రహించ లేవని నేను ఎప్పుడూ చెప్పలేదు. అట్లే మానవ జన్మలోనే మోక్షము పొందుటకు సులభమని కూడా చెప్పలేదు. చాలామార్లు మానవులకంటే ఉత్తమ జన్మలు జంతువులు, వాటికంటే ఉత్తములు పక్షులు, ఆ రెండింటికంటే ఉత్తములు వృక్షములని చెప్పడము జరిగినది. ఎక్కువ పాపము చేసినవారే

మనిషిగా పుట్టునని కూడా చెప్పాము. పాపమును అనుభవించడములో పశు, పక్షి, వృక్ష, లతాదులకంటే మనిషే ముందున్నాడని, పాపముల అనుభవమునుబట్టి మనుషులకంటే మిగతా జంతువృక్షములే దేవునికి దగ్గరగాయున్నాయి అని చెప్పాము. దేవునికి దగ్గర అంటే అది కనిపించు విషయము కాదు కదా! దేవుని జ్ఞానము గ్రహించడములో జంతు, వృక్షములకు చేతకాదని, గ్రహించుకోలేవని కూడా మేము చెప్పలేదు. మనుషులు జ్ఞానము చెప్పితే మనుషులే గ్రహించవచ్చునుగానీ, జంతువులు గ్రహించలేవు అనుమాట వాస్తవమే. అయితే జంతువులు గ్రహించునట్లు దైవ జ్ఞానమును వాటి భాషలోనే చెప్పు గ్రహములు ప్రత్యేకముగా ఉన్నాయి. మనుషుల భాషలో సూర్యుడు చెప్పినట్లు జంతువుల భాషలో కుజ గ్రహము చెప్పగలదని మా భావము.

**160) ప్రశ్న :- చేమంతి, మల్లెలాంటి మొక్కలకు అంటుకట్టేటప్పుడు కొమ్మను భూమిలోనికి చొప్పించి పిదప తల్లిమొక్క నుండి కొద్దికొద్దిగా ఖండిస్తూ వేరు చేసెదరు. అప్పుడు క్రొత్త అంటుకు వేర్లు వచ్చి కొమ్మ బ్రతుక గలదు. అలా బ్రతికిన కొమ్మలోనికి ఇంకొక జీవుడు చేరినట్లా లేక మొదటి తల్లి మొక్కలోని ఆత్మయే క్రొత్త మొక్కలో పూలు, కాయలు వచ్చేటట్లు చేయుచున్నదా?**

**జవాబు :-** అంటుగట్టిన క్రొత్త మొక్కలోనికి క్రొత్త జీవుడు వచ్చి చేరవలసిందే. ఆత్మ మాత్రము అందరిలో, అన్ని చెట్లలో ఒక్కటే యుండుట వలన తల్లి చెట్టులోని ఆత్మే క్రొత్త మొక్కలోనికి కూడా వచ్చినదని చెప్పవచ్చును. అప్పుడు చెట్టులో జీవాత్మ, ఆత్మ రెండు ఉండినట్లగును.

**161) మందారములాంటి మొక్కల కాండమునుండి వచ్చిన కొమ్మను ఖండించి భూమిలోనికి పాతగానే వెంటనే మొక్క వాడిపోదు. తర్వాత**

**వాడిపోయి మరల చిగురించును. కొన్ని కొమ్మలు చిగురించవు. అందులో జీవుడు చేరక పోవడము వలన అట్లా జరిగిందా?**

**జవాబు :-** జీవుడు చేరలేని దానివలననే అలా జరిగింది.

**162) ప్రశ్న :- మహా అవతార్ బాబాజీగారు జ్ఞానియా, యోగియా? ఆయనకు త్రైత సిద్ధాంత జ్ఞానము తెలియునా?**

**జవాబు :-** అవతార్ బాబాజీగారు జ్ఞానియూ, యోగియూ కావచ్చును. అయితే త్రైత సిద్ధాంత జ్ఞానము ఇక్కడినుండే మొదలగుట వలన మధ్యాత్మ విషయము ఆయనకు తెలియదనియే చెప్పవచ్చును.

**163) ప్రశ్న :- రావణబ్రహ్మ ఫోటోలో మీరే కనిపిస్తున్నారు. అయితే మీరే రావణబ్రహ్మ అని అనుకోవాలా?**

**జవాబు :-** అలా ఎందుకు అనుకోవాలి. రావణబ్రహ్మ చిత్రము కొరకు నా ఫోటోకు కంప్యూటర్‌లో ఆభరణములు తగిలించి తయారు చేసిన చిత్రము. వేషధారణ నా ఫోటోదే అయినంత మాత్రమున నేనే రావణ బ్రహ్మను అని నేను చెప్పకూడదు. మీరు అలా అనుకోకూడదు. రావణ బ్రహ్మ అన్ని విధముల గొప్ప వ్యక్తి ఆయనతో పోల్చుకొంటే మనదే తప్పగును.

**164) ప్రశ్న :- అందరి స్వామీజీలవలె మీరెందుకు టీ.వీలలో కనిపించరు?**

**జవాబు :-** గాడిద పోయి గుర్రాల గుంపులో కలియకూడదు. అలాగే గుర్రము పోయి గాడిదల గుంపులో కలియకూడదు. రెండూ తప్పే అందువలన నేను ఏ టీ.వీలలో కనబడను.

**165) ప్రశ్న :- "దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు" అను గ్రంథములో మీ ముఖమును చూచిన సూక్ష్మగ్రహములు తలదించుకొన్నట్లు**

**గలదు. దయచేసి మీ కన్నులలో ఏమి కనిపించియుండవచ్చును. హేతువాద మైన మా ప్రశ్నకు జవాబు చెప్పగలరు?**

**జవాబు :-** సూక్ష్మగ్రహములు నాతో దురుసుగా మాట్లాడిన వారిని నావైపు చూడమని చెప్పినది వాస్తవమే. వారు చూడలేక తలదించుకొన్నది వాస్తవమే. అయితే వారికి ఏమి కనిపించినది నాకు కూడా తెలియదు. నేను కూడా వారు ఎందుకు చూడలేక తలదించుకొంటున్నారను ప్రశ్న వచ్చి వారినే నేను అడగడము జరిగినది. అప్పుడు వారు ఐదు సెల్‌ల టార్ఛ్‌లైట్ కళ్ళలోనికి వేస్తే ఎలా చూడలేమో అలా అయినదనీ, రెండు కళ్ళు అగ్ని గోళములాగ చూడ శక్యము కాకుండా కనిపించాయని చెప్పారు. వారి అనుభవమును వారు చెప్పారు. అప్పుడు ఇదంతయూ ఆత్మ వలన జరిగిన పనేయని నేను అనుకొన్నాను.

**166) ప్రశ్న :- మూడవ మారు వచ్చిన భగవంతున్ని ఎవరైనా గుర్తించ వచ్చునా?**

**జవాబు :-** రాకనే వచ్చాడని ఎందుకు అనుకోవాలి? అలా మూడవ మారు భగవంతుడు వస్తే ఆయనను నేరుగా ఎవరూ గుర్తించలేరు.

**167) ప్రశ్న :- నూరు తప్పులు చేసిన శిశుపాలుడిని కృష్ణుడు సంహరించెను. అలా చంపడము దుష్ట శిక్షణ అని కొందరు అంటున్నారు. మరి ఏ గుణములో యున్నవారు చనిపోయిన తర్వాత ఆ గుణములోనే జన్మిస్తారు అని తెలిపిన కృష్ణుడు దుష్టశిక్షణగా వారిని ఎందుకు చంపెను?**

**జవాబు :-** ఏ గుణములో చనిపోయిన వాడు అదే గుణములో పుట్టగలడు. అందువలన దుర్మార్గున్ని చంపితే దుష్ట శిక్షణ జరుగదు. దుర్మార్గులను సన్మార్గులుగా మార్చుటకు వారికి జ్ఞానమును బోధించి మంచి మార్గములోనికి

మార్చవలెను. దుష్టులకు జ్ఞానమును బోధించు శిక్షణను ఇచ్చుటను దుష్ట శిక్షణ అందురు. శిక్షణ అనగా నేర్పించడము (ట్రయినింగ్) అని చెప్పవచ్చును. పోలీస్ శిక్షణ అనగా సాధారణ మనుషులను పోలీసులుగా తర్ఫీదు చేయడము. శిక్షణ అనగా నేర్పించడము. దుష్టులకు సన్మార్గులుగా మార్చు శిక్షణను దుష్ట శిక్షణ అని అంటున్నారు. వాస్తవముగా "సన్మార్గ శిక్షణ"యని చెప్పవలసి వలసియుంది. అయినా అలవాటు ప్రకారము దుష్టశిక్షణ అని అంటున్నారు. అట్లు చెప్పడమును దుష్టులను శిక్షించుట అని అనుకొంటున్నారు. ఇంకా దుష్టులను చంపి లేకుండా చేయుట అని కూడా అంటున్నారు. అది అసత్యము. అట్లు చేయుట వలన భగవద్గీతలో చెప్పినట్లు చనిపోయిన వాడు తిరిగి అదే గుణములలో పుట్టగలడు. అందువలన దుష్టులను చంపినా ఏమీ ప్రయోజనము లేదు. వారి వలన సమాజము ఇబ్బంది పడుచుండును. అందువలన దుర్మార్గులను చంపుట కంటే వారిని సంస్కరించడము మంచిది. అయితే శిశుపాలున్ని కృష్ణుడు చంపడము వాస్తవమే. అయితే అదియంతయూ ప్రపంచ సంబంధముగా జరిగిన వ్యవహారము. శిశుపాలుడు మొదలగువారు జ్ఞానమును చెప్పినా వినరను ఉద్దేశ్యముతోనే చంపవలసి వచ్చిందని అనుకొంటాను.

**168) ప్రశ్న :– దయ్యముగా మారిన మనిషి వారి పుత్రులు చేయు శ్రాద్ధాది కర్మలను స్వీకరించునా? శ్రాద్ధాది కర్మలు చేయని వారిమీద దయ్యాలుగా యున్న వారి పెద్దలు కోపగించుకొందురా? లేక వారి దారిన వారు పోవుదురా?**

**జవాబు :–** పితృలు దయ్యములుగా మారినవారు వారి కొడుకులు చేయు శ్రాద్ధాది కర్మలను స్వీకరించుచుందురు. అయితే కొందరు పుత్రులు శ్రాద్ధ కర్మలు చేయకపోతే ఎందుకు చేయలేదని అడుగు వారు కూడా కలరు?

మేము సంపాదించిన ఆస్తిని మీరు తినుచూ మాకు గుడ్డలు, ఆహారము ఎందుకు పెట్టరని వాదించు పితృలు కూడా కలరు. కొందరు తమ పుత్రులను ఏమీ అనలేక మౌనముగా ఉన్నారు.

**169) ప్రశ్న :- "మత్తః స్మృతి, జ్ఞాన, మపోహనంచ" అనే పురుషోత్తమ ప్రాప్తి యోగములోని శ్లోకములో జ్ఞానము కూడా తనవలెనే కల్గుచున్నది అని అన్నప్పుడు, జ్ఞానమును కొందరికే ఇస్తాను అన్నట్లున్నది. మరీ మీరేమో "శ్రద్ధవాన్ లభతే జ్ఞానమ్" శ్రద్ధ వలననే జ్ఞానము లభించును అని చెప్పుచున్నారు. రెండిటిలో ఏది వాస్తవము?**

**జవాబు :-** రెండు వాస్తవమే. నా వలన జ్ఞానము కల్గును అనుమాట నిజమే. ఆత్మ వలననే బుద్ధికి జ్ఞానము గ్రహించు శక్తి రాగలదు. అయితే శ్రద్ధయున్న వానికే ఆత్మ జ్ఞానమును గ్రహించుశక్తిని ఇచ్చును. శ్రద్ధ లేనివానికి ఆత్మ బుద్ధికి జ్ఞానమును ఇవ్వదు. జ్ఞానమును గ్రహించుశక్తి ఇవ్వదు.

**170) ప్రశ్న :- 250 మార్లు 4 యుగములు గడచితే 1000 యుగములు అయిపోయి ప్రపంచ అంత్యమగును కదా! మరి ఇప్పటి కలియుగము ఒకటవదా లేదా 230వ దా లేక 1వ సారి మాత్రమే గడచుచున్నదా? చాలా కలియుగములు గడిస్తే ఇప్పటికి భగవంతుడు ఎన్నోమార్లు వచ్చి యుండాలి కదా! అలా అయితే ఇప్పటికి జరిగిన 250 ద్వాపరయుగములలో 250 మంది కృష్ణులు జన్మించినట్లా? ఈ సందిగ్ధతను వివరించగలరా?**

**జవాబు :-** నాలుగు యుగములు 250 మార్లు గడిస్తే ఒక బ్రహ్మ పగలు అని అర్థము. అలాగే వేయి యుగములు గడిస్తే దేవునికి ఒక రాత్రి గడచినట్లగును. అయితే కలియుగము ఇప్పటికి ఎన్నిమార్లు గడచినది యని ఎవరూ ఆధారపూర్వకముగా చెప్పడము లేదు. కొందరు 17 మార్లు

గడచినదని 17వ కలియుగమని చెప్పుచున్నారు. అట్లు చెప్పుటకు పూర్తి సాక్ష్యము ఏమీ లేదు. ఒక కలియుగములో కృష్ణుడు వచ్చి భగవద్గీత చెప్పితే మిగతా కలియుగములలో కృష్ణుడు వస్తాడు అనుకోవడము పొరపాటు. కాలగమనమునుబట్టి ఒక శుక్రవారము గడియారము కొన్నామనుకోండి. తర్వాత శుక్రవారం గడియారము కొనము కదా! అలాగే ఒక కలియుగములో దేవుడు భగవంతునిగా పుట్టి భగవద్గీతను చెప్పితే తర్వాత కలియుగములో భగవంతుడు పుట్టవలెననిగానీ, భగవద్గీతను చెప్పవలెననిగానీ ఏమీ ఉండదు. నా ఉద్దేశ్యము ప్రకారము ఇదే మొదటి మారని చెప్పుచున్నాము. అందువలన జ్ఞానము కూడా ఇప్పుడే తెలిసినది. తర్వాత రాబోయే యుగము రెండవమారు వచ్చు కృతయుగమని చెప్పవచ్చును.

**171) ప్రశ్న :- పరకాయ ప్రవేశ విద్యలో జీవుడు, ఆత్మ రెండు శరీరమును విడిచి పెట్టునట్లుగా యున్నది. ఏ మానవుడు తన శరీరమును వదలి పెట్టి బయటికి పోయి తర్వాత తిరిగి వచ్చి అదే శరీరములోనికి చేరుటకు అవకాశమే లేదు కదా! ఆ అవకాశము విగ్రహాలలో ఉండేవారికే మాత్రమే కలదని చెప్పారు. మరి పరకాయ విద్యలో జీవుడు, ఆత్మ ఇద్దరూ వదలి పోయిన శరీరములోనికి ఎట్లు చేరగలుగుచున్నారు? అది సాధ్యమయ్యే పనియేనా?**

**జవాబు :-** పరకాయ ప్రవేశ విద్యను నేర్చుటకు పన్నెండు (12) సంవత్సరముల కాలము పట్టును. అలా నేర్వగలిగినవాడు తన శరీరమును వదలి ఆత్మ జీవాత్మ బయటికి వచ్చి వేరే శరీరములో చేరడమును అభ్యాసము చేసియుందురు. అయితే ఇక్కడ గమనించవలసిన విషయము ఒకటి గలదు. ఒకమారు జీవుడు శరీరమును వదలి బయటికి వచ్చిన తర్వాత వదలిన శరీరములోనికి తిరిగి ప్రవేశించుటకు వీలుకాదు. అటువంటప్పుడు

ఈ అభ్యాసము ఎందుకు? అను ప్రశ్న రాగలదు. దానికి జవాబుగా ఇట్లు చెప్పవచ్చును. శరీరములో ఐదు ఉపవాయువులను వదలి శరీరమును విడిచిపోతే పూర్తిగా వదలినట్లు కాదు. అందువలన పరకాయ ప్రవేశ విద్యలో ఉప వాయువులను శరీరములో వదలి బయటికి రావడము, తిరిగి అదే శరీరములోనికే చేరడము జరుగుచున్నది. ఈ సాధన పన్నెండు (12) సంవత్సరములు చేసిన తర్వాత ధైర్యముగా పరకాయ ప్రవేశ విద్య నేర్చినామని చెప్పవచ్చును. ఉపవాయువులను వదలకుండా జీవుడు బయటికి వస్తే తిరిగి ఆ శరీరములోనికి ప్రవేశించుటకు వీలుపడదు.

**172) ప్రశ్న :- సూర్య చంద్ర గ్రహణ సమయములో దర్భగడ్డిని ఆహార పదార్థములలో వేస్తారు. బహుశా గ్రహణ సమయములో వచ్చే సూర్య, చంద్ర కిరణాలలో ఉండే దోష కిరణాలను నిర్వీర్యము చేసే గుణము మూలికకు (దర్భగడ్డికి) కలదా?**

**జవాబు :-** దర్భలకు కొంత ప్రత్యేక నిరోధక శక్తి కలదు. అందువలన గ్రహణ సమయములో దర్భను వాడవచ్చును.

**173) ప్రశ్న :- పెళ్ళి బృందాల వాహనాలు, తీర్థయాత్రలకు బయలుదేరిన బస్సుల ప్రమాదముల వెనుక దేవుని సైనికులవలె పని చేయుచున్న భూతముల, గ్రహముల ప్రభావము కలదని మీరన్నారు. మేము అజ్ఞానులని వారికే తెలియని వారిని జ్ఞానము తెలియక మునుపే చంపివేసిన గ్రహముల చర్య తొందరపాటు అగును కదా! 'అజ్ఞానులుగా చనిపోయినవాడు, మరల అజ్ఞానులుగా పుట్టుదురను' సూత్రమును చెప్పి దేవుడు వారిని ఎందుకు వారించలేదు. వారి మరణానికి కారణము జ్ఞానులకు తెలుసు, కానీ వారిని అలా చంపడమునకు కారణమును వారికి తెలియచేయక చంపివేయడము ఎంత వరకు సమంజసము?**

**జవాబు :-** సమంజసమో, అసమంజసమో గ్రహములు, భూతములు ఆలోచించరు. తప్పుకు తగిన శిక్ష వెంటనే చూపాలనునది వారి భావము. అత్యాచారము చేయువానిని దొరికిన వెంటనే కొట్టుదురు. అప్పుడు వానిని ఎందుకు కొట్టాలి, వానికి తెలియక అత్యాచారము చేశాడని అనుకోము. అలాగే సాంప్రదాయరహితముగా, జ్ఞానము లేకుండా పెళ్ళి చేయువారిని దేవున్ని ఏమాత్రము అనుకోక దేవతలను ఆరాధించుటకు తీర్థయాత్రలకు పోవువారు భూతముల గ్రహముల లెక్కలో బయట అత్యాచారము చేయు వారికంటే పెళ్ళి, దేవతల దర్శనార్థము పోవువారు ఇంకా దుర్మార్గులుగా కనిపించియుందురు. అందువలన వెంటనే వారిమీద చర్యగా రోడ్డు ప్రమాదములను కలుగజేయుచున్నారు.

**174) ప్రశ్న :- ఆహారమును తీసుకోకపోయినా ప్రహ్లాద్ జానీ శరీరములో శక్తిని ఇచ్చిన ఆత్మ మత్తు పదార్థములు తీసుకొన్న వ్యక్తిలో ప్రభావితుడు కావటము, తద్వారా బలహీనుడై పోవడము విచిత్రముగా వుంది.**

**జవాబు :-** ఆత్మ శక్తితో కూడుకొన్నవాడు. ఆత్మే చైతన్యముగా యున్నది. అటువంటి ఆత్మ బలహీనము కావడము లేదుగానీ, మత్తు పాణీయములను స్వీకరించిన వారికి తనశక్తిని ఇవ్వను అని చెప్పుచున్నది. తానే బలమై యున్ననూ, నా ఆత్మ తన బలమును త్రాగిన వానికి ఇవ్వను అని చెప్పడమునకు కారణము మత్తు పాణీయములంటే ఆత్మకు సరిపోదని తెలియుచున్నది. త్రాగిన వానికి మత్తు మెదడునందు చేరుట వలన మెదడు నుండి ప్రారంభమగు ఆత్మకు మత్తు మెదడును చేరియుండుట వలన తన గౌరవమునకు భంగము ఏర్పడుచున్నది. తాను అనుభవింపచేయు కర్మలను జీవుడు పూర్తిగా అనుభవించకుండా మత్తులోనికి చేరిపోవుట వలన జీవుడు అనుభవించు స్థితిలో యుండడు. అందువలన కర్మ అమలు చేయు ఆత్మకు

ఆటంకముగా యుండుట వలన త్రాగిన వానికి తన చైతన్యమును ఇవ్వను అని అన్నాడు. అందువలన త్రాగిన వానికి బలము లేకుండా ఉండును. త్రాగిన మనిషికి బలము లేకుండుట వలన వానిని చిన్నపిల్లవాడు కూడా కొట్టగలడు. మత్తు త్రాగినవానికి ఆత్మ చైతన్యమును (బలమును) ఇవ్వకపోవడము వలన త్రాగినవాడు నడువ లేక క్రింద పడి పోవును. ఈ విషయము అందరికీ తెలిసినదే.

**175) ప్రశ్న :- పశు, పక్షి, వృక్ష, లతాదులలో బుద్ధి, చిత్తము, అహము, మనస్సు మనుషులలోవలె విధులను నిర్వహించునా?**

**జవాబు :-** వేరు వేరు జాతుల జీవరాసులలో వాటి నిర్మాణము వేరుగా యుండును కానీ పనులు మాత్రము అన్ని మనుషులలోవలె చేయును.

**176) ప్రశ్న :- మూలికా వైద్యములో గుణ ప్రేరణ చేయు ఆహారమును గురించి వ్రాయబడినది. కానీ ఆహారము వలన కామప్రకోపము జరుగదు అని మీరు అంటున్నారు. ఆహారము మానసిక స్థితిపైన ప్రభావము చూపదా?**

**జవాబు :-** మూలికా వైద్యములో ఆహారము వలన గుణ ప్రేరణ జరుగును అని వ్రాసియుండుట నేను కూడా చూచాను. "వస్తు గుణదీపిక" అను గ్రంథములో వంకాయను తింటే ఈ ఫలితముండును, తొండకాయను తింటే ఈ ఫలితము, చింతకాయను తింటే ఈ ఫలితము అని సాధారణముగా వ్రాశారు. వంకాయను తింటే నొప్పులు వచ్చును అని ఉందనుకో అది అందరిలో నొప్పులు రావడము లేదు. వ్రాసినట్లు కొందరిలో మాత్రము వాయు నొప్పులు వస్తున్నవి. అలాగే అని ఔషధములు చెప్పినవి చెప్పినట్లు పని చేయడము లేదు. అయితే ఔషధములు కొందరిలో పని చేయడము

కొందరిలో పని చేయకపోవడము ఏమిటి? అని ఆలోచిస్తే మూలికలు, ఔషధములు, ఆహారములు వాటివాటి పనిని అవి చేస్తున్నవి. అయినా శరీరములో యుండే ఆత్మ వాటిని ఎంతవరకు అనుమతించాలో అంతవరకే అనుమతించుట వలన, అంతవరకే అవి శరీరములో ఉపయోగపడుచున్నవి. జీవుళ్ళ కర్మనుబట్టి ఆత్మ అనుమతియుండుట వలన అనుమతి ప్రకారమే శరీరములో కొందరిలో ఎక్కువగా, కొందరిలో తక్కువగా ఉపయోగ పడుచున్నవి. మనిషిలో ఆత్మ అందించు నిరోధకశక్తి వలన ఆహారములు గానీ ఔషధములుగానీ పనిచేయడము జరుగుచున్నది. ఉదాహరణకు సారాయి మత్తును కల్గించి మనిషిని మానసికముగా మార్చగలదు. మాట్లాడని వానిని కూడా ఎక్కువగా మాట్లాడునట్లు చేయగలదు. అయితే ఒక మనిషి చిన్న గ్లాసు సారాత్రాగినా వానిలో అది బాగా పనిచేసి ఆ మనిషిని ఎక్కువగా మాట్లాడునట్లు చేయును. అదే సారాను మరొక మనిషి త్రాగినా త్రాగనట్లేయుండును. అతనిలో ఏ మార్పు రాదు. అతను ఒక పెద్ద సారాయి త్రాగినా అతనిలో మార్పు రాదు, వాడు మాట్లాడడు. అట్లే కొందరిలో ఆహారములు, ఔషధములు ఆత్మ ఆజ్ఞను అనుసరించి పని చేయును. అంతేగానీ ఏ పదార్థముగానీ స్వయముగా పని చేయలేదు. అన్ని విషయములలో హెచ్చుతగ్గులుగా ఆత్మ ఆడించు ఆటదేగానీ ఆహారము వలన ఏమీ జరుగడము లేదని గ్రహించవలెను.

**177) ప్రశ్న :- గర్భిణీ స్త్రీ ఉండే వాతావరణము హింసాపూరిత చర్యలో ఉండి మానసిక క్షోభ అనుభవిస్తుయుంటే, గర్భములో పెరిగే బిడ్డ పైన చెడు మార్పులు జరుగునా?**

**జవాబు :-** బయట వాతావరణమునకు గర్భములోపల పెరిగే బిడ్డకు ఏమాత్రము సంబంధము ఉండదు.

**178) ప్రశ్న :- భగవద్గీతలో కల్పిత శ్లోకములను చొప్పించిన వారు వేద నింద కల్గిన "త్రై గుణ్య విషయా వేదా" వంటి శ్లోకాలను ఎందుకు తీసి వేయలేకపోయారు?**

**జవాబు :-** వాటిని ముట్టుకుంటే ఏమి జరుగుతుందోనను భయము చేత ఆ శ్లోకములను ముట్టుకొనే సాహసము చేయలేకపోయారు.

**179) భగవద్గీత రచన జరిగినప్పుడు శ్రీకృష్ణుడు బ్రతికియున్నాడు కదా! ఆయన జ్ఞానము గ్రంథము అయినందుకు సంతోషించెనా?**

**జవాబు :-** వ్యాసుని చేత వ్రాయబడవలెనను ఫతకముతోనే భగవద్గీతను అర్జునునకు చెప్పాడు. ఆయన అనుకొన్నట్లే వ్యాసుని చేత **'భగవద్గీత'** అను పేరుతో తన బోధ గ్రంథరూపమైనది. తన గ్రంథమును భగవద్గీతయను పేరు పెట్టడము కృష్ణునికి సరిపోలేదని, అసంతృప్తిగా యుండేదని తెలిసినది. గ్రంథము తయారయిన తర్వాత ఇజ్రాయెల్ దేశములో మోషే ప్రవక్తకు భగవద్గీతను కృష్ణుడు స్వయముగా ఇచ్చి గ్రంథము పేరు **"తౌరాత్"** అని చెప్పాడు. తౌరాత్ గ్రంథమని పేరు పెట్టిన తర్వాత కొంత సంతోషము కల్గినది. ఆకాశ శబ్దము ద్వారా వచ్చిన జ్ఞానమే భగవద్గీత అయినా అది భగవంతుడు చెప్పినట్లు ఉండకూడదని, ఆకాశము నుండి వచ్చినట్లు తెలియవలెనను భావము ఆయనలో ఉండేది.

**180) ప్రశ్న :- నిన్నటి (03-09-2016) వార్తాపత్రికలో 147 సంవత్సరములు ఒక వ్యక్తి బ్రతికినట్లు చూపించారు. మానవుని ఆయుష్షు 120 సంవత్సరములే కదా! మరి 147 సంవత్సరములు ఆ మనిషి ఎట్లు బ్రతికెను?**

**జవాబు :-** పన్నెండు నవగ్రహముల దశా సంవత్సరములు పూర్తిగా

గడచుటకు 120 సంవత్సరములు పట్టును. అంతేగానీ అది మనిషి ఆయుష్షు కాదు. మనిషి ఆయుష్షు వేల సంవత్సరముల వరకైనా యుండ వచ్చును. 120 సంవత్సరములు గ్రహముల దశాచార సంవత్సరములు మాత్రమే.

**181) ప్రశ్న :- వృక్షములలో వృక్షమంతా ఆవహించియున్న ఆత్మ వాటి పండ్లలో కూడా వ్యాపించి యుండును కదా? పండు ఊడినా మనము తెంపినా ఆత్మను ఖండించినట్లగునా? పండును తింటే ఆత్మను తినినట్లగునా?**

**జవాబు :-** వృక్షమంతా ఆత్మ వ్యాపించి యుండుట నిజమే. వాటి కాయలో కూడా వ్యాపించియుండును. కాయ పండుగా మారినప్పుడు అందులో ఆత్మ ప్రవేశించదు. అప్పుడు దానంతట అదే కాడనుండి ఊడిపడును. పండులో ఆత్మశక్తి యుండదు. కాయలో ఆత్మశక్తి ఉండును. పచ్చికాయను పెరికితే ఆత్మను త్రెంపినట్లగును. అప్పుడు కాయలో ఆత్మయున్నా అది రెండు నిమిషములలో లేకుండా పోవుచున్నది. తర్వాత కాయను తిన్నా ఆత్మతో ఏమీ సంబంధము లేదు. తెగిన బల్లితోకలో శక్తి రెండు నిమిషములలో అణిగిపోవునట్లు కాయలో కూడా లేకుండా పోవును.

**182) ప్రశ్న :- తల్లిగర్భములో జీవుడు లేనప్పుడు ఆ దేహానికి కర్మలేనట్లే కదా! అయితే కొందరి గర్భములలో అంగవైకల్య శరీరములు పెరుగు చున్నవి. లేదు తల్లిదండ్రుల కర్మవలన అట్లా పెరుగుచున్నదంటే, ఎవరి కర్మను వారే అనుభవించాలి కదా? దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** మనిషికేగాక ప్రతి జీవికి కర్మపత్రము వ్రాయబడియున్నది. ఒక మనిషిని తీసుకొని చూస్తే అతని ఆయుష్షు మొదట పుట్టినప్పటినుండి ప్రతి 69 సంవత్సరముల, ఐదు (5) నెలల, పది (10) రోజులకు ఒకమారు

జరిగిన కర్మయంతయూ కలిపి రాబోవు జన్మ ఎలా ఉండాలో నిర్ణయము చేసి వ్రాయబడియుండును. మనిషి ఎంతకాలము బ్రతికినా 69 సం॥ 5 నెలల, 10 రోజులకు ఒకమారు కర్మపత్రము లేక కర్మగ్రంథము వ్రాయబడు చున్నది. ఒక వ్యక్తి 80 సంవత్సరములకు చనిపోయాడనుకొనుము. అప్పుడు వారు ఎక్కడ పుట్టవలెనని ఎట్లు పుట్టవలెనని అన్ని వివరముల కర్మ 69 సం॥ 5 నెలల, 10 రోజులప్పుడే నిర్ణయించబడియుండును. అందువలన ఆ మనిషి తర్వాత కుంటి జన్మ ఎత్తవలసి యుండునట్లయితే అతనికి సంబంధించిన గర్భములోని శిశువు కుంటిదిగా తయారవును. ఆ శిశువు జన్మించిన తర్వాత అందులో చేరవలసినవాడు పోయి చేరును. అయితే ముందే కర్మ నిర్ణయము జరిగియుండునను విషయము చాలామందికి తెలియదు. ఈ విషయము **"కలియుగము ఎప్పటికీ యుగాంతము కాదు"** అను గ్రంథములో వ్రాసియున్నాము. మనిషి చనిపోయినప్పుడు కర్మ నిర్ణయము జరుగును అనికూడా కొన్నిచోట్ల చెప్పాము. చనిపోయినప్పుడు ఆత్మ ముద్ర (ఆత్మ అనుమతి) పొంది రెండవ జన్మకు రావలసియున్నది. కర్మ ముందే నిర్ణయము జరిగియుండును.

**183) ప్రశ్న :- సృష్టి ఆదిలో కర్మలేనప్పుడు మానవులే కాకుండా అన్ని జీవరాసులను సృష్టించియుంటే అండజ, పిండజ, ఉద్భిజములు ఎన్ని ఉండెను?**

**జవాబు :-** త్రైత సిద్ధాంత భగవద్గీతలో విభూతి యోగమున జీవరాసుల సృష్టిని గురించి సంపూర్ణముగా చెప్పియున్నాము. అందులో మనుషులు 108 పుట్టగా అందులో పురుషులు 54 మంది, స్త్రీలు 54 మంది. వారిలో పురుషులయందు 27 మంది మంచివారు, 27 మంది చెడు వారిగా (మంచి చెడు) గుణములలో పుట్టునట్లు చేశాడు. అట్లే అండజములు, పిండజ,

ఉద్భిజములు 108, 108, 108 పుట్టునట్లు చేయబడినవి. మొదట జంతువులు లేవు. తర్వాత జరుగు కాలములో మనుషుల సంఖ్య తగ్గి జంతువుల సంఖ్య పెరిగినది. భూమిమీద కొంత కాలమునకు అన్ని సంఖ్యలు సమానమైనవి. తర్వాత కాలక్రమేపీ జీవరాసుల సంఖ్య పెరుగుచూ వచ్చినది.

**184) ప్రశ్న :- పిండము దశనుండి అన్ని అవయవములు పెరిగినా మూత్రమును తయారు చేయు కిడ్నీలను మూత్రపిండములని అంటానే యున్నారు? దేనికి?**

**జవాబు :-** గర్భములోని శిశువు ఆకృతిలో మూత్రమును తయారు చేయునవి ఉండుట వలన వాటిని మూత్రపిండములని అంటున్నారు. వాని ఆకృతిని బట్టి వాటికి ఆ పేరు రావడము జరిగినది.

**185) ప్రశ్న :- జీవునికి జ్ఞానము మీద శ్రద్ధ పూర్వ జన్మ సుకృతము వలన లభ్యమగును అన్నారు కదా! అయితే పూర్వజన్మ లేకుండా అదే మొదటి జన్మ అయితే ఆ జీవునికి శ్రద్ధ ఎట్లు కల్గును. సృష్ఠి మొదట జన్మ కల్గిన ఎందరో జీవులలో అందరికీ ఆ శ్రద్ధ ఎందుకు కల్గటము లేదు? మొదటి శ్రద్ధ మొదటి జీవునికి ఎట్లు కల్గెను?**

**జవాబు :-** అర్జుననకు జ్ఞానము మీద ఏమాత్రము శ్రద్ధ లేకున్నా తన జ్ఞానము బయటికి వచ్చుటకు శ్రద్ధలేని అర్జుననకు జ్ఞానమును చెప్పినట్లు మొదట ఏమాత్రము శ్రద్ధలేని మనిషికి దేవుని జ్ఞానము బయటికి వచ్చుటకు మానవునకు శ్రద్ధలేకున్నా దేవుడే వానికి జ్ఞానమును చెప్పాడు. జ్ఞానమును విన్న తర్వాత కొందరికి జ్ఞానము మీద శ్రద్ధ కల్గినది. కొందరికి ప్రపంచ శ్రద్ధల వలన జ్ఞానము మీద శ్రద్ధ లేకుండా పోయినది. మొదట మనిషికి

శ్రద్ధలేకున్నా దేవుడే జ్ఞానము చెప్పాడని తెలియుచున్నది. అయినా మనుషులలో కొందరు జ్ఞానము యొక్క రుచిని చూచిన తర్వాత దానిమీద శ్రద్ధకల్గి యున్నారు. కొందరికి జ్ఞానము యొక్క రుచే తెలియలేదు. జ్ఞానము రుచి తెలిసిన వారిని జ్ఞానులని, రుచి తెలియని వారిని అజ్ఞానులని అంటున్నాము.

**186) ప్రశ్న :- శ్రీకృష్ణుని ఎడమ కాలిపైన పాముకాటు నమూనా ప్రభువు కాలుకు సేవ చేస్తున్నప్పుడు భక్తురాలు గుర్తించి ఇదేమి అని అడుగగా, అది గత జన్మలో ఏర్పడిన గుర్తుయని ప్రభువు చెప్పే సన్నివేశము బైబిలు గ్రంథములో ఏ సువార్తలో కలదో చెప్ప మనవి?**

**జవాబు :-** ఈ విషయము నేను బైబిలులో ఉన్నట్లు చెప్పలేదు. అంతేకాక ప్రభువు ఆ మాట చెప్పిన విషయము నేను చెప్పానా లేక ఎవరైనా మీకు చెప్పారా? ఈ విషయము నా జ్ఞాపకములో పూర్తిగా లేదు. అయితే అడిగావు కావున నీకు సత్యము చెప్పాలంటే ఆ పాము కాటును పోలిన గుర్తులు నా ఎడమ మోకాలు క్రింద పిక్క కండకు ఉన్నమాట వాస్తవమే. అంతతప్ప ఈ విషయములో నాకు ఏమీ గుర్తులేదు.

**187) ప్రశ్న :- "ఈ జన్మలో చేసిన తప్పులకు శిక్షలు మరుజన్మలో" అనే సూత్రము వలన హేతువాదులు, నాస్తికవాదులు ఎక్కువై ఆస్తికవాదులంటే భయము లేకుండా పోయినది. మరి ఈ జన్మలో అన్ని తప్పులకు కాకుండా కొన్ని తప్పులకయినా శిక్షలు ఉంటే, జ్ఞానదూషణ, జ్ఞానులపైన దాడి జరిగిన దానికయినా శిక్షలు పడితే జ్ఞానప్రభావము తెలిసినట్లగును. మిగతావారు దేవుని జ్ఞానము ఎడల భయభక్తులు కల్గియుందురు కదా! మరి అట్లా ఎందుకు జరుగదు?**

**జవాబు :-** పాపము చేస్తే ఆ పాపమునకు శిక్ష మరుజన్మ జీవితములో జరుగునని దానినే కర్మఫలమును మరుజన్మలో అనుభవించడమని చెప్పు చుందురు. అది వాస్తవమే అయినా కొన్ని తప్పులకు శిక్షలు అప్పుడేగానీ లేక కొంత ఆలస్యముగాగానీ అమలు జరుగడము కూడా కలదు. ఈ జన్మలో చేసిన తప్పులకు ఈ జన్మలోనే శిక్షలు అమలయిన సంఘటనలను చూస్తే ఇది వాస్తవమేనాయను అనుమానము రాక తప్పదు. దేవుడు, జ్ఞానము అను ఈ రెండు విషయములలోనే చాలామందికి వెంటనేగానీ, కొంత ఆలస్యముగాగానీ శిక్షలు అమలు కావడము మేము చాలా చూచాము. చాలామంది మరణించిన వారు గలరు. కొంతమంది అంగహీనులై జీవిత మంతా కష్టముగా గడుపువారు కూడా కలరు. జ్ఞానము విషయములో అనవసరముగా మాట్లాడి తప్పు చేసిన వారు హీనముగా కొందరు బ్రతుకు చుండగా కొందరు కారణము తెలియకుండా చనిపోయారు. వారు మనుషుల వలన బాధింపబడలేదు, మనుషుల చేత చంపబడలేదు. దీని కంతటికి కారణము ఆకాశములో నుండి భూమిమీదికి వచ్చి పోవు గ్రహముల వలన, భూతముల వలన జరిగిందని అనుకొంటాను. జ్ఞానమునుగానీ, జ్ఞానినిగానీ, దేవున్నిగానీ అజ్ఞానులు అగౌరవముగా మాట్లాడినా, నిందించినా ఆ సమయములో అక్కడ ఆకాశ భూతములుగానీ, గ్రహములుగానీ సూక్ష్మముగా అక్కడికి వచ్చియుంటే, ఒకవేళ వారు దేవున్ని, దేవుని జ్ఞానమును, జ్ఞానిని నిందించడము చూస్తే వానిని కొన్ని రోజులలోగానీ, కొన్ని నెలలలోగానీ చంపడమో, అంగవైకల్యము చేయడమో చేయును. అంత జరిగినా ఎందుకో జరుగకూడనిది జరిగినదని ఎవరూ ఆలోచించడము లేదు. దేవుని సైన్యములో భూతములు, గ్రహములు పని చేయుచున్నవి. వాటికి దేవుడంటే ఎంతో ఇష్టము. తమకు ఇష్టమైన దేవున్ని, దేవుని జ్ఞానమును నిందించువానిని ఆ సమయానికి అక్కడేయుండి

చూస్తే వానిని సులభముగా వదలవు. గ్రహములు భూతములు ఎంతోమందిని శిక్షించినా ఫలానా తప్పు వలన ఇది జరిగింది అని మనిషి అనుకోవడము లేదు. ఒకవేళ మేము "ఇది మంచిది కాదు దేవుని శిక్షకు మీరు గురికావచ్చు" అని చెప్పి హెచ్చరించినా జరిగినప్పుడు చూస్తాము అని కొందరనుకోగా, మాది తప్పే లేదు మమ్ములను ఎవరూ ఏమీ చేయరను ధీమాను కొందరు వ్యక్త పరచుచున్నారు.

**188) ప్రశ్న :- భీష్ముడు భగవద్గీతను వినకముందే జ్ఞాని ఎట్లు అయ్యెను? ఆయన కృష్ణున్ని భగవంతుడని ఎలా తెలియగలిగాడు?**

**జవాబు :-** ఇప్పుడు నేను చెప్పు విషయమునకు ఏమాత్రము ఆధారముండదు. అయినా నేను చెప్పునది సత్యము. ఇతరులు నమ్మవచ్చు లేకపోతే లేదు. సృష్ట్యాదిలో చెప్పబడిన జ్ఞానమును మనుషులు అర్థము చేసుకొనుటకు సూర్యుడు భూమిమీదగల 'మనువు' అను వ్యక్తికి తెలుపగా, మనువు ద్వారా ఇతరులకు రాజునుండి పేదవరకు తెలియబడినది. మనువు జ్ఞానమును సూర్యుడు చెప్పగా వినిన దానివలన జ్ఞానిగా మారిన మనువు ఎన్నో జన్మలు ఎత్తుచూ సూర్యుడు చెప్పిన జ్ఞానమును నెమరు వేసుకొంటూ చస్తూ పుట్టుచూ చివరికి కొంత కర్మ శేషము వలన భారతదేశములో ఉత్తరమున 'భీష్ముడు' అను పేరుతో పుట్టడమైనది. ముందు జన్మలలోనే జ్ఞానము సంపూర్ణముగా తెలిసిన మనువు కురువంశములో భీష్ముడుగా పుట్టినా ఆయన జ్ఞానము గల వ్యక్తి అని కూడా ఎవరికీ తెలియదు. భీష్ముడు భగవద్గీతను చెప్పక ముందు నుండి కర్మయోగమును ఆచరించుచున్నాడు. సంపూర్ణ జ్ఞాని, సంపూర్ణ యోగి అయినందున కృష్ణుని జన్మను సులభముగా గుర్తించగలిగాడు. కృష్ణుని విషయములో అనేకమార్లు కౌరవులను హెచ్చరించాడు. అయినా ఆయన మాటను ఎవరూ వినలేదు. ఆ

కాలములో కృష్ణుడు సాధారణ మనిషికాదు సాక్ష్యాత్తూ దేవుడైన భగవంతుడని తెలిసినవాడు ఒకే ఒక్క భీష్మడు తప్ప ఎవరూ లేరు. యుద్ధరంగములో కృష్ణుడు తనమీదికి కోపముగా వచ్చినప్పుడు చేతులు జోడించుకొని వినమ్రుడై రథము దిగి నిలబడ్డాడు. కృష్ణుని చేతిలో చనిపోతే ఎంతో భాగ్యముగా తలచాడు. యుద్ధరంగములో క్రింద పడిపోయినప్పుడు కూడా కృష్ణున్నే పిలిచి కృష్ణునితోనే మాట్లాడినాడు. నేరుగా కృష్ణున్ని తనను నీలో కలుపుకొమ్మని అడిగినవాడు భీష్మడు ఒక్కడే. చివరికి కృష్ణుడు చెప్పిన మాటప్రకారము ఉత్తరాయణ కాలము రాగానే భీష్మడు చనిపోవడము జరిగినది. అదే ఆయనకు ఆఖరీ మరణము. ఆయన తిరిగి పుట్టలేదు. దేవునిలో ఐక్యమై దేవునిలోనే నిలిచిపోయాడు.

**189) ప్రశ్న :- బుద్ధుడు చెప్పిన సూత్రాలను, ఉపనిషత్తులలో కొన్ని వాక్యములను జతచేసి వ్రాసినదే భగవద్గీతయని హేతువాదులుగా మేము అంటున్నాము. అంతేగానీ భగవద్గీత ద్వాపరయుగము కాలము నాటిది కాదు.**

**జవాబు :-** అట్లని అనుకొనే వానికి బుద్ధుని సూత్రాలతో భగవద్గీత ఏకీభవించదు. బుద్ధుని సూత్రాలు వేరు, భగవద్గీత వేరు. అందువలన మీ మాటలో సత్యము ఏ కొద్దిగ కూడా లేదని చెప్పవచ్చును.

**190) ప్రశ్న :- పుష్కర సమయంలో ఉన్న నీటిలో వాస్తవముగా ఏ శక్తి కిరణాలైనా ప్రసరించునా?**

**జవాబు :-** ఏ శక్తి కిరణములు పుష్కర సమయములో నదులయందు ప్రసరించవు. ఆధ్యాత్మికరీత్యా ఇది కూడా కొంత అజ్ఞానమే అగును.

**191) ప్రశ్న :- మనకు చేదుగాయున్న వేప ఆకులు మేకలకు చేదు**

**అనిపించవా? మనకు తెలిసే రుచులు వేరే జీవులకు మరొక రుచిలా ఉండునా?**

**జవాబు :–** 'జిహ్వాకు ఒక రుచి'యని మన పెద్దలు చెప్పినట్లు మనుషుల రుచి జంతువులకు వేరుగాయుండును. మనకు చేదుగా యున్న వేప ఆకు మేకలకు రుచిగా యుండును. మనకు చేదులేని మేక మేయని ఆకు మేకకు చేదుగాయుండును. అందువలన అన్ని ఆకులను తిను మేక ఒక ఆకును మాత్రము తినదు. అదే మేక మేయని ఆకు అని చెప్పబడుచున్నది. మేక నాలుక మీద గల రుచి కణముల సంఖ్యనుబట్టి, పరిమాణమునుబట్టి వాటికి రుచి తెలియుచుండును. ఒకే పదార్థమే వేరువేరు జీవరాసులకు వేరువేరు రుచులుగా తెలియును.

**192) ప్రశ్న :– ఒక్క రోజు పుట్టి ఒక్కరోజే బ్రతికి చనిపోవు జీవులు ఎన్నో గలవు. ఒక్కరోజే పుట్టుటకు తగిన కర్మయుండునా?**

**జవాబు :–** పుట్టిన రోజే ఒక గంట బ్రతికి చనిపోవువారు, రెండవ రోజు చనిపోయినవారు ఎందరో గలరు. వారు బ్రతికిన కాలము తక్కువే అయినందున ఆ జన్మకు అంతే కర్మ కేటాయించబడినదని తెలియుచున్నది. ఒక గంటసేపు మాత్రమే బ్రతికి చనిపోవు జీవులు చాలా కలవు. కర్మను బట్టి జన్మలుండునని తెలియవలెను.

**193) ప్రశ్న :– గొడ్డలి పట్టుకొని వస్తున్న వ్యక్తిని చూచి తనను నరికివేయునని తెలిసిన వృక్షములో జీవుడు మరియు ఆత్మ ఇద్దరూ సూక్ష్మముగా బయటికి పోవుదురా?**

**జవాబు :–** ఆ విధముగా పోవు అవకాశము విగ్రహాలలో జీవులకు మాత్రము గలదు. వృక్షములోని జీవుడు, ఆత్మ బయటికి పోరు. పోయే అవకాశము

లేదు. చెట్ల కొమ్మలు నరికినా, మొదలు నరికినా జీవుడు వేర్లలోయుండుట వలన వృక్షమునకు ప్రాణము పోదు. కొమ్మలు నరికినప్పుడు మనిషి శరీరములో అవయవములను నరికివేయునప్పుడు మనిషికి కల్గు నొప్పివలె చెట్టుకు నొప్పియుండదు. నొప్పి పూర్తి లేదు అని చెప్పలేము కానీ, మనిషి శరీరములో పొందు బాధలో కేవలము ఐదు నుండి పది శాతము వరకు బాధ యుండవచ్చును. మనిషికి యున్న నొప్పిలో చాలా తక్కువ శాతము అనుభవించు జీవులలో చెట్లు మొదటి స్థానములో యున్నవి. పక్షులు, పది నుండి పదిహేను శాతము అనుభవిస్తూ రెండవ స్థానములో యున్నవి. జలచరములయిన కప్పలు, తాబేళ్ళు, చేపలు 15 నుండి 20 శాతము నొప్పిని అనుభవిస్తూ మూడవ స్థానములోయున్నవి. జంతువులు ఇరవై నుండి ముప్పై (20 నుండి 30) శాతము వరకు అనుభవిస్తూ నాల్గవ స్థానములో యున్నవి.

**194) ప్రశ్న :- శారీరక వ్యాయామము వలన ఆత్మశక్తి పెరుగునా?**

**జవాబు :-** మనిషి తన శక్తిని పెంచుకోవాలని శరీర వ్యాయామము చేయుచున్నాడు. శరీరమునకు శక్తి ఇచ్చునది ఆత్మేనని చాలామందికి తెలియదు. శరీర వ్యాయామము వలన శక్తి పెరుగుతుందని చాలామంది కఠోర వ్యాయామము చేయుచున్నారు. శరీర వ్యాయామము చేయుట వలన శరీర శక్తి పెరిగినట్లు మనిషికి తెలియుచుండినా, అది వ్యాయామము వలన వచ్చినదేయని నమ్మకమున్నా ఆత్మ తన చైతన్యమును ఇచ్చినప్పుడే శరీర బలము పని చేయును. శరీరమునకు బలమును నిర్ణయించి ఇచ్చువాడు ఆత్మయే. మనిషి శరీరమును నమ్ముకొని వ్యాయామము చేయుట కంటే ఆత్మను గురించి తెలియగలిగితే ఎంతటి శక్తినయినా పొందవచ్చును. రావణబ్రహ్మ శరీర వ్యాయామము చేయలేదు. ఆత్మను విశ్వసించి ఆత్మను తెలియుట వలన ఆత్మను అర్థించి శక్తిని పొంది కైలాసగిరిని పైకి

ఎత్తగలిగాడు. వాలి మహా బలాఢ్యుడయినాడు. ఆంజనేయుడు మూలికా శక్తి చేతనే (ఆత్మశక్తి చేతనే) మహా బలశాలి అని పేరుగాంచాడు. అందువలన వ్యాయామము వలన ఆత్మకు శక్తి రాదుగానీ, ఆత్మ వలననే శరీరమునకు శక్తి వచ్చుచున్నది.

**195) ప్రశ్న :- దయ్యాలను చూపే యంత్రములను భవిష్యత్తులో మేము కనిపెడితే మీ స్పందన ఎట్లుండును?**

**జవాబు :-** దయ్యాలు లేవు అనే మీరు (హేతువాదులు) దయ్యాలున్నాయని నమ్మగలిగి, వాటిని చూపే యంత్రములను కనుగొనగలిగితే మీరు మా దారిలోనికి వచ్చినందుకు సంతోషిస్తాము. దయ్యము ఉంది అని విశ్వసిస్తే తర్వాత దేవుడున్నాడని పరోక్షముగా విశ్వసించినట్లేయగును. దయ్యము వికృతి పదము, దేవుడు ప్రకృతి పదము అని చెప్పుచుందురు. అనగా ప్రకృతి నుండి తయారయినది వికృతియని చెప్పవచ్చును. దేవుడు అను శబ్దమునుండి పుట్టినది దయ్యము. అందువలన దయ్యమును నమ్మితే దేవున్ని కూడా నమ్మినట్లేయగును. బ్రాహ్మణుడు ప్రకృతి పదముకాగా దానినుండి పుట్టినది వికృతి పదము బాపడు. బాపడు అనువానిని నమ్మితే బ్రాహ్మణుడు అను వానిని నమ్మినట్లే కదా! పంచభూతములు ప్రకృతి కాగా సర్వభూతములు వికృతిగా యున్నవి. కనిపించని దేవుడునుండి కనిపించే దయ్యములు వచ్చినవని, దయ్యములను చూడగలిగితే ఎప్పటికయినా మోక్షము పొంది దేవున్ని చూడవచ్చని చెప్పుచున్నాము.

**196) ప్రశ్న :- ఆత్మను నీటితో పోల్చెదము కదా! అయితే 'నీరు' అనే పేరులోగానీ 'జలము' అనే పేరులోగానీ జ్ఞానార్థము ఏమైనా ఉన్నదా?**

**జవాబు :-** ఆత్మను నీటితో పోల్చకూడదు. ఆత్మశక్తిని నీరుతో పోల్చవలెను.

ఆత్మను అగ్నితో పోల్చవలెను. భగవద్గీతలోగానీ, బైబిలులోగానీ ఆత్మను అగ్నితో పోల్చారు. ఆత్మశక్తి సర్వ అవయవములకు ప్రవహించుట వలన అర్థమగుటకు నీటి ప్రవాహముతో పోల్చి చెప్పడమైనది. అర్థమగు నిమిత్తము శక్తి ప్రవాహములాంటిదని నీరుగా పోల్చి చెప్పారు. కర్మను దహించు శక్తి ఆత్మకుండుట వలన ఆత్మను అగ్నితో సమానముగా పోల్చారు. ఆత్మ ఎల్లప్పుడు శరీరము లోపలే యుండును కనుక ఆత్మను అగ్నిగా కూడా చెప్పారు.

**197) ప్రశ్న :- కర్మానుసారము శరీరము వస్తుంది అంటే శారీరకముగా, మానసికముగా, తల్లితండ్రుల బాహ్య శరీర పోలికలతో పాటు మానసిక పోలికలు కూడా బిడ్డలకు వస్తున్నవి. అదెలా అంటే ఆత్మహత్యలు (హత్యలు) చేసే గుణము గల తల్లితండ్రులకు పుట్టిన బిడ్డలకు కూడా అదే గుణములతో పని చేయు క్రూరత్వము కల్గి వారు కూడా హత్యలు చేయాలను చింత కల్గియుందురు. మరి ఇవి వీటికి జన్యువులే కారణమనే నవీన సిద్ధాంతములో మీ కర్మ సిద్ధాంతము పని చేయనట్లే కదా?**

**జవాబు :-** మనుషులు తమ సంతతికి తామే కారణమని అనుకోవడము జరుగుచున్నది. వాస్తవముగా వారి బిడ్డలకు వారు కారణము కాదు. తండ్రి వీర్యకణముతో సంబంధము లేకుండా అందరూ పుట్టుచున్నారు. మొదటి నుండి ఇదే జరుగుచున్నది అయినా ఎవరికీ తెలియదు. అయితే పుట్టిన బిడ్డకు తల్లిదండ్రుల పోలికలు వచ్చుట వలన తమ బిడ్డలు తమకు పుట్టారని మురిసిపోవుచుందురు. కొన్ని పోలికలు తల్లితండ్రులవి ఉండడమే కాకుండా వారికున్న బుద్ధి స్వభావములు, గుణ స్వభావములు వచ్చుట వలన తల్లితండ్రులు వారు కాదని ఎవరూ చెప్పలేరు. **ఆత్మయే అందరికీ బీజదాతయనీ,** ఆత్మే అందరికీ బాహ్య తల్లితండ్రులను నమ్మించుటకు

పోలికలను ఇవ్వడమేకాక తల్లితండ్రులు ఏవి ఇష్టముగా చేయుచుందురో అవే పనులు ఇష్టముగా చేయుట వలన వారికి తల్లితండ్రి గుణములు వచ్చినట్లు కనపడుటకు ఆత్మే అలా తయారు చేయుచున్నది. దానివలన కనపడు తల్లితండ్రులే నిజమైన తల్లితండ్రులుగా చెప్పుచున్నారు. శిశువు ఏ శరీరమునుండి పుట్టుచున్నాడో ఆ శరీరములోని ఆత్మే ఆ శరీరము యొక్క జన్యుకణములను శిశు శరీరములో ఉండునట్లు చేయుట వలన శిశువు పెరిగి పెద్దదైనప్పుడు తల్లితండ్రుల జీన్స్ బిడ్డల శరీరములో కనిపించుట వలన తమ జన్మకు ఆత్మ కారణమని, ఆత్మే తండ్రియని ఎవరికీ తెలియకుండా పోయినది.

**198) "శుచీనాం శ్రీమతాం గేహే" అనే శ్లోకానుసారము యోగీశ్వరునిగా వచ్చిన శ్రీకృష్ణుని పుత్రులు జ్ఞానులయ్యారా? లేదా?**

**జవాబు :-** భగవద్గీత ఆత్మసంయమ యోగములో 41వ శ్లోకమందు **"శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోభి జాయతే"** అని కలదు. అక్కడ చెప్పినట్లు **"యోగభ్రష్టులయిన వారు మంచి జ్ఞానుల ఇల్లలోగానీ, యోగుల ఇల్లలోగానీ జన్మించుదురు"** అని కలదు. అయితే కృష్ణుడు యున్న సమయములలో యోగభ్రష్టులు ఎవరూ లేరనుకో అప్పుడు వారు వచ్చి యోగుల ఇల్లలో పుట్టే అవకాశమే లేదు కదా! అప్పుడు భూమిమీద యోగ విధానము లేదని కృష్ణుడు తన బోధలో మూడు యోగ విధానములను తెలిపాడు. కృష్ణుడు చెప్పినప్పుడు యోగుల విషయము బయటికి తెలిసినది. అంతవరకు యోగము అంటే ఏమిటి, యోగములు ఎన్ని అను విషయము ఎవరికీ తెలియదు. అందువలన అప్పుడు యోగభ్రష్టులు లేరు. కృష్ణుని ఇంట్లో పుట్టిన వారు సాధారణ మనుషులే అయి ఉంటారు తప్ప యోగ భ్రష్టులు ఎవరూ ఉండరు.

**199) ప్రశ్న :- భూమి పుట్టుక 450 కోట్ల సంవత్సరముల క్రితము అని మేము చెప్పుచున్నాము. ఇప్పటికి 200 కోట్ల సంవత్సరముల వరకు భూమిమీద ఏ ప్రాణీ లేదనేది వాస్తవము. మీ సిద్ధాంతము ప్రకారము భూమి పుట్టుక వెంటనే జీవులు ఏర్పడెనా? లేక కొంత వ్యవధి పట్టిందా? మానవ పరిణామము ఇప్పటికి 70 లక్షల సంవత్సరముల క్రితము ఆఫ్రికాలో ఏర్పడినదని మా వాదన. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** మాకు తెలిసిన దానిప్రకారము ప్రకృతి ముందు పుట్టినది. ప్రకృతిలో భూమి కూడా ఒక భాగమే. తర్వాత కొంత వ్యవధిలో జీవుల సృష్ఠి జరిగినది. జీవులకంటే ముందు భూమి ప్రకృతి పుట్టడము వాస్తవమే. అయితే భూమి పుట్టుకకు జీవుల పుట్టుకకు కొంత వ్యవధి ఉండుట వాస్తవమే అయినా అది ఎంత అనునది మాకు కూడా తెలియదు. ప్రకృతి పూర్తి రూపురేఖలు దిద్దుకొనుటకు కొంతకాలము జరిగినది వాస్తవమేయని మేము కూడా అంటున్నాము. అయితే జీవుల పరిణామములో ముందు మనుషులే పుట్టారనీ తర్వాత జీవరాసుల సృష్ఠి జరిగినదని మేము చెప్పుచున్నాము. లేదు ముందు జీవరాసులు పుట్టాయని మీరు అంటున్నారు. పరిణామ సిద్ధాంతము వాస్తవము కాదు. భగవద్గీత బ్రహ్మావిద్యా శాస్త్రమగును. దానిప్రకారము చూస్తే మనుషులు ముందు జీవరాసులు వెనుక తయారయినవని చెప్పవచ్చును. మనుషులు ఎప్పుడు సృష్ఠింప బడినారని మేము ఖచ్చితముగా చెప్పలేము. ఎప్పుడు తయారయివున్నా 'మనుషులు ముందు జీవరాసులు వెనుక' పుట్టారని చెప్పుచున్నాము.

**200) ప్రశ్న :- స్త్రీ, పురుషుల కలయిక వలననే సంతతి అభివృద్ధి చెందుతున్నదని అది ప్రకృతి పరమాత్మకు నమూనాయని మీరు చెప్పారు. పురుషుని శుక్రకణము అక్కడ లేకుండానే 'డాలి' అనే గొర్రెపిల్లను సృష్ఠించి**

**(క్లోనింగ్ ద్వారా) పురుషుని నమూనాయే లేకుండా చేశారు. తర్వాత మానవులలోనికి ప్రవేశించి, మగవారు అక్కడ లేకుండా ఆడవారు బిడ్డలు కనే రోజులు వస్తాయి. మరి మీ ప్రకృతి పరమాత్మల సిద్ధాంతము భవిష్యత్తులో అడ్రస్ లేనిదవుతుందేమో?**

**జవాబు :-** పురుష శుక్రకణము లేకుండా పిల్లలుకంటున్నారని ఇంతకు ముందు చెప్పాము. దేవుని సృష్ఠిలోనే పురుషకణము లేకుండా దేవుడే జీవులను సృష్ఠించుచున్నాడు. మనుషులు ఆ ప్రయత్నములో క్లోనింగ్ ద్వారా గొర్రెపిల్లను పుట్టించగలిగినా అది ఎక్కువ కాలము బ్రతుకలేదు. అంతేకాక మిగతా గొర్రెలలాగా దానిలో రోగ నిరోధక శక్తి లేదు. దానికి కీళ్ళ నొప్పులు వగైరా రావడము జరిగినది. దానివలన గొర్రె పిల్లవరకే చేసి చూచినా శాస్త్రవేత్తలు అంతటితో వారి పరిశోధన ఆపివేసి, మనుషుల వరకు రాలేదు. మగవారు లేకుండా పిల్లలు పుట్టుచున్నారని ఇంతకు ముందే తెలిసిపోయినది. దానికి కారణము కూడా తెలిసింది. ప్రకృతి, పరమాత్మల సృష్ఠి సిద్ధాంతము మగవారు లేకున్నా ఉంటుందని తెలిసి పోయింది. అందువలన ఆ సిద్ధాంతము ఎక్కడా పోదు.

**201) ప్రశ్న :- వినాయకుని ఊరేగింపులు స్వాతంత్ర్యము కోసం పోరాటము చేస్తున్న సమయములో లోకమాన్య బాలగంగాధర్ తిలక్ గారు మహారాష్ట్ర లో ప్రారంభించారు. తర్వాత వినాయక ఊరేగింపులు వ్యాపించాయని నిన్నటి (03-09-2016) వార్తాపత్రికలో వచ్చింది. మీరేమో కలియుగము మొదటి కాలములోనే బలవంతునిచే బలహీనులు అణగద్రొక్కబడు చున్నారనీ, దాని నమూనాను ఎలుక ఏనుగు గుర్తుగా చూపుచూ వినాయక ఊరేగింపులు ప్రారంభమయినాయని చెప్పారు. అది మంచి పద్ధతి కాదన్నట్లు ఏనుగు బొమ్మను విరగగొట్టి నామరూపములు లేకుండా పోవునట్లు నీటిలో**

**కలిపేవారన్నారు. అయితే చరిత్రలో 1750 సంవత్సరముల నుండి వినాయకున్ని దేవునిగా ఊరేగించడము ఉంది. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** నేను చెప్పినది కృతయుగము మాట. అప్పుడది జరిగేది. తర్వాత లేకుండాపోయినది. తర్వాత 1750 సం॥ అప్పుడు మొదలయినది. అయితే అప్పటి ఆచరణలు అన్ని ఉన్నాయి. కానీ అది భక్తిగా మారిపోయినది. ఆనాడు సామాజిక న్యాయమని చేసిన పనిలో ఏనుగును ధనుకునిగా ఎలుకను పేదవానిగా భావించి 'ఎలుక మీద ఏనుగు స్వారీ చేయుట" అనగా 'ధనికుడి పెత్తనము పేదవాని మీద ఉండుట మంచిది కాదని" ఊరు ఎరిగింపు చేసి దానిని లేకుండా చేయుటకు నీటిలో కలిపే వారు. నేడు అదే వుంది అయితే భావములో భక్తి ఏర్పడినది. మొదటిది మాసిపోయినది.

ఇంతవరకు రెండు వందల ఒకటి (201) ప్రశ్నలను ఒకే వ్యక్తి అడగడము జరిగినది. ఆ ప్రశ్నలకన్నింటికి జవాబులు ఇచ్చాము. అయితే అవి వారికి ఎంతవరకు సంతృప్తిని ఇస్తాయో లేదోగానీ ప్రజలకు అనేక రుచుల ఆహారమును ఇచ్చినట్లయినది. మా వైపు నుండి మేము చెప్పేదే కాకుండా ఇతరుల వైపునుండి వచ్చే ప్రశ్నలకు జవాబులివ్వడము వలన చదివే వారికి అనేక రుచులను అందించినట్లవును అను ఉద్దేశ్యముతో హేతువాద ప్రశ్నలను తీసుకొన్నాము. అడిగినవారు హేతువాదులు కాకున్నా హేతువాదము నుండి వారికి వచ్చిన ప్రశ్నలను మాకు పంపడము జరిగినది. చివరికి ప్రశ్నలన్నీ హేతువాదుల వైపునుండి వచ్చినవేయని తెల్పుచున్నాము. ఇంతవరకు చెప్పిన రెండు వందల ఒకటి (201) ప్రశ్నలు హేతువాదులవే. ఇప్పుడు ఇక్కడినుండి వచ్చు ప్రశ్నలు పూర్తి హేతువాదమునకు సంబంధించినవి కాకపోవచ్చును. ఈ ప్రశ్నలలో ఏసును గురించి బైబిలును

గురించిన ప్రశ్నలు ఎక్కువ గలవు. ఇందులో హేతువాద శాతము ఎక్కువ లేనందున సర్వసాధారణ ప్రశ్నలుగానే మేము తలచుచున్నాము. అడిగిన వారు క్రైస్థవములో ఎన్నో సంవత్సరములుగా బోధకులుగా పని చేయుచున్న వారు. ఇక్కడ మూడు మతముల వారికి సంబంధించిన ప్రశ్నలకు జవాబులు ఇవ్వడము జరుగును. అందువలన క్రైస్థవులు అడిగిన ప్రశ్నలకు, అలాగే ముస్లీమ్‌లు అడిగిన ప్రశ్నలకు మేము జవాబులు ఇవ్వదలచాము. **"సర్వ మతములకు ఒకే దేవుడు, ఒకే జ్ఞానము"** అన్నది మా సూత్రము. అందువలన ఏ మత ప్రశ్నకయినా జవాబు ఇవ్వడము మా బాధ్యత.

**1) ప్రశ్న :- దేవుడు ఇచ్చిన మూడు గ్రంథములలో మనుషుల జ్ఞానము చేర్చబడుతూ ప్రజలు జ్ఞానహీనులుగా మారుతుంటే దేవునికి ఇష్టమా?**

**జవాబు :-** ప్రజలు జ్ఞానవంతులు కావాలని దేవుడు భగవంతునిగా అప్పుడప్పుడు వచ్చి తన జ్ఞానమును తెలియజెప్పి పోతున్నాడు. దేవుడు తెచ్చిన మూడు విధానములలో స్వచ్ఛమయిన జ్ఞానమున్నా మనుషులలో కొందరు స్వార్థులు తమ పెత్తనమును చెలాయించుటకు తమ జ్ఞానమును దేవుని జ్ఞానముతో జోడించుచున్నారు. అలా మూడు గ్రంథములలో కొంత కలుషితము ఏర్పడినది. దేవుడు చెప్పని విషయములు, జ్ఞానమునకు సంబంధములేని విషయములను కూడా కొన్ని గ్రంథములో ఇరికించి ఇది దేవుడు చెప్పాడని ప్రజలను మభ్యపెట్టి వారి మత విధానములో నడుపు చున్నారు. దేవుడు చెప్పిన జ్ఞానములో మత విధానము ఏమాత్రముండదు. అయినా దైవగ్రంథములో అది కనిపించుచున్నదంటే దైవగ్రంథములోనికి కూడా మనుషుల మత సంబంధ అజ్ఞాన బోధలు చేరాయని అర్థమగు చున్నది. దానివలన ప్రజలు అజ్ఞానులుగా మారుటకు అవకాశమున్నది. దేవుని జ్ఞానమును ప్రక్కనబెట్టి మనుషుల జ్ఞానమునే ఆచరించుచున్నారు.

దేవుడు జ్ఞానము తెలిపితే దేవుని శ్రమను కాదని తమ జ్ఞానమును అడ్డము పెట్టడము దేవునికి ఇష్టము లేదు. అందువలన ఇది తప్పు, ఇది ఒప్పు అని సత్యాసత్యమును తేల్చి చెప్పు గీటురాయిలాంటి వారిని తిరిగి భూమిమీదికి పంపునని అనుకొంటున్నాము. అలా వచ్చినవాడు ఏ మతములో అజ్ఞానమున్నా దానిని బయటికి తీసి చూపడమే తమ పనిగా పెట్టుకొని స్వచ్ఛమయిన దేవుని జ్ఞానమును మనుషులకు అందేలా చూడగలడు. దేవుని జ్ఞానమును ప్రజ్వరిల్ల చేయు పనిలో మనిషి జ్ఞానము కొట్టివేయబడును. అలా జరుగుట మతఛాందసవాదులకు ఆటంకముగా కనిపించినా దేవుడు పంపిన వానిమీద కుట్రలు, కుతంత్రములు చేసినా దైవము వైపునుండి వచ్చినవాడు ఏమాత్రము భయపడడు. తాను ఏమి చెప్పవలెనో దానినే చెప్పుచూపోవును.

**2) ప్రశ్న :- ఏసు చనిపోయిన 50 రోజులకు ఆదరణకర్త అనగా పరిశుద్ధాత్మ భూమిమీదికి వచ్చెనని యావత్ క్రైస్థవ లోకము నమ్ముతుంది. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ఏసు చనిపోకముందే ఆదరణకర్త వస్తాడని ఏసే చెప్పాడు. ఆదరణకర్త పరిశుద్ధాత్మయేనని కూడా చెప్పాడు. యోహాన్ సువార్త 16వ అధ్యాయములో ఏడవ వచనములో "నేను పోతేనే ఆదరణకర్త మీ వద్దకు వస్తాడు. నేను పోనిదే ఆయన మీవద్దకు రాడని కలదు" చూడండి. **(యోహాన్ 16-7) "నేను వెళ్ళిపోవుట వలన మీకు ప్రయోజనకరము, నేను వెళ్ళని యెడల ఆదరణకర్త మీవద్దకు రాడు. నేను వెళ్ళిన యెడల ఆయనను మీవద్దకు పంపుదును".** దీనినిబట్టి ఏసు వెళ్ళిపోని యెడల ఆదరణకర్త మనవద్దకు రాడన్నమాట. అంతేకాక నేను వెళ్లిన యెడల ఆయనను మీవద్దకు పంపుదును. దీనినిబట్టి

ఏసు పోయి ఏసే ఆదరణకర్తను పంపవలసియున్నది. ఈ మాటల వలన ఏసు పోనిది ఆదరణకర్త రాడని తెలిసిపోవుచున్నది. ముఖ్యముగా ఏసు పోకడ ఆదరణకర్త రాకడకు మూలమైయున్నది. అయితే ఏసు ఎప్పుడు పోతానని ఎవరితోనయినా చెప్పాడా? పోతానన్న మాట వాస్తవమే! 'ఎప్పుడు?' అన్నమాట సందిగ్దము. ఎప్పుడైనా గానీ ఏసు పోయినప్పుడు ఆదరణకర్త రాగలడు. ఏసు ఎప్పుడు పోయాడను విషయములో ఆయన తేల్చి చెప్పలేదు. మనము చూడలేదు.

ఒకవేళ ఎప్పుడో ఒకప్పుడు ఏసు పోయాడనుకొందాము. ఏసు పోయిన దానివలన ఆదరణకర్త యుండును. అయితే ఎవరు ఆదరణ కర్త? ఎవరయినా ఇంతవరకు నేను ఆదరణకర్తను అని చెప్పియున్నారా? ఎవరూ చెప్పలేదు. మనుషులు తమంతకు తాము ఊహించుకొని ఏ ఆధారము లేకుండా మాట్లాడుకొనుచున్నారు. ఏసు చనిపోయిన 50 రోజులకు ఆదరణకర్త వచ్చాడని కొందరు అంటున్నారు. ఏసు ఎప్పుడు చనిపోయాడో ఖచ్చితముగా ఎవరయినా చెప్పగలరా? ఒకవేళ మరణము నుండి లేచి వచ్చిన తర్వాత, సమాధినుండి బయటికి మరణమును జయించి వచ్చిన తర్వాత మరణము లేదు కదా! అటువంటి వాడు 50 రోజులకే చనిపోయాడా? ఇట్లు అనేక సంశయములు వచ్చును. అన్నిటికీ ఏదో ఒకటి సమాధానము చెప్పి ఆదరణకర్త వచ్చాడు అనుకొందాము. వచ్చిన ఆదరణకర్త ఎవరని తెలియగలదు. వచ్చినవాడు నేను ఆదరణకర్తను అని చెప్పడు. అందువలన వచ్చిన వానిని తెలియుటకు వీలు లేదు. ఈ విషయమై యోహాన్ సువార్త 14వ అధ్యాయము, 17వ వచనమును చూస్తే ఇలా కలదు. **(యోహాన్ 14-17) "లోకము ఆయనను చూడదు, ఆయనను ఎరుగదు. గనుక ఆయనను పొందనేరదు. మీరు ఆయనను ఎరుగుదురు. ఆయన మీతో కూడా నివశించును**

**మీలో ఉండును"** అని కలదు. దీనిప్రకారము ప్రపంచపు ప్రజలకు ఆదరణకర్త వచ్చాడను విషయము ఏమాత్రము తెలియదు. ఏసు తన జన్మను చాలించి పోయిన తర్వాత ఎంతో కొంత కాలమునకు ఆదరణకర్తగా ఏసే రావలసియున్నది. వచ్చే ఆదరణకర్త ఎవరో కాదు ఏసే. అందువలన తన శిష్యులను 'మీరు ఎరుగుదురు' అని చెప్పడమేకాక ప్రక్కనే 18, 19వ వచనములలో ఇలా కలదు చూడండి. **(యోహాన్ 14-18,19) "మిమ్ములను అనాథలనుగా విడువను. మీ వద్దకు వత్తును. కొంత కాలమైన తరువాత లోకము నన్ను మరి ఎన్నడును చూడదు. అయితే మీరు నన్ను చూతురు. నేను జీవించుచున్నాను కనుక మీరును జీవింతురు."** ఏసు శరీరముతోయున్నప్పుడు చెప్పిన మాటలివి. కొంతకాలమైన తర్వాత లోకము నన్ను చూడదు. ఈ మాట ప్రకారము శరీరముతోయున్న ఏసును కొంతకాలము వరకు ఈ లోక ప్రజలు చూడగలరని తర్వాత మరి ఎప్పటికీ తనను చూడరని చెప్పాడు. అంటే అప్పుడు శరీరమును వదలిపోయిన తర్వాత ఏసు భౌతికముగా కనిపించడు కావున ఎప్పటికీ లోకము ఆయనను చూడలేదు. అలాంటప్పుడు వేరే శరీరము ధరించి ఆదరణకర్తగా వచ్చిన ఆయనను తెలియరని అర్థము. అందువలన **"లోకము ఆయనను చూడదు, ఎరుగదు"** అని వాక్యములో చెప్పారు.

ఇన్ని విషయములు అర్థముకాకపోయినా వెనుక జరిగిన సంఘటనలో మరియొక విషయమును జ్ఞాపకము చేసుకొని చూస్తే ఇలా కలదు. లూకా, 23వ అధ్యాయము 39 నుండి 43 వరకు చూడండి. **(లూకా-23-39, 40, 41, 42, 43) "వ్రేలాడదీయబడిన ఆ నేరస్థులలో ఒకడు ఆయనను దూషించుచూ నీవు క్రీస్తువు కదా!**

**నిన్ను నీవు రక్షించుకొనుము. మమ్ములను కూడా రక్షించుమనెను. అయితే రెండవవాడు వానిని గద్దించి నీవు అదే శిక్షావిధిలో ఉన్నావు గనుక దేవునికి భయపడవా? మనకైతే ఇది న్యాయమే. మనము చేసిన వాటికి తగిన ఫలము పొందుచున్నాము గానీ ఈయన ఏ తప్పిదము చేయలేదని చెప్పి ఆయనను చూచి ఏసూ, నీవు నీ రాజ్యములోనికి వచ్చునప్పుడు నన్ను జ్ఞాపకము చేసుకొను మనెను. అందుకాయన వానితో నేడు నీవు నాతోకూడా పరదైసులో ఉందువని నిశ్చయముగా నీతో చెప్పుచున్నాననెను."** అప్పుడు ఏసు నేరస్థునికి ఇచ్చిన మాట ప్రకారము పరదేశములో కొంత కాలముండ వలసి వచ్చినది. ఎంత కాలమున్నాడు, ఏ దేశములో ఉన్నాడు అనుటకు వివరము **"ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?"** అను మేము వ్రాసిన గ్రంథమును చూడండి. దీనిప్రకారము ఏసు చనిపోయిన తర్వాత 50 రోజులకే ఆదరణకర్త వచ్చాడు అనుట అవాస్తవము. ఆదరణకర్తగా వచ్చువాడు ఎవరో కాదు ఏసే కనుక ఆయన రెండవరాక కొరకు కొన్ని సంవత్సరముల ముందే ప్రణాళికను ఏర్పరచుకోవలసిన అవసరమున్నది. అందువలన కొన్ని సంవత్సరములు తన ప్రణాళికను రచించుకొన్న తర్వాత ఏసు ఆదరణకర్తగా రావలసియున్నది. ఈ విషయములన్నియూ ఆలోచించకనే ఏసు శిలువ వేయబడిన తర్వాత 50 రోజులకే ఆదరణకర్త వచ్చాడనిగానీ, ఏసు చనిపోయాక 50 రోజులకు ఆదరణకర్త వచ్చాడనిగానీ చెప్పుట అసత్యమగును.

**3) ప్రశ్న :- మోషేకు కనపడిన 'తౌరాతు' గ్రంథమును ఎంతవరకు తెలియజేశాడు. కొందరు ఆదికాండము, నిర్గమకాండము, ద్వితీయోపదేశ కాండము, సంఖ్యా కాండము, ధర్మశాస్త్రము అని అంటున్నారు నిజమా?**

**జవాబు :-** మోషేకు కనబడిన తౌరాతు గ్రంథములోని జ్ఞానమునంతటినీ మోషే ధర్మశాస్త్రము అను పేరుతో చెప్పాడు. మోషే చెప్పిన ధర్మశాస్త్రము వలన అప్పటి ప్రజలు సంపూర్ణ జ్ఞానులుగా తయారయినారు. ఆ కాలములో మోషే చెప్పిన ధర్మశాస్త్రము మంచి పేరుగాంచినది. మోషే చెప్పితే వినిన జ్ఞానమేగానీ, మోషే చెప్పు ధర్మశాస్త్రము ఏ గ్రంథములోనిదో ఎవరికీ తెలియదు. మోషే చూచి చెప్పుచున్న తౌరాతు గ్రంథము మోషేకు ఒక్కనికే ప్రతి దినము కనిపించేది. అందులో చూచిన జ్ఞాన విషయములనే మోషే ప్రజలకు చెప్పేవాడు. మోషే చెప్పినది ధర్మశాస్త్రమనుట నిజము.

**4) ప్రశ్న :- తండ్రి (దేవుడు) తనకిష్టమైన వారిని తనవైపు ఆకర్షించు కొనుటకు దేవుడు పక్షపాతియా?**

**జవాబు :-** మనుషులకు దేవుడు ఇష్టమైతే దేవునికి మనుషులు కూడా ఇష్టులౌతారు. మనుషులు దేవున్ని శత్రువుగా చూస్తే దేవుడు కూడా మనుషులను శత్రువులుగా చూస్తాడు. మనుషుల విధానమునుబట్టి దేవుడుంటాడు. దేవునికి ఇష్టమైన వారున్నారు అంటే ముందు మనుషులకు దేవుడు ఇష్టుడై ఉంటాడు అని అర్థము. మనుషులనుబట్టి దేవుడుండును కనుక దేవుడు తనకిష్టమైన వారిని తనవైపు వచ్చుటకు ఏ ఆటంకము లేకుండా చేయును. దేవునివైపు పోవుటకు మాయ ఒప్పుకోదు. దేవుడు మనిషిని ఒప్పుకొంటే మాయ కూడా ఒప్పుకుంటుంది. దేవునికి ఇష్టుడు కానివానిని దేవుని మార్గములో ముందుకుపోనివ్వక ఆటంకపరచును. దేవుడంటే పూర్తి భక్తి విశ్వాసములు కల్గి, దేవుని మీదనే తన ధ్యాసను పెట్టుకొన్న వానికి దేవుడు కూడా అతనిని ఇష్టపడుట చేత మాయ అతనికి ఏ ఆటంకము కలుగకుండా చేయగలదు. అప్పుడు వాడు దేవునివైపు పోవుటకు మంచి అవకాశము లభించును.

**5) ప్రశ్న :- ఏసు గుజరాత్‌లో 30 సంవత్సరములు ఏమి చేసెను?**

**జవాబు :-** రాబోవు తన రెండవ జన్మను గురించి ప్రణాళికను సిద్ధము చేసుకొన్నాడు. 30 సంవత్సరముల ఫతకములో పుట్టుకనుండి మరణము వరకు ప్రతి విషయము వ్రాసిపెట్టాడు.

**6) ప్రశ్న :- రక్తము అనగా ప్రాణమా? రక్తము దేవుని మొర పెట్టునా?**

**జవాబు :-** రక్తము అనగా జ్ఞానము అని భావించవలెను. సువార్తలలో జ్ఞానమును **"నిబంధన రక్తము"** అని చెప్పియున్నారు. జ్ఞానము ద్వారా దేవున్ని వేడుకోవచ్చును. అలా చేయడమే సరియైన దారి, లేక సరియైన పద్ధతి.

**7) ప్రశ్న :- శరీరములో ఉన్న ఆత్మకు మనిషి ఎన్ని జన్మలు ఎత్తినది తెలుసునన్నారు. అయితే కొందరికే ఎందుకు ఆత్మ పునర్జన్మలను గురించి తెలుపుచున్నది. అందరికీ ఎందుకు తెలుపదు?**

**జవాబు :-** పునర్జన్మలు ఉండడము సత్యమే అయినా ఏ ఆధారము లేకపోతే ఎవరూ నమ్మరను ఉద్దేశ్యముతో అక్కడక్కడ ఎవరికో ఒకరికి వెనుకటి జన్మ జ్ఞాపకము వచ్చునట్లు ఆత్మ చేయుచున్నది. ఆధారము కొరకు చూపవలసినదే కావున 20 లేక 30 సంవత్సరములకు ఒకమారు వివిధ ప్రాంతములలో వెనుక జన్మ జ్ఞాపకము వచ్చి చెప్పుట వలన, ఆ జ్ఞాపకము లన్నీ సత్యమైనవిగా నిరూపణకు వచ్చుట వలన ఎవరయినా పునర్జన్మలను నమ్మవలసి వచ్చును. ఒక ఆధారము ఆ ప్రాంతములో వ్యాపించుట వలన అందరికీ తెలియును. అందువలన అందరికీ పునర్జన్మ జ్ఞాపకములు అవసరము లేదు.

**8) ప్రశ్న :– కర్మానుసారమే ప్రతి మనిషి దినచర్య జరుగును అన్నారు. దీనిని ప్రజలు ఎందుకు గుర్తించరు. జరిగిన పనులనన్నిటినీ నా గొప్ప తనము, నేనే చేశాను అని ఎందుకు అంటున్నాడు?**

**జవాబు :–** ప్రతి చిన్న పని, పెద్దపని అన్నీ కర్మానుసారము ఆత్మ చేయు చుండగా, మనిషి తన అజ్ఞానము చేత తన శరీరములో జరుగు విధానము తెలియక **'నేను'** అను అహము చేత జరిగెడి పనినంతా నేనే చేయుచున్నానని భ్రమించుచున్నాడు. చేయని దానిని చేశానని, చూడని దానిని చూచానని చెప్పుచుండుట వలన కర్మ వలన ఆత్మ చేసిన పాపపుణ్యములు జీవునికే తగుల్కొనుచున్నవి. మనిషి అనవసరముగా చేయని పాపమును తన నెత్తిన వేసుకొంటున్నాడు. ఈ విషయమై యోహాన్ సువార్త 9వ అధ్యాయము, 41వ వాక్యములో ఏసువారు ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి. **(యోహాన్ 9-41) "అందుకు ఏసు మీరు గ్రుడ్డివారయితే మీకు పాపము లేకపోవునుగానీ, చూచుచున్నామని మీరిప్పుడు చెప్పుకొనుచున్నారు గనుక మీ పాపము నిలిచియున్నదని చెప్పెను"** ఈ మాట ప్రకారము వాస్తవముగా జీవుడు గ్రుడ్డివాడు, ఏమీ చేత కానివాడు, చెవిటివాడు మరియు అవిటివాడు. వాస్తవముగా ఏ కార్యమును జీవుడు చేయడము లేదు. శరీరములోని ఏ అవయవము జీవుని ఆధీనములో లేదు. అవయవములన్నియూ ఆత్మ ఆధీనములోయుండి పని చేయుచున్నవి. కర్మప్రకారము ఆత్మ శరీర అవయవములకు శక్తినిచ్చి పని చేయించుచుండగా జరిగే పనిలో ఏ సంబంధము లేని జీవుడు పనులను నేనే చేశానని అహము చేత అనుకొంటున్నాడు. అలా అనుకోవడము మనిషిలోని అజ్ఞానమేయని చెప్పవచ్చును.

**9) ప్రశ్న :- ఇండియాలో ఎన్నో పేరుగాంచిన గొప్ప ప్రదేశములుండగా, మీరు తాడిపత్రిలో చిన్నపొడమలను దైవజ్ఞానము అందించు కేంద్రముగా ఎంచుకొన్నారు ఎందుకు?**

**జవాబు :-** మనిషి స్వయముగా ఏదీ ఎంచుకోలేడు. అంతా దైవ నిర్ణయము ప్రకారము జరుగుచుండును. అందులో భాగమే మేము ఒక ప్రాంతములో యుండి జ్ఞానమును తెల్పుచున్నాము.

**10) ప్రశ్న :- బైబిలులో ప్రతి రచయిత పరిశుద్ధాత్మ పేరుతో వ్రాశారు. అందులో ఒక్క అక్షరమును కలిపినా, ఒక్క అక్షరమును తీసివేసినా గ్రంథములో వ్రాయబడిన తెగుళ్ళు మీకు వస్తాయి అని హెచ్చరిక చేయబడినది. దీనిని మీరు సమర్థిస్తారా? 66 పుస్తకాలను నమ్ముచున్న క్రైస్థవులు మీరు చెప్పుచున్న ఏసుక్రీస్తు వారు 63 సంవత్సరములు బ్రతికారు అను మాటను జీర్ణించుకోలేకున్నారు. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** నేను "ఏసు 63 సంవత్సరములు బ్రతికారు" అని చెప్పినది నాలుగు సువార్తలకు సంబంధించిన పాఠములలో ఎక్కడా కలుపలేదు. నాలుగు సువార్తలకు అతీతముగాయున్న మాటను చెప్పాను. నా మాట బైబిలులో భాగము కాదు. నేను చెప్పిన మాట అందరూ వినవలెననిగానీ విశ్వసించవలెననిగానీ చెప్పడము లేదు. నాకు తెలిసిన సత్యమును, చరిత్రలో జరిగిన సత్యమును చెప్పాను. అంతేగానీ వినవలెనని ఎవరినీ బలవంతము చేయలేదు. అది వారి ఇష్టాయిష్టముల మీద ఆధారపడియుండును. బైబిలు గ్రంథము అంటే మొత్తము 66 పుస్తకముల కలయిక. అందులో సాక్ష్యాత్తూ దేవుడు మారు వేషములో యుండి మాట్లాడిన మాటలను వ్రాసిన పుస్తకములు నాలుగు రకములుగాయున్నవి. అవియే నాలుగు సువార్తలు. నాలుగు

సువార్తలలో ఒక్క అక్షరమును కూడా కదలించుటకు వీలులేదు. నాలుగు సువార్తలు సత్యసమేతముగాయున్నవి. మిగతా పుస్తకముల గురించి మేము పట్టించుకోవడము లేదు. అందులో కూడా జ్ఞానమే యున్నా 62 పుస్తకములకంటే దగ్గరైనవి నాలుగు సువార్తలనునవే. దైవగ్రంథములు ప్రపంచములో మూడే గలవు. అవి భగవద్గీత (తౌరాత్), ఇంజీలు (బైబిలు), ఖురాన్ అనునవి. ఈ మూడు గ్రంథములలో మానవ కలుషిత వాక్యములు చేరకూడదు. ఒక వాక్యమునకు భావమును తప్పు చెప్పినా శిక్ష తప్పదని ఖురాన్ గ్రంథములో దేవుడు హెచ్చరించినా దైవగ్రంథములలో కలుషిత వాక్యములు అక్కడక్కడ కనిపిస్తూనే యున్నవి. దేవుడంటే భయము లేనివారు చేసిన పనియని మనకు అర్థమగుచున్నది. అందువలన మూడు గ్రంథము లను వడగట్టి చదువుకోవలెను.

**11) ప్రశ్న :- మీరు ఒక సందర్భములో బాప్తిస్మమిచ్చు యోహాన్‌ను క్రీస్తువుకు గురువు అన్నారు. క్రీస్తుకు గురువులుంటారా? జగత్ గురువు ఒక్కడే కదా!**

**జవాబు :-** ప్రపంచములో గురువులు రెండు రకములు. కనిపించే గురువు కనిపించని గురువు అని రెండు విధములు గలరు. వారిలో యోహాన్ కనిపించే గురువు మాత్రమే. బయట గురు సాంప్రదాయము ప్రకారము గురుబోధ లేక గురు ఉపదేశము, లేదా బాప్తిస్మము తీసుకోవలసియుండును. లోక సాంప్రదాయము ప్రకారము ఏసు యోహాన్ దగ్గర బాప్తిస్మము తీసుకొన్నాడు. అయితే కనిపించని గురువు జగత్ గురువు ప్రపంచమున కంతటికీ గురువుగా ఉంటాడు. ఎవరయితే జగత్ గురువో ఆయన ఏసు. ఏసు జగత్ గురువు అయినా బాహ్య సాంప్రదాయము ప్రకారము యోహాను దగ్గర ఉపదేశమును పొందాడు. ఏసుకు బాప్తిస్మమిచ్చిన యోహాన్ ఏసు బాప్తిస్మము పొందుటకు తన దగ్గరకు రాకముందే ఈ వాక్యమును చెప్పి

యున్నాడు చూడండి. **(మత్తయి 3-11) "మారు మనస్సు నిమిత్తము నేను నీళ్ళతో మీకు బాప్తిస్మము ఇచ్చుచున్నాను. అయితే నా వెనుక వచ్చుచున్నవాడు నాకంటే శక్తివంతుడు. ఆయన చెప్పులు మోయుటకైనను నేను పాత్రుడను కాను. ఆయన పరిశుద్ధాత్మ తోనూ, అగ్నితోనూ మీకు బాప్తిస్మమిచ్చును."** లోక సాంప్రదాయము కొరకు ఏసుకు యోహాను బాప్తిస్మము ఇచ్చాడని ఈ వాక్యమును బట్టి తెలియుచున్నది.

**12) ప్రశ్న :- క్రిస్టమస్ డిశంబరు 25న అని యావత్ క్రైస్తవము చేస్తుంది. క్రీస్తు పుట్టుక డిశంబర్ 25 కాదు కదా?**

**జవాబు :-** డిశంబర్ 25వ తేదీన ఏసు పుట్టకపోయినా, పుట్టినా రెండింటి వలన ఎవరికీ ఏమీ ప్రయోజనము లేదు. ఆయన పుట్టిన దినమును గౌరవించు నిమిత్తము డిశంబర్ 25వ తేదీన ఏసు పుట్టినదిన పండుగ చేయుచున్నాము. చేయుచున్న పనిలోని భావమే ముఖ్యమగుట వలన పండుగ ఎప్పుడు చేసినా ఒక్కటే.

**13) ప్రశ్న :- ప్రతిమ ఆరాధన చేయు మీరు క్రీస్తు వారి ప్రతిమను పెట్టు ధైర్యము ఎందుకు చేయలేకపోయారు?**

**జవాబు :-** నేను ఇంతవరకు ప్రతిమను ఆరాధించలేదు. చిన్నవయస్సులో మా పెద్దలు గ్రామదేవతలయిన సుంకులమ్మ, పెద్దమ్మ దేవతలకు బలులు ఇచ్చి ఆరాధించెడివారు. వారివెంట పోయి వారు చేయు పూజలను చూచాను తప్ప స్వయముగా ఏనాడూ ఎవరినీ ఆరాధించలేదు. మా ఆశ్రమములో కృష్ణ ప్రతిమయున్నది. ఇక్కడికి వచ్చు భక్తులు కృష్ణ ప్రతిమకు పూజలు చేయుచుందురు గానీ నేను ఎప్పుడూ చేయి ఎత్తి కూడా

నమస్కారము చేయలేదు. నా చిన్నతనములోనే మా పెద్దలు సత్యనారాయణ వ్రతము చేయాలని చెప్పితే పూర్తి వ్యతిరేఖించి ఆ వ్రతమును ఆపివేశాను. తర్వాత ఇంటిలో మా నాన్నగారు చనిపోతే ఆ కార్యక్రమములలో పాల్గొన లేదు. దినములు వగైరా ఏదీ చేయలేదు. మొదట నన్ను నాస్తికుడు అని అందరూ అన్నారు. ఇప్పుడు కూడా కొందరు నా బోధలు అర్థము కానివారు నేను నాస్తికత్వమును బోధిస్తున్నానని అనువారు కూడా కలరు. ప్రతిమను నేను ఆరాధించనంతమాత్రమున అందరినీ అలాగే ఉండమని చెప్పలేదు. కృష్ణ ప్రతిమను గౌరవార్థము ఆరాధించమని చెప్పుచున్నాము. అలాగే ఏసుప్రభువు చిత్రమును పెట్టి నమస్కరించమని చెప్పాము. మా సలహా మీద వైజాగ్ దగ్గర మజ్జివలస ఆశ్రమములో ఏసు ప్రతిమను పెట్టడమైనది. కృష్ణుడే ఏసు అని చెప్పు నేను ఇద్దరినీ ఒకే గౌరవముగా నమస్కరించ మన్నాను.

**14) ప్రశ్న :- ఇంజీలు అనబడిన నాలుగు సువార్తలలో మానవుల జ్ఞానము చేరియున్నదా? అందులోనుంచి తీసివేయవలసినదేమయినా ఉన్నదా?**

**జవాబు :-** నాలుగు సువార్తలలో మానవ కల్పితములు ఏమీ లేవు. అంతా దేవుని జ్ఞానమే కలదు.

**15) ప్రశ్న :- మీరు కొన్ని విషయములను చెప్పిన వాటినే మరల మరల జ్ఞాపకము చేస్తారు ఎందుకు?**

**జవాబు :-** మరచిపోవుటకు అవకాశమున్న విషయములను, ముఖ్యమైన విషయములను మరల మరల జ్ఞాపకము చేస్తుంటాము.

**16) ప్రశ్న :- శ్రీకృష్ణుడు ఎదురు కాళ్ళతో జన్మించాడు అన్నారు. మరి ఏసువారు ఎలా జన్మించారు. సామాన్యమైన మనుషులు కూడా**

**అప్పుడప్పుడు అలాగే ఎదురు కాళ్ళతో పుట్టుచుందురు. వారేమయినా ప్రత్యేకులా?**

**జవాబు :-** కృష్ణుడు ఎదురు కాళ్ళతో జన్మించినది వాస్తవమే. కృష్ణుని శరీరమునకు తల్లిగర్భములోనే ప్రాణమున్నదని నిరూపించుటకు అలా పుట్టవలసి వచ్చినది. కాళ్ళు గర్భమునుండి బయట పడిన వెంటనే ఒక కాలును కదలించుట వలన శిశువుకు గర్భము లోపలే ప్రాణమున్నదని అర్థమగుటకు సాక్ష్యముగా కాళ్ళతో పుట్టడము, కాళ్ళు కదలించడము జరిగినది. ఒక విషయము యొక్క నిరూపణ కొరకు ఒకమారు జరిగిన సరిపోవును. రెండవమారు జరుగవలసిన అవసరము లేదు. అందువలన ఏసు విషయములో అలా జరుగలేదు. కృష్ణుడు ఏసు ఇద్దరూ ఒక్కరే అగుట వలన ఏసు పుట్టుకలో ఎదురు కాళ్ళతో పుట్టడము జరుగలేదు. తర్వాత కాలములో చాలామంది ఎదురు కాళ్ళతో పుట్టడము జరిగినది. వారిలో ఏ ప్రత్యేకత లేకున్నా వారిని దేవుడు అలాగే పుట్టించాడు. దానివలన కృష్ణుని జన్మను అందరూ గుర్తించుటకు వీలు లేకుండా పోగలదని, కృష్ణున్ని సామాన్య మనిషిగానే లెక్కించుకోవాలని అలా మిగతా వారిని పుట్టించడము జరిగినది. మిగతా వారు అలా పుట్టడము వలన కృష్ణుని విషయము కూడా సర్వసాధారణమై పోగలదు. మనుషులందరికీ కృష్ణుని విషయము, కృష్ణుని ప్రత్యేకత తెలియకూడదనే ఉద్దేశ్యముతోనే దేవుడు కొందరిని అలా పుట్టించాడు. భగవంతుడైన కృష్ణున్ని భక్తి, శ్రద్ధ యున్నవారు మాత్రము గుర్తించునట్లు, భక్తి శ్రద్ధ లేనివారు గుర్తించనట్లు దేవుడు మిగతావారిని కూడా కృష్ణుడు పుట్టినట్లు ఎదురు కాళ్ళతో పుట్టించడము జరిగినది.

**17) ప్రశ్న :- సృష్ట్యాదినుండి మూడు యుగములలో ఒకే జ్ఞానమున్నా ఒక్క కలియుగములో మాత్రము జ్ఞానము మనుషుల మధ్యలో అనేక**

**మతములుగా కన్పించుచున్నది. అన్ని మతములకు మీ జ్ఞానము ఒకే జవాబుగా నిలబడినా కొందరు వారి అజ్ఞానమును వీడి మీ జ్ఞానమును తెలియక ఒక్కొక్కరు ఒక్కొక్క దారిలో పోవుచూ అజ్ఞానములో జీర్ణించుకొని పోయారు. అది వారి కర్మనా? లేక అజ్ఞానమా?**

**జవాబు :-** సృష్ట్యాదినుండి ఏ మతములు లేకున్నా ఒకే హిందూ (ఇందూ) సమాజమేయున్నా మనుషులలో అప్పుడు కూడా జ్ఞానము అజ్ఞానము రెండూ ఉండేవి. జ్ఞానముతో కూడుకొన్నవి ధర్మములు. అజ్ఞానముతో కూడుకొన్నవి అధర్మములు. మూడు యుగములలో ధర్మములు అధర్మములు రెండూ యుండేవని తెలియుచున్నది. ప్రస్తుత కలియుగములో గత యుగములకంటే అధర్మముల సంఖ్య కొంత పెరిగినది. ధర్మముల సంఖ్య ఎట్లుండేది అట్లే యుంటుంది. సృష్ట్యాదినుండి మూడు ధర్మములు, నాలుగు అధర్మములు ఉండగా, కలియుగములో మతము అను అధర్మము క్రొత్తగా పుట్టుకొచ్చినది. మతము అను అధర్మము గతములోగల నాలుగు అధర్మములకంటే ఎక్కువ బలముగా యున్నది. మూడు యుగముల వరకు గల అధర్మములను దృష్టిలో పెట్టుకొని భగవద్గీత వానిని అణచివేయు జ్ఞానముతో బయటకు వచ్చినది. తర్వాత వచ్చిన ఇంజీలు గ్రంథము వచ్చినప్పుడు కూడా 'మతము' అను అధర్మము లేకుండెడిది. తర్వాత తయారయిన ఖురాన్ గ్రంథములో మతమను అధర్మమును గురించి పెద్దగా వ్రాయకున్నా అక్కడక్కడ కొన్ని మత వ్యతిరేఖ వాక్యములు చెప్పియున్నా వాటికంటే ఎక్కువ మత ప్రభావము దానిలో కలిసిపోయినది. అందువలన ఆ గ్రంథమును అడ్డము పెట్టుకొని మతమును అభివృద్ధి చేయువారు కూడా తయారయినారు. అందులోని జ్ఞానమంతా మతమునకు అతీతమని

చెప్పకుండా మతమునకు సంబంధించినదేయని ముస్లీమ్‌లు ప్రచారము చేయుచున్నారు. అందువలన మత వ్యతిరేఖ భావములున్నా అవి ఎక్కడా కనిపించని స్థితిలో ఉండిపోయినవి. ముస్లీమ్ మతము కొరకే ఖురాన్ గ్రంథమని ప్రచారమయినది. మిగతా అందరూ అలాగే ఖురాన్ ముస్లీమ్‌లదేయని అనుకోవడము జరుగుచున్నది. అలా అనుకోవడము వలన దానిని మతగ్రంథముగా తలచి మిగతా మతస్థులు ఖురాన్ గ్రంథమును చదవడము లేదు. అయితే ఖురాన్ గ్రంథము సర్వమానవుల జ్ఞానమని తెలియకుండా పోవడము వలన, ముస్లీమ్‌లదే అనుకోవడము వలన మతమను అధర్మమునకు కొమ్ములు పెరిగిపోయాయి. ఎప్పటికయినా మతమను అధర్మము దేవుని జ్ఞానము ద్వారానే అణిగిపోవలసియున్నది. అయినా మా జ్ఞానములో ఎక్కువగా మూడు దైవగ్రంథములను సమాన గౌరవముతో చెప్పినా కొందరు అజ్ఞానులు మా జ్ఞానమును కూడా మతములలోనికి కలుపుచున్నారు. మతము కర్మకు సంబంధించినది కాదు. అజ్ఞానమునకు సంబంధించినదని తెలియవలెను.

**18) ప్రశ్న :- మోషే ద్వారా కర్మ సిద్ధాంతము యూదులలోనికి ప్రవేశించినది. క్రీస్తువారు కర్మ సిద్ధాంతమును కోపముగా చెప్పలేదు. కృపను గూర్చి రక్షణ గూర్చి తెలిపిరి. అయితే పౌలు కర్మ సిద్ధాంతమును పూర్తిగా నిర్మూలించు బోధను చేసి, ధర్మశాస్త్రము నిష్ప్రయోజనమని బోధించి గత 2000 సంవత్సరములనుండి విస్తరించులాగున బోధించినారు. ఈ నిప్పును ఆర్పలేకపోవును కదా?**

**జవాబు :-** మోషే ద్వారా కర్మసిద్ధాంతము వచ్చినదన్నారు. అదే కర్మ సిద్ధాంతమునే ఏసు కృప, రక్షణను కూర్చి చెప్పాడు. కర్మ సిద్ధాంతము

కర్మను దహించివేయునదిగా యున్నది. కావున దానిని అగ్నితో సమానముగా పోల్చి పౌలు చేసిన ప్రచారము అగ్నిని ఆర్పగలదాయని అడిగినట్లున్నది. పౌలు ఏమి చెప్పాడో నాకు తెలియదు. నాకు తెలిసినది ఏసు చెప్పినది అగ్నియని మాత్రమే తెలుసు. అగ్ని అన్నిటినీ కాల్చునుగానీ అది ఎప్పటికీ ఆరిపోదు. కట్టెతో మండిన అగ్ని నీటితో ఆరిపోవచ్చునుగానీ, మనిషలో మండే జ్ఞానాగ్నిని ఏదీ ఆర్పలేదు. అందువలన ఏసు ఇచ్చినది **"ఆరని అగ్ని"**యని తెలియవలెను.

**19) జవాబు :- కొందరు పరిశోధకులు తమ పరిశోధనల ద్వారా దైవ కణాన్ని సంపాదించి దేవున్ని సాధించి మృత్యువును జయించ ప్రయత్ని స్తున్నారు. సాధించు రోజులు దగ్గరే ఉన్నాయి అంటున్నారు. వారి మాట నిజమవుతుందా? మానవుడు మృత్యువును జయించగలడా?**

**జవాబు :-** ఎందరో పరిశోధకులు ఏవేవో సాధించాలని ప్రయత్నము చేయుచున్నారు. అంతమాత్రమున అందరూ అన్నీ సాధించలేకపోయారు. ఎందరో పరిశోధనలు ఎన్నో విషయముల మీద జరుపగా, అందులో కొన్ని మాత్రము సిద్ధాంతపరముగా సాధించగలిగారు. మీరు చెప్పిన పరిశోధకులు ఏకంగా దైవ కణాన్ని కనుగొనాలనుకొన్నారు. దేవుడుగానీ, దైవకణముగానీ కనిపించునది కాదు. అట్లే ఎవరికీ సాధ్యపడునది కాదు, దొరుకునది కాదు. అది అగమ్యగోచరమైనది. దానిని తెలియుటకు బ్రతికియున్న వారికి ఏ ఒక్క ఆధారము లేదు. అందువలన ఏ పరిశోధకుడు దేవున్ని గానీ, దైవకణమునుగానీ తెలియలేడు. అట్లే మృత్యువును జయించలేరు. మనిషి ఎప్పుడు పుట్టాడో అప్పుడే మృత్యువు వాని జన్మహక్కుగా యున్నది. జన్మహక్కు జన్మ కల్గిన వానికి తప్పక లభించును. హక్కుద్వారా నీకు

తెలిసినా, తెలియకున్నా సంక్రమించు ఆస్తిలాంటిది మృత్యువు. దానిని నీవు వద్దన్నా రాకుండా మానునది కాదు. నీ మీద నీ భార్యాపిల్లలకు లేని హక్కు నీ మృత్యువుకున్నది. అందువలన నీ భార్యాపిల్లలు నీ దగ్గరకు రాలేకపోయినా నీ మృత్యువు మాత్రము నీవద్దకు వచ్చి తీరును. దానిని జయించుటకు ఎవరికీ సాధ్యము కాదు.

**20) ప్రశ్న :- భూమిమీద జన్మించిన ప్రతివాడు సమాజానికి తెలియని క్రొత్త సంగతులు బోధించినంతమాత్రమున భగవంతులౌతారా? గురువులు అవుతారా? ఏ కోణములో ఆలోచిస్తే ఆ కోణములో అనేకమైన జ్ఞానము తెల్పవచ్చును కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** భూమిమీద ఎందరో ఎన్నో పరిశోధనల ద్వారా ఎన్నో క్రొత్త విషయములను కనిపెట్టగలిగారు. వాటివలన ఎందరో సుఖములు అనుభవించుచున్నారు. అంతమాత్రమున ఎవరూ గురవులు కారు. దేవుడు ఒక్కడే భూమిమీద భగవంతునిగా పుట్టును. ఆయన ఒక్కడే ఎప్పటికయినా గురువుగా రాగలడు. ఆయన తప్ప ఎవరిని గురువులుగా చెప్పుకున్నా వారు గురువులు కాలేరు. మనుషులలో మాలాంటి కొందరు బోధకులున్నా బోధకుడు గురువు కానేరడు. మొత్తానికి మనుషులు ఎవరూ గురువు కాదు. భగవంతుడు ఒక్కడే గురువగును. బయటి ప్రపంచములో ఎవరయినా గురువు అని పేరు పెట్టుకొంటే అతను గురువు యొక్క నమూనాను గుర్తు చేయువాడేగానీ నిజమైన గురువు కాడు.

ఇంతటితో క్రైస్తవ బోధకులయిన పాస్టరుగారి ప్రశ్నలు అయిపోయాయి. ఇప్పుడు శంకరరావు అని ఒక మాస్టరుగారు అడిగిన మూడు ప్రశ్నలకు జవాబు చెప్పుకొందాము. తర్వాత నెల్లూరు జిల్లా నుంచి

వీరనారాయణ రెడ్డిగారు అడిగిన ఐదు ప్రశ్నలకు జవాబు చెప్పుకుందాము. తర్వాత మురళీకృష్ణ గారి మూడు ప్రశ్నలకు జవాబును చెప్పుకొందాము.

**1) ప్రశ్న : మనిషి శరీరములో ఆత్మ, భగవంతుని శరీరములోని ఆత్మ ఒక్కటే అన్నారు. కానీ "గుత్తా" గ్రంథములో పరమాత్మ జ్ఞానము పరమాత్మకు తప్ప ఆత్మకు కూడా తెలియదు. అందువలన అన్ని శరీరములలోనున్న ఆత్మ దేవుని జ్ఞానమును బోధించదు. ఒక్క పరమాత్మ అంశ కల్గిన ఆత్మ మాత్రము దేవుని జ్ఞానమును తెల్పును అన్నారు. కావున భగవంతుని ఆత్మ మనిషిలో గల ఆత్మ ఒక్కటేనా?**

**జవాబు :-** దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులెవరికీ తెలియదు అని ఖురాన్ గ్రంథములో సూరా 3, ఆయత్ 7 లో చెప్పియున్నారు. ఆ మాట పైన నేను చెప్పినమాట రెండు ఒకటేయని చెప్పవచ్చును. భగవంతుడైన వాడు పాపమును క్షమించగలిగితే భగవంతుని శరీరములోయుండే ఆత్మే మనిషి శరీరములో యున్నప్పుడు మనిషి ఇతరుల పాపమును ఎందుకు క్షమించలేదు? అని ఎవరయినా అడిగినప్పుడు పైన నేను చెప్పినట్లు చెప్పడమే తగిన జవాబగును. ఒక్క భగవంతుడే జ్ఞానమును చెప్పగలిగినప్పుడు అందరిలో ఒకే ఆత్మయుంటే సాధారణ మనిషి కూడా జ్ఞానమును చెప్పవచ్చును కదా!యని అడిగినప్పుడు నేను **"గుత్తా"** గ్రంథములో చెప్పిన మాటనే చెప్పాలి. మనిషి శరీరములో భగవంతుని శరీరములో వేరువేరు ఆత్మలు లేవు. ఒకే ఆత్మ అందరిలో నివసించుచూ తన పనిని తాను చేయుచున్నది. అయితే అందరిలో ఒకే ఆత్మవుంటే భగవంతుని శరీరములో చేసిన కర్మ క్షమాపణ మనిషి శరీరములోయున్న ఆత్మ ఎందుకు చేయలేదు? అని అడిగితే ఆత్మ కర్మనుబట్టి పని చేయును. అట్లే దేవుని ఆజ్ఞను బట్టి

కూడా పని చేయును. ఆత్మ తనకంటే దేవుడు పెద్దయను జ్ఞప్తిలోనే యున్నది. సామాన్య మానవుని శరీరములో ఆత్మ భగవంతుడు చెప్పినట్లు జ్ఞానము చెప్పగలదు, కర్మ క్షమాపణ చేయగలదు. అయితే దానికి ఒక పద్ధతి కలదు. కర్మను అనుభవింపజేయు ఆత్మ తన ఇష్టప్రకారము కర్మను అనుభవించునట్లు చేయదు. ఒక లెక్కప్రకారము కాలచక్రము యొక్క గమనమునుబట్టి ఏ సమయములో ఏ కర్మ అనుభవింపజేయవలెనో ఆ సమయములో అదే కర్మను అనుభవింపచేయును. కర్మను అనుభవింప జేయుటే పనిగా యున్నా ఆ పనిని శాస్త్రబద్ధముగా కర్మను, కాలమును అనుసరించి చేయడము జరుగుచున్నది. అదే విధముగా ఆత్మకు తెలియని జ్ఞానముగానీ, ఆత్మ చేయలేని పనిగానీ, ఆత్మకు లేని అధికారముగానీ ఏదీ లేదు. అన్నీ ఆత్మ చేతిలో యున్నా కర్మాచరణ కాలమును అనుసరించే చేసినట్లు, మిగతా అధికారములను గానీ, దేవుని జ్ఞానమును బోధించడములో గానీ దేవుని సంకల్పమును అనుసరించి చేయుచున్నది. అన్నీ తన చేతిలో యున్నా ఏదీ స్వయముగా చేయదు. దేవుని ఆజ్ఞను అనుసరించి ఆత్మ పని చేయునుగానీ స్వయముగా ఎప్పుడుగానీ, ఏ సందర్భములోగానీ చేయలేదు, చేయదు. అక్కడే దేవుని గొప్పతనమును ఆత్మ కనబరచుచున్నది. ఒక మనిషి చనిపోతే వాని కర్మను అనుసరించి ఏ జన్మకు పంపవలెనో ఆ జన్మకే పంపుచున్నది. అయితే ఆ ఆధికారమును దేవుడే ఇచ్చాడు. దేవుని ఆజ్ఞ మేరకే మనుషులను జన్మలకు పంపుచున్నాను అని చెప్పుచున్నది. ఈ అధికారములన్నియూ ముందే దేవునివద్దనుండి ఆత్మ పొందియున్నాడు. ఆ విషయమును ఇంజీలు గ్రంథమందు యోహాను సువార్త 5వ అధ్యాయములో 26వ వచనమును చూస్తే తెలియగలదు.

**(యోహాను 5-26) "తండ్రి (దేవుడు) ఎలాగు తనంతట తానే**

**జీవముగల వాడై యున్నాడో అలాగే కుమారుడు (ఆత్మయు) ను తనంతట తానే జీవము గలవాడైయుండుటకు కుమారునికి అధికారము అనుగ్రహించెను"** ఈ వాక్యము దేవుడు ఆత్మకు కలుగజేసిన అధికారమును గురించి చెప్పినది. సృష్ట్యాదిలోనే సర్వ అధికారములు దేవునివద్దయుండి పొందిన ఆత్మను ఎవరి శరీరమునుండి ఏమి చేయవలెనో అదే చేయుచున్నది. శరీరములో ఆత్మే దేవుడై దేవుని అధికారముతో అన్ని కార్యములను శాస్త్రపద్ధతిగా చేయుచున్నది. అధికారమున్నదని విధి విధానమును అనుసరించక ఏమీ చేయడము లేదు. సర్వప్రపంచమంతా అన్ని జీవరాసులలో యున్న ఆత్మ ఒక్కటే. అయినా భగవంతుని శరీరము నుండే జ్ఞానము చెప్పుచున్నది. మనిషి శరీరమునుండి వినుచున్నది. ఆత్మను గురించి తెలియడము చాలా కష్టము. కష్టమైన ఆత్మను గురించి తెలియడమునే **"ఆధ్యాత్మికము"** అని అంటున్నారు. సంపూర్ణ ఆధ్యాత్మికము తెలిసినవాడు ఆత్మేయని తెలియవలెను. ఎంతో ఓపిక, పట్టుదల, శ్రద్ధయుంటేనే ఆత్మను తెలియుటకు అవకాశముండును.

**2) ప్రశ్న :- మొదట ఏమీకాని దేవుడు ప్రకృతిని ఆత్మను తయారు చేయగా తర్వాత వాటినుండి సృష్టి తయారయినదా? లేక మొదట దేవుడే మొత్తము అంతా ఒకేసారి సృష్టించాడా? అటువంటప్పుడు సృష్టికర్తయని ఆత్మను అనాలా? పరమాత్మను అనాలా?**

**జవాబు :-** మొదట సృష్టి పూర్వము పనిచేయగల దేవుడు మొదట తననుండి ప్రకృతిని తయారు చేశాడు. తర్వాత కొంత వ్యవధిలో జీవాత్మ, ఆత్మను ఒకేమారు సృష్టించాడు. ఒక లెక్కాచారము ప్రకారము జీవులను తయారు చేసినవాడు దేవుడే అయినందున సృష్టికర్తయని దేవున్ని అనుచున్నాము.

సృష్టిని తయారు చేసిన వాడు దేవుడుకాగా, అప్పటి నుండి సృష్టిని అంతటినీ ఆత్మే నడుపుచున్నది. సృష్టికర్తయిన దేవుడు సృష్టి తర్వాత ఆయన ఏమీ చేయడము లేదు. చేసేవాడంతా ఆత్మేయని తెలియవలెను.

**3) ప్రశ్న :- గీతలో అక్షర పరబ్రహ్మాయోగమందు మోక్షము పొందు వ్యక్తి మరణించే కాలమును గురించి చెప్పుచూ, దానికి శరీరము లోపలగల కాలచక్రములోని సూర్యచంద్ర గమనాల వలన ఉత్తరాయణము దక్షిణా యనము ఏర్పడునని చెప్పారు కదా? కానీ బయట సూర్యరశ్మి, ఆకాశము మేఘావృతము ఉత్తరాయణములో మోక్షము పొందటానికి ఏమి సంబంధము?**

**జవాబు :-** బయట కాలమునకు లోపల కాలచక్రమునకు సంబంధము గలదు. అందువలన బయట ఉన్న దానినిబట్టి లోపల గలదని తెలియవలెను. సూర్యరశ్మి విషయమునకు వస్తే నీ మెదడు ఎప్పుడు మజ్జుగా యుంటుందో అప్పుడు లోపల నీ మీద సూర్యరశ్మి లేదనీ, ఎప్పుడయితే నీవు చురుకుగా ఉన్నావో అప్పుడు లోపల నీ మీద సూర్యరశ్మి బాగా యున్నదని తెలియవలెను.

## వీరనారాయణ రెడ్డి గారి ప్రశ్నలు :-

**1) ప్రశ్న :- విశ్వములో బ్లాక్‌హోల్‌నందు ప్రకృతి లేదు అని విన్నాము. రమణమహర్షి ఒక సందర్భములో మాట్లాడుచూ ఎచ్చట లయము ఉండునో అదే ఉత్పత్తి స్థానము అని అన్నాడు. బ్లాక్‌హోల్ గ్రహములను లయము చేయుచున్నది. కావున దానిని ఉత్పత్తి స్థానము (ఆరిజన్) అని చెప్పుటకు వీలుపడుతుందా?**

**జవాబు :-** రమణ మహర్షి గారు మాట్లాడేది చాలా అరుదు. ఒకవేళ మాట్లాడినాడనుకొందాము. అది సరైన భావమును ఇచ్చునదిగా ఉండదు. అటువంటప్పుడు ఆయన మాటలో సత్యము లేదని తెలియుచున్నది. లయములో ఉత్పత్తి ఉండదు. జీర్ణాశయములో ఆహారము నాశనమై పోవుచున్నది. అక్కడే ఆహారము తయారగునని చెప్పడము తిక్క అంటారు.

**2) ప్రశ్న :- జీవులమయిన మనము భౌతిక శరీరమునుండి సూక్ష్మ శరీరమును వేరుబరచలేకున్నాము. మరణములో మాత్రము సూక్ష్మ శరీరము స్థూలశరీరమునుండి విడువడుతుంది. సూక్ష్మ శరీరముతో యున్న జీవులు స్థూల శరీరములోనికి ప్రవేశించి మరలా బయటికి రాగలవు. పరకాయ ప్రవేశము నేర్చిన యోగులు తమ ఇచ్ఛానుసారము స్థూల శరీరమునుండి బయటికి రాగలరు, లోపలికి పోగలరు. భౌతిక శరీరదారులయందు సూక్ష్మశరీరము విడివడక బంధింపబడియుండునా?**

**జవాబు :-** మనిషియందుగానీ, విగ్రహయందుగానీ స్థూల శరీరమందు సూక్ష్మ శరీరము ఇమిడియుండును. అయితే అది ఒకమారు బయటకు వస్తే తిరిగి రెండవమారు బయటికి వచ్చుటకు సులభమగును. ప్రతిమలో నుండి బయటికి వచ్చిన సూక్ష్మము తిరిగి అదే ప్రతిమను చేరవచ్చును. తర్వాత సులభముగా బయటికి రావచ్చును. అలా ఎన్ని మార్లయినా లోపలికి బయటికి పోవచ్చును, రావచ్చును. అయితే మనిషియందు ఒకమారు బయటికి వస్తే తిరిగి చేరుటకు అవకాశము లేదు. ఎందుకనగా! సూక్ష్మ శరీరము తిరిగి స్థూల శరీరమును చేరాలంటే వదలబడిన శరీరములో వాయువులుండవలెను. ఏమీలేని శరీరము మృత శరీరము క్రిందికి జమ కట్టబడును. మృత దేహమును సూక్ష్మశరీరము చేరలేదు. అదే పరకాయ ప్రవేశము నేర్చిన వారికి ఎలా సాధ్యమయితావుంది? అని మీరు అడుగ

వచ్చును. ఆ విద్య దాదాపు పన్నెండు సంవత్సరములు నేర్వవలసియున్నది. అందులో నేర్చేది తాను వదలుతున్న శరీరములో ఉప వాయువులను వదలి బయటికి రావడమే. నేను ఉపవాయువులను వదలి వెళ్ళుచున్నానని సంకల్పము చేయుటే అందులోని అభ్యాసము. ఆ విధముగా ఉప వాయువులను వదలి బయటికి ఒకమారు పోయి తిరిగి తన శరీరములో వచ్చి చేరవచ్చును. ఉపవాయువులు ఉండుట వలన ఆ శరీరము చెడి పోకుండా ఉండును. ఉపవాయువులు లేని శరీరములో పరకాయ ప్రవేశము చేయువారు కూడా చేరలేరు. కొన్ని కథలలో చనిపోయిన పులిలో దూరినట్లు, లేక చనిపోయిన ఇతర జంతువులలో దూరినట్లు, ఇంకా చనిపోయిన మనిషిలో దూరినట్లు వ్రాసుకొన్నారు. అదంతా అసత్యము. బ్రతికిన మనిషిలో దయ్యము చేరినట్లు చేరవచ్చునుగానీ, పూర్తి చనిపోయిన శరీరములో చేరుటకు సాధ్యము కాదు. అలా సాధ్యమయితే చనిపోయిన వాడు తన దేహమును తిరిగి చేరవచ్చును. పరకాయ ప్రవేశము ఒక విద్య. ఉపవాయువులను వదలి బయటికిపోయి తిరిగి లోపలికి చేరడమనే అభ్యాసము చేయుదురు. అది ఒక రోజు లేక ఒక సంవత్సరముతో సాధ్యపడేది కాదు. ఏకంగా 12 సంవత్సరములు అభ్యాసము చేయగా సాధ్యమగును. అంత శ్రమపడి ఆ విద్యను నేర్చినా ఒక దయ్యము వేరే మనిషిలో దూరినట్లు దూరడము తప్ప అందులో ఏమీ లాభము లేదు.

**3) ప్రశ్న :- జీవుడు ఏకకాలములో ఒకే శరీరములో ఉండునని బ్రహ్మవిద్యా శాస్త్రము ద్వారా తెలియపరచబడినది. "శ్రీవల్లభ చరితామృతము"లో ఏక కాలములో జీవుడు విభిన్న దేహములను ధరించి తన కర్మను త్వరగా అనుభవించుటకు అవకాశము ఉన్నదని తెలియజేసినది. ఇది సాధ్య పడుతుందా?**

**జవాబు :-** ఒక కాలములో ఒక జీవుడు ఒక శరీరములో ఉండుట సత్యము గానీ అనేక శరీరములలో ఉండుట అసంభవము. ఇటువంటి మాటలు బ్రహ్మవిద్యా శాస్త్రమునకు పూర్తి వ్యతిరేఖము. దీనిని నమ్మకూడదు.

**4) ప్రశ్న :- కబీరు గొప్ప జ్ఞాని, వీరు మూడు ఆత్మల జ్ఞానమును బోధించినట్లు తెలియుచున్నది. గత శతాబ్దిలో సఫాల్ దేవ్ మహరాజ్ అను వ్యక్తి ద్వారా కబీరు జ్ఞాన ప్రచారము చేయించుచూ పరబ్రహ్మ సాక్షిగా యుండగా, అక్షరబ్రహ్మ సృష్టి స్థితి లయము చేయుచున్నాడని తెలిపాడు. పరబ్రహ్మ వ్యాపించిన ఈ విశ్వములో ప్రకృతి మరియు అక్షర బ్రహ్మ 1/4 భాగము వ్యాపించియున్నట్లు తెలియజేశాడు. అంటే పరబ్రహ్మ ఉన్న 3/4 భాగములలో ప్రకృతి మరియు అక్షర బ్రహ్మ లేనట్లు తెలిపినాడు. ఈ విధమైన కొలతలు సత్యమైనవా?**

**జవాబు :-** పరబ్రహ్మ, అక్షర బ్రహ్మ అనుమాటలు వాస్తవమే. అయితే నాలుగవ వంతు ప్రకృతి, అక్షర బ్రహ్మయున్నాయనడము చూస్తే ప్రకృతి గానీ, అక్షర బ్రహ్మగానీ పూర్తి తెలియనట్లేయనిపిస్తున్నది. ఆయన చెప్పిన లెక్కలు పూర్తి తప్పు.

**5) ప్రశ్న :- "చెట్టుముందా? విత్తుముందా?" అను గ్రంథమునుండి జన్మకు కారణము కర్మయని తెలియుచున్నది. "యోగ వాసిష్టము" అనే గ్రంథములో కర్మకు కారణము అజ్ఞానము అని తెలియజేయబడినది. జ్ఞానము వికసించిన కర్మ నాశనమగును. అందువలన కర్మకు మూలము అజ్ఞానమా?**

**జవాబు :-** జన్మకు కారణము కర్మయని చెప్పడము శాస్త్రబద్ధము. దానిని ఎవరూ ఖండించలేరు. అయితే కర్మకు కారణము అజ్ఞానము అనడము

సరియైన నిర్వచనము కాదు. కర్మకు కారణము 'అహము' అని బ్రహ్మ విద్యా శాస్త్రములో చెప్పుచున్నారు. అహమును అణచితే కర్మయోగము అగునని కూడా చెప్పుచున్నారు. కర్మకు కారణము అహము అని చెప్పక అజ్ఞానము అని చెప్పడము పూర్తి తప్పు. అజ్ఞానము వలన నేరుగా కర్మ రాదు. అజ్ఞానము వలన అహము పనిచేయగా, అహము వలన కర్మ వచ్చుచున్నది. ఏ విషయమైనా శాస్త్రబద్ధము కానిది వదలి వేయవలెను.

ఇక్కడ నుండి ఒక ముస్లీమ్ వ్యక్తి అడిగిన ప్రశ్నలు గలవు. మొదట 200 ప్రశ్నలను ఒకే వ్యక్తి హిందూ సమాజములోని వ్యక్తి, ప్రత్యేకించి బ్రాహ్మణుడు అడిగిన ప్రశ్నలు, తర్వాత క్రైస్తవ సమాజమునుండి ప్రత్యేకించి బోధకుడయిన పాస్టరు గారు అడిగిన ప్రశ్నలు వ్రాయడము వలన రెండు సమాజముల వారినుండి వచ్చిన ప్రశ్నలకు జవాబులు ఇచ్చినట్లయినది. ఇప్పుడు ముస్లీమ్ సమాజమునుండి వచ్చిన ప్రశ్నలకు జవాబులు వ్రాయడము వలన మూడు మతముల నుండి వచ్చు సంశయములకు జవాబు చెప్పినట్లగును. చెన్నై నుండి షఫీగారు అడిగిన ప్రశ్నలను చూస్తాము.

**1) ప్రశ్న :- దైవగ్రంథములయిన భగవద్గీత, ఇంజీలు, ఖురాన్‌లలోని విషయములు కర్మాతీతమా? కాదా?**

**జవాబు :-** వాస్తవముగా దేవుడు చెప్పిన విషయములు కర్మాతీతమైనవే. అయితే కర్మాధీనములోని విషయములు కొన్ని మూడు గ్రంథములలోను కలిసియున్నవి. ఉన్న కర్మను లేకుండా చేయు జ్ఞాన విషయములు కర్మాతీతమైనవి. లేని కర్మను తెచ్చి మనిషికి అంటగట్టు ప్రపంచ విషయములు కర్మాధీనమైనవి. దైవగ్రంథములలో దేవుడు జ్ఞాన విషయములను చెప్పియుంటే మనిషి తన పెత్తనమును చూపుటకు ప్రపంచ

విషయములను దైవ గ్రంథములందు చేర్చుడమేకాక అందులో చెప్పిన దైవికమయిన జ్ఞాన విషయములకు కూడా ప్రపంచ సంబంధ అర్థములను అంటగట్టుచూ ప్రజలకు దైవ గ్రంథములలోయున్న జ్ఞానమును తెలియకుండానే చేయుచున్నారు. ఆ విషయములను మేము ఖండించి దైవ గ్రంథములో దేవుడు దైవజ్ఞానమునే చెప్పాడని ప్రపంచ విషయములను చెప్పలేదని చెప్పుచున్నాము.

**2) ప్రశ్న :- స్వప్నము సత్యాసత్య మిళితమా?**

**జవాబు :-** అవును. స్వప్నములో కొన్ని సత్యములు, కొన్ని అసత్యములని తెలియుచున్నవి. అయినా ఇది సత్యమనిగానీ, ఇది అసత్యమనిగానీ ఎవరూ నిరూపించలేరు. స్వప్నములన్నియూ జ్ఞాన సంబంధమైనవి గానే అర్థము చేసుకొన్నప్పుడు వాటి వలన జ్ఞానము తెలియును.

**3) ప్రశ్న :-ఆత్మ స్త్రీ సంబంధమైనదా, పురుష సంబంధమైనదా?**

**జవాబు :-** ఆత్మను గురించి భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున చెప్పినప్పుడు ఆత్మను, జీవాత్మను ఇద్దరినీ పురుషులని చెప్పారు. ఒకమారు ఆత్మను పురుషుడని చెప్పడము వలన ఆత్మ ఎప్పటికీ పురుషుడేయని చెప్పవచ్చును. అయితే మాటలలో ఒక్కొక్కమారు స్త్రీలింగముగా అది, ఇది అని చెప్పబడుచుండును. తర్వాత కొన్ని సందర్భములలో అతను, వాడు అని పురుష లింగముగానే చెప్పుచున్నాము. జీవాత్మ, ఆత్మ, ఇద్దరూ పురుషులుకాగా, పరమాత్మ (దేవుడు) పురుషోత్తముడుగా యున్నాడు.

**4) ప్రశ్న :- మా గ్రంథమయిన ఖురాన్‌లో జీవాత్మ, ఆత్మయని ఎక్కడా చెప్పలేదు. మీరు భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో ఒకటే**

**జ్ఞానమున్నదని చెప్పారు కదా! మా గ్రంథములో ఆ విధముగా ఎక్కడా కనిపించలేదు కదా! ముస్లీమ్ పెద్దలు ఖురాన్ గ్రంథము ప్రత్యేకమయినది దానిలోని జ్ఞానము మిగతా గ్రంథములలోని జ్ఞానముకంటే గొప్పదని చెప్పుచున్నారు. దానిని గురించి మీరు ఏమి చెప్పెదరు?**

**జవాబు :-** మూడు దైవ గ్రంథములు ఏదీ ఒక మతమునకు సంబంధించినది కాదు. మూడు గ్రంథములలోని జ్ఞానము ఒక్కటిగానే ఒకే సిద్ధాంతమునే బోధించుచున్నది. సమస్త మానవాళికి ఇది హితోపదేశము అని ఖురాన్‌లో 81వ సూరాలో 27వ ఆయత్‌నందు చెప్పియున్నారు చూడు. **(81-27) "ఇది సమస్త లోకవాసులకు హితోపదేశము".** ఈ మాటను చెప్పియుండుట వలన మీరు ఖురాన్‌ను 'మా గ్రంథము' అని అనకూడదు. ఖురాన్ అందరి గ్రంథము. అందులో వ్రాయబడిన భాష వలన, అనువాద భాష వలన కొన్ని పదములు వేరుగా కనిపించినా మూడు గ్రంథములలో చెప్పబడిన జ్ఞానము ఒక్కటేయని తెలియుచున్నది. మీ పెద్దలు మిగతా గ్రంథములకంటే ఖురాన్‌లో ఎక్కువ జ్ఞానమున్నదని ఎలా చెప్పారో మాకు తెలియదు. స్వయముగా ఖురాన్ గ్రంథమే ముందు వచ్చిన గ్రంథముల జ్ఞానమే తనయందున్నదని చెప్పుచూ ముందు వచ్చిన తౌరాతు, ఇంజీలు గ్రంథములను ధృవీకరించుచున్నానని చెప్పినది. ఈ విషయమును ఖురాన్ గ్రంథములో **(5-48) "మేము నీ వైపుకు ఈ గ్రంథాన్ని (ఖురాన్‌ను) సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాములను సత్యమని ధృవీకరిస్తుంది. నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు."** ఈ ఆయత్‌ను చూచిన తర్వాత మాది గొప్ప గ్రంథము, ఇతరులది కాదు అని

అంటే అతడు ఖురాన్ గ్రంథములోని ఈ వాక్యమునకు వ్యతిరేఖముగా మాట్లాడినట్లగును.

**5) ప్రశ్న :- తౌరాతు మూసా ప్రవక్తకు ఇవ్వలేదని, మూసాకు గ్రంథమును ఇచ్చాము అని చెప్పుచున్నారు గానీ ఫలానా గ్రంథమని చెప్పలేదు అని తౌరాతు గ్రంథమునే మూసాకు ఇచ్చాడని మీకు ఎలా తెలుసు అని కొందరు అడుగుచున్నారు. దానికి మేము ఏమి చెప్పాలి?**

**జవాబు :-** మూసాకు దేవుడు తౌరాతు గ్రంథమును ఇవ్వకపోతే వారికి తెలిసి ఏ గ్రంథము ఇవ్వబడినదో చెప్పమని మీరు అడగండి. విశ్వములో నాలుగు గ్రంథముల పేర్లు అందరికీ తెలుసు. అవియే **జబుర, తౌరాతు, ఇంజీలు, ఖురాన్** అని చాలామంది చెప్పగా విన్నాము. ఈ నాలుగు పేర్లు మిగతా మతముల వారికంటే ముస్లీమ్‌లకు బాగా తెలుసు. ఎందుకనగా! ఈ నాలుగు పేర్లు ఖురాన్ గ్రంథములోనే ఉన్నాయి. అయితే అందరికీ తెలియని విషయమేమనగా! ఈ నాలుగు పేర్లలో మొదటి పేరయిన **జబుర** అనునది గ్రంథము కాదు. మిగతా **తౌరాతు, ఇంజీలు, ఖురాన్** మూడు గ్రంథములేయని చెప్పవచ్చును. మూడు గ్రంథములలో మొదటిదయిన తౌరాతు గ్రంథము ఖురాన్‌లో చాలామార్లు చెప్పబడినది. తౌరాతు అను పేరు ముస్లీమ్‌లకు ఖురాన్ చదివిన వారందరికీ తెలుసు. అయితే ఆ గ్రంథము పేరు తెలుసుగానీ దానిని ప్రపంచములో చూచిన వాడు ఒకే ఒక వ్యక్తి మోషే. ఆయననే మూసాయని ఖురాన్‌యందు చెప్పుచున్నాము. ఇంజీలు గ్రంథములో చెప్పబడిన మోషే ప్రవక్తయే ఖురాన్ గ్రంథములో మూసాగా చెప్పబడుచున్నాడని కూడా చాలామందికి తెలియదు. బైబిలు (ఇంజీలు) గ్రంథములో చెప్పబడిన మోషేకు తౌరాతు గ్రంథము ఇవ్వబడినది.

తౌరాతు గ్రంథమును ముట్టుకొన్నవాడు, చూచినవాడు ఒక్క మోషే మాత్రమే. మోషే తప్ప ఇతర ఏ మానవుడు తౌరాత్ అను పేరుగల గ్రంథమును చూడలేదు. నాలుగు గ్రంథములలో **జబూర** అనునది గ్రంథమే కాదు అది పేరు మాత్రమే. తర్వాత **తౌరాతు** అనునది గ్రంథమే అయినా దానిని మోషే ప్రవక్త ఒక్కడు చూచాడు. మోషే, మూసా ఇద్దరూ ఒక్కరే అయినందున మూసా తప్ప ఎవడూ తౌరాతు గ్రంథమును చూడలేదు. ఇక మిగిలినది ఇంజీలు, ఖురాన్ గ్రంథములు ఈ రెండును అందరూ చూచారు.

**6) సూరా 2, ఆయత్ 187లో ఏ విషయమును గురించి చెప్పారు? ప్రపంచ విషయమునా, పరమాత్మ విషయమా?**

**జవాబు :-** సూరా 2, 187వ ఆయత్‌లో మొదటినుండి చివరి వరకు ఒకే విషయమును చెప్పారు. అది దేవునికి సంబంధించిన విషయము కాదు. అది కేవలము మనుషులకు సంబంధించిన విషయముగానే యున్నది. భార్యాభర్తలు ఒకరినొకరు శారీరకముగా కలుసుకొను విషయమై చెప్పియున్నారు.

**7) ప్రశ్న :- సూరా 2, 187వ వాక్యములో చెప్పినది ప్రపంచ విషయమేనని అదియూ భార్యాభర్తల కలయిక విషయమని చెప్పుచున్నారు కదా! ఇది ప్రపంచ సంబంధ విషయమే కదా! ఈ విషయముతో దేవునికి ఏమి అవసరము అని నేను ఇతరులను అడిగాను. దేవుడు కర్మపత్రములో వ్రాసిన ప్రకారమే ప్రతీదీ జరుగునని అదే ఖురాన్ గ్రంథములో వ్రాశారు కదా! అలాంటప్పుడు కర్మ ప్రకారమే భార్యాభర్తల కాపురము, కలయిక ఉండును కదా!యని అడిగాను. దానికి వారు భార్యాభర్తల విషయమును ధర్మసమ్మతము చేయుటకు అక్రమముగా నడువకుండా యుండుటకు**

**అని చెప్పారు. అంతేకాక రాత్రిపూట మాత్రమే ఆ పనికి ధర్మసమ్మతమైనదనీ, పగలు పూట రంజాన్ నెలలో ఉపవాసముండుటకు రాత్రిపూట తొలిజాము 4 గంటలనుండి తిని, త్రాగి పగలంతా ఉపవాసముండమని చెప్పాడు అని అన్నారు. వారు ఇలా చెప్పగా ఉపవాసము కూడా దేవునికి సంబంధించిన దైవజ్ఞానమునకు సంబంధించిన విషయము కాదు కదా!యని అనుమానము వచ్చినది. ఈ ఆయత్‌లో ఉపవాసమునకు సంబంధించిన విషయమున్నదా? అని అడుగుచున్నాను. మీరు ఏమి చెప్పగలరు?**

**జవాబు :-** రెండవ సూరా 187వ ఆయత్‌లో మొదటినుండి చివరి వరకు చదివి చూచాము. అల్లాహ్ తన ఆయత్‌లో ఏమి చెప్పాడో దానిని దాచిపెట్టి తమకు ఇష్టమైన విషయములను అందులో చేర్చి చెప్పువారికి శాపము తప్పదని ఖురాన్ గ్రంథమందు దేవుడు రెండవ సూరా 159వ ఆయత్‌లో చెప్పియున్నాడు. **(2-159) "మేము అవతరింపజేసిన స్పష్టమైన బోధలను, మార్గదర్శకత్వాలను ప్రజల కొరకు దివ్యగ్రంథములో స్పష్టపరచిన పిదప కూడా దాచుతారో వానిని అల్లాహ్ తప్పక శపిస్తాడు. మరియు శపించగల వారు కూడా వారిని శపిస్తారు"** అని వ్రాసియున్నది. ఈ విషయము తెలియక కొందరు దేవుని వాక్యమును తమ ఇష్టమొచ్చిన విధముగా మార్చి దేవుడు చెప్పని విషయమును చేర్చి చెప్పుచున్నారు. అంత అవసరము ఏమి వచ్చిందో? ఒకవేళ ఎవరయిన తెలిసినవారు మీరు చెప్పు వివరమును దేవుడు చెప్పలేదు. దేవుడు చెప్పిన భావము వేరుగాయున్నది కదా! ప్రత్యక్షముగా కనిపించునట్లున్న భావమును తీసివేసి వేరే భావమును చెప్పుట వలన దేవునికి మీ మీద కోపము రాగలదు. దేవునివైపునుండి మీకు శాపము రాగలదు. దేవునివైపునుండే కాక దేవుని పాలనలో గల గ్రహముల, భూతముల నుండి కూడా శాపము

రాగలదు. వారినుండి చెడు జరుగగలదు అని చెప్పితే అట్లే కానీలే అని భయము లేకుండా చెప్పుచున్నారు. అటువంటి వారికి దేవుని శిక్ష తప్పదు.

**8) ఖురాన్‌లోని జ్ఞానమును ఎవరు బోధించారు? ఎలా బోధించారు? ఎవరికి బోధించారు? ఎంత కాలము బోధించారు?**

**జవాబు :-** జిబ్రయేల్ అను ఆకాశ గ్రహము తెరచాటునుండి బోధించాడు. ముహమ్మద్ ప్రవక్తగారికి బోధించాడు. 23 సంవత్సరములు ఖురాన్ జ్ఞానమును బోధించడము జరిగినది.

**9) ప్రశ్న :- ద్వాపరయుగము చివరిలో కృష్ణుడు భగవద్గీతను అర్జునునకు పది నిమిషములలోపే బోధించాడు. ఏసు ఇంజీలు జ్ఞానమును (నాలుగు సువార్తల జ్ఞానమును) మూడు సంవత్సరములలో బోధించాడు. ఖురాన్ జ్ఞాన విషయమును జిబ్రయేల్ 23 సంవత్సరములు ఎందుకు బోధించాడు? ముందు వచ్చిన గ్రంథములు భగవద్గీత కొన్ని నిమిషములలోనూ, బైబిలు మూడు సంవత్సరములలోనూ చెప్పగా, ఖురాన్ జ్ఞానము చెప్పుటకు 23 సంవత్సరములు ఎందుకు పట్టినది?**

**జవాబు :-** ఆకాశమునుండి దిగివచ్చిన జిబ్రయేల్ ఖురాన్ జ్ఞానమును చెప్పాడు అన్నది వాస్తవమే. క్రిందనే ప్రక్కనే యుంటున్న కృష్ణుడు అర్జునునకు ఎంతకాలమయినా భగవద్గీతను చెప్పవచ్చును. అయినా పది నిమిషముల లోపే పూర్తి చెప్పేశాడు. ఒకచోట నిలకడలేని ఏసు పర్యటించుచూ సమయము దొరికినప్పుడంతా సువార్తల జ్ఞానమును చెప్పాడు. అలా మూడు సంవత్సరములు చెప్పాడు. చివరిలో తన శిష్యులతో గడిపి భోజనము చేసినప్పుడు చివరిగా చెప్పవలసిన విషయములన్నియూ చెప్పాడు.

ఇక ఖురాన్ విషయమునకు వస్తే ఎంతో దూరమునుండి వచ్చు జిబ్రయేల్ ఒక్కమారుగా జ్ఞానము చెప్పుటకు వీలుపడలేదు. ముహమ్మద్ ప్రవక్తగారు చదువురానివాడైనందున జ్ఞానమంతయూ ఒకేమారు చెప్పుటకు వీలులేదు. అందువలన రెండు లేక మూడు వాక్యములకంటే ఎక్కువ చెప్పేవాడు కాదు. జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును ప్రవక్తగారు విని తర్వాత తన ఇంటికి వచ్చి తన అనుచరులకు చెప్పగా వారిలో ఒకరు లేక ఇద్దరు చదువు వచ్చిన వారుంటే దానిని వ్రాసిపెట్టే వారు. ఆ కాలములో ఆ దేశములో అంతా చదువురానివారు ఎక్కువగాయుండేవారు. ఎప్పుడయినా ఒకమారు ప్రవక్త గారు తెచ్చిన సందేశమును వ్రాసుకొనుటకు ఎవరూ లేకుండెడివారు. అప్పుడు అక్కడున్న వారు విని జ్ఞాపకము పెట్టుకొనెడివారు. ఈ విధముగా రెండు, మూడు వాక్యములకంటే ఎక్కువ చెప్పుటకు వీలు లేనందువలన, ఆకాశమునుండి వచ్చు జిబ్రయేల్ నెలకొకమారుగానీ రెండు మూడు నెలల కొకమారు గానీ రావడము వలన 23 సంవత్సరముల ఖురాన్ బోధ సాగింది.

**10) ప్రశ్న :- ఏసుప్రభువు వారు తన జ్ఞానపు చివరిమాటను చివరి భోజన రాత్రి పూర్తిగా చెప్పుకోవడము దానికంటే కొన్ని రోజులముందు నుండి చెప్పుకోవడము జరిగినది. అలా ఖురాన్ జ్ఞానము అయిపోయింది అని జిబ్రయేల్ ప్రవక్తగారికి చెప్పాడా?**

**జవాబు :-** లేదు ఖురాన్ జ్ఞానము అయిపోయింది అని ఎక్కడా, ఎప్పుడూ చెప్పలేదు. సంపూర్ణముగా చెప్పానని జిబ్రయేల్ చెప్పాడని కొందరు ముస్లీమ్‌లు చెప్పుచున్నా అందులో వాస్తవము లేదు. ముహమ్మద్ ప్రవక్త చనిపోతాడు అని జిబ్రయేల్‌కు తెలిసియున్నా ఆ విషయమును ప్రవక్తగారికి జిబ్రయేల్ చెప్పియుండేవాడు. ప్రవక్తకు కూడా తాను చనిపోతానని

ఏమాత్రము తెలియదు. భవిష్యత్ అంధకారము ప్రవక్తకు జ్ఞానము చెప్పు జిబ్రయేల్ ఆకాశమునుండి వచ్చుటకు దాదాపు మూడు నెలలకు పైన పట్టినది. భూమిమీదికి వచ్చిన తర్వాత జిబ్రయేల్‌కు ప్రవక్తగారు చనిపోయిన విషయము తెలిసినది. ప్రవక్తగారు చనిపోకపోతే ఇంకా కొంత జ్ఞానము జిబ్రయేల్ ద్వారా తెలిసేది. ప్రవక్త చనిపోయిన విషయము జిబ్రయేల్‌కు తెలియడమేకాక తాను భూమిమీదికి వచ్చి జ్ఞాన వాక్యములు చెప్పిపోయిన తర్వాత 82 రోజులకు చనిపోయాడని తెలిసినది. అట్లే ప్రవక్త మరణమునకు కారణమయిన రోగము ఏమి? అని జిబ్రయేల్ తన జ్ఞానము చేత తెలియ గలిగాడు. తర్వాత జిబ్రయేల్ క్రిందికి రాలేదు.

**11) ప్రశ్న :- ప్రవక్తగారు మరణించిన తర్వాత ఎన్ని దినములకు జిబ్రయేల్ భూమిమీదికి రావడము జరిగినది.**

**జవాబు :-** ప్రవక్తగారు చనిపోయిన తర్వాత జిబ్రయేల్ ఎప్పుడు వచ్చాడని ఖచ్చితముగా చెప్పలేము గానీ మూడు నాలుగు రోజులకే వచ్చియుంటాడని ఒక అంచనాగా చెప్పవచ్చును. మా అంచనా తప్పు కూడా కావచ్చును. ప్రవక్తగారు చనిపోకనే 82 రోజుల ముందు జిబ్రయేల్ జ్ఞానమును విన్నాడని చరిత్ర గలదు. జిబ్రయేల్ మూడు నెలలు మించి ఐదారు రోజుల కంటే ఎక్కువ ఎప్పుడు ఆలస్యము చేయలేదు. అందువలన ప్రవక్త చనిపోయిన మూడు రోజుల తర్వాత ఒకటి లేక రెండు రోజులు అటు ఇటు వచ్చియుండును అని అనుకుంటాము. ఇంకా రెండు సంవత్సరములు ప్రవక్త బ్రతికియుంటే బాగుండేదని జిబ్రయేల్ ఇతరులతో చెప్పినట్లు కలదు. జిబ్రయేల్ ఇతర గ్రహములతో చెప్పియుండుట వలన ఆ గ్రహములు వచ్చి ప్రవక్తగారి చావుకు కారణమయిన రోగమును దండించడము జరిగినది.

మీరు చేసిన పనికి ఒక ముఖ్యమైన వ్యక్తి చనిపోవడము జరిగినది. ఆయన ఇంకా రెండు సంవత్సరములు బ్రతికియుంటే బాగుండేది. ఆయన ద్వారా ప్రజలకు దైవజ్ఞానము అందేదని దండించడము జరిగినది. ఆ విషయము మాకు తెలియదనీ దేవుని పాలనలో విధులు నిర్వహించువారమైనందున ఆయుష్షు తీరిన వారిని చంపవలసి వచ్చినదని వారు చెప్పడము జరిగినది. చివరకు అది అల్లాహ్ నిర్ణయమని అందరూ అనుకోవడము జరిగినది. దీనినిబట్టి ఇంకా కొన్ని ఆయత్‌లు ప్రవక్తగారు ఉండివుంటే వచ్చేవి. ఆయన పోయిన దానివలన మనుషులు రెండు సంవత్సరముల జ్ఞానమును కోల్పోయారు. రెండు సంవత్సరములలో కనీసము ఎనిమిది నుండి పది మార్లయినా జిబ్రయేల్ వచ్చి జ్ఞానమును చెప్పేవాడు. ఆ లెక్కప్రకారము దాదాపు 20 నుండి 25 ఆయత్‌ల వరకు మనకు ఇంకా తెలిసియుండేవి. అల్లా అంతటితో ఆపివేశాడు కనుక జిబ్రయేల్ చెప్పినంత వరకు మానవుడు మోక్షము పొందు జ్ఞానము వచ్చియున్నదని తలచవచ్చును. మనిషి దేవుని వద్దకు చేరుటకు అల్ ఇఖ్లాస్ అను 112వ సూరాలోని నాలుగు ఆయత్‌లు అర్థము చేసుకోగలిగితే చాలు. మిగతా వాటి అవసరము లేకపోవచ్చును.

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

